స్వామి కోవెలలో అగ్రతీర్థం, సాగిరు ఏర్పాటు చేశారు ఇప్పటికీ ఈ అగ్ర తీర్థ మర్యాద నడుస్తూంది (సాగిరు పోయినా)[165]

ఆత్రేయాచార్యులను అప్పాయ దీక్షితులని, పెద్దయ్యవార్లని శ్రీనివాసాచార్యులను అభినవ నిగమాంత మహాదేశికులని, చిన్నయ్యవార్లని జనం గౌరవంతో వ్యవహరించేవారు ఆత్రేయాచార్యులు 74 సంవత్సరాలు జీవించారు ఈయన రచనల వివరాలు తెలియవు ఆచార్య వింశతి, ప్రపదన వైభవస్తుతి, యతిరాజ వందకమ్ మొదలయినవి లఘుకృతులు లభిస్తున్నాయి శ్రీమద్భాగవతానికి విశిష్టాద్వైతపరంగా భాగవత చంద్రచంద్రికా అనే వ్యాఖ్య రచించిన గండికోట వాస్తవ్యులైన వీరరాఘవాచార్యులు తమ వ్యాఖ్యానాన్ని శ్రీనివాసాచార్యులకు చూపి పరిష్కరింపజేసుకొన్నారని వీరరాఘవీయమని ప్రసిద్ధి చెందిన ఈ వ్యాఖ్యానాన్ని ప్రచురించిన శ్రీ కృష్ణబ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు ఉపోద్ఘాతంలో తెలిపారు[166] శ్రీనివాసాచార్యులు రచించిన గ్రంథాలు అనేకం వీరరాఘవీయంలో ఉదాహరించిన గ్రంథాలు మాత్రం ఇవి 1 తత్త్వ మార్తాండః, 2 నయ ద్యుమణిః 3 హరిగుణ దర్పణమ్, 4 భేద దర్పణమ్, 5 దేవతా ప్రసాదదర్పణమ్, 6 ప్రతితంత్ర దర్పణం, 7 ప్రణవ దర్పణమ్, 8 తత్త్వ దర్పణమ్, 9 జిజ్ఞాసా దర్పణమ్, 10 షష్ఠీ దర్పణమ్, 11 సౌర దర్పణమ్, 12 గుణ మీమాంసా 13 సిద్ధాంతచింతామణిః, 14 పరబ్రహ్మ నిరాకరణానందః 15 తారతమ్య ఖండనమ్ 16 విజయ పతాకః, 17 సంగతిరత్న ప్రకాశికా, 18 జ్ఞానరత్న ప్రకాశికా 19 విరోధ విరోధినీ ప్రమాథినీ, 20 తప్తముద్రా విద్రావణ ప్రద్రావణమ్

ఈయన తెలుగులోను పెక్కు పాటలు, పద్యాలు రచించారు గండికోట శ్రీ వైష్ణవస్త్రీలలో ఇవి నేటికీ ప్రచారంలో వున్నాయి

రాఘవ పామునాయకుని పెద్దభార్య దేవదుర్గాధిపతి తిప్పనాయకుని కుమార్తె తిమ్మమ్మ ఈమెకు 1757లో కుమారుడు కలిగాడు ఇతని పేరు ఇమ్మడి వెంకటప్పనాయకుడు పామనాయకుని తర్వాత ఇతడు రాజ్యానికి వచ్చాడు ఇతని రాజ్యకాలం 1778–1802

రాఘవ పామునాయకుని కాలంలో సురపురరాజ్యం పరదాయాదాలకు గురి అయినా, స్థైర్యంతో మళ్ళీ చైతన్యవంతమైంది రాజ్యం అభివృద్ధిపథంలో ముందంజ వేయడంవల్ల

---

165 శ్రీ పెరుమాళ్ళ సుందరాచార్య నగరవార దర్శన, పుట 104

166 శ్రీమతి తిరుమల సుచరిత నగరవార దర్శన, పుట 280

సాంస్కృతిక పురోగతికూడ జరిగింది ప్రజలు ప్రశాంతంగా జీవించారు నిష్టి కరంప్ప, నిష్టి వీరప్పలు మంత్రిత్వం సఫలమైంది రాజు వీరవైష్ణవుడు, మంత్రులు వీరశైవులు ఈ మతసామరస్యం గణనీయమైంది

పామనాయకుని దేవేరి తిమ్మమ్మ 1772లో మరణించింది పామనాయకుడు 1771లో జబ్బుతో మంచంపట్టాడు జబ్బు దినదినానికి హెచ్చిందేకాని, తగ్గలేదు అతడు 1773లో (విజయ సంవత్సరం, ఆశ్వయుజ బహుళ తదియనాడు) పరమపదం చేరాడు ఆ సమయంలో అతని తక్కిన భార్యలు జల్లిపాటి లచ్చమ్మ, గలుగు వెంకమ్మ, వాలిహాళ్ళ పెద్దమ్మ, రామక్క, మంగమ్మ దగ్గర ఉన్నారు పామనాయకుని రాజ్యకాలం 1762–1773 అతడు 1739 సిద్ధార్థి సంవత్సర పుష్యశుద్ధ సప్తమినాడు రమణప్ప నాయకునికి లక్ష్మాంబకు జన్మించాడు 34 సంవత్సరాలే జీవించాడు సురపుర రాజుల చరిత్ర ప్రస్తుతం ముమ్మడి రాఘవ పామనాయకుని వరకే అవసరం గనుక సంగ్రహంగా తెలిపాను

సురపురం రాజ వంశావళి అక్కడక్కడేగాయి వరకు ఇదివరకు తెలిసిందే సురపురం రాజ్యస్థాపకులు మొదలు తక్కినవారి వంశక్రమం ఇది [167]

1 గడ్డి పెద్దనాయకుడు
(సురపురరాజ్య స్థాపకుడు)
రాజ్యపాలన కాలం 1636–1666

2 హసరంగి (పచ్చంగి) పామనాయకుడు
(ఔరంగజేబు నుంచి సన్మానం, బిరుదులు పొందిన వీరుడు)
1666-1687

3 పీతాంబర బహరి పెద్దనాయకుడు
1687–1726

4 ఇమ్మడి పామనాయకుడు
1737-1741

5 ముమ్మడి పెద్దనాయకుడు
1742–1746

6 మొండిగై (మొండిచేయి) వెంకటప్పనాయకుడు
1747–1762

167 కపటరాళ కృష్ణరావు సురపుర సంస్థాన ఇతిహాస

7 ముమ్మడి రాఘవ పామనాయకుడు
(భార్గవ పురాణకర్త)
1762–1778

8 ఇమ్మడి వెంకటప్ప నాయకుడు
(కిడిబి వెంకటాచార్యులు ఇతని ఆస్థాని)
1778–1802

9 ముమ్మడి పిడ్డనాయకుడు
1802–1818

10 ముమ్మడి వెంకటప్ప నాయకుడు
1818–1827

11 కృష్ణప్పనాయకుడు
1827-1842

12 నాల్గడి వెంకటప్పనాయకుడు
1842-1858

ఇతడు బ్రిటిష్ వారికి ఎదురుతిరగడంవల్ల బ్రిటిష్ ప్రభుత్వం ఇతనికి మరణశిక్ష విధించింది తర్వాత సురపురం నిజాం రాజ్యంలో చిన్న సంస్థానమయింది ఈ వీరవ్యాధవంశం వారు ఇప్పటికీ ఉన్నారు స్వాతంత్ర్యానంతరం అన్ని సంస్థానాలలాగ ఇదీ రద్దయింది ఈ రాజవంశంవారయిన రాజా వెంకటప్పనాయకుడు లోక్‌సభ సభ్యులుగా వున్నారు

## వీర శూర వ్యాధ జాతి

సురపురరాజ వంశీయులు వ్యాధజాతివారు ఈ జాతి పరాక్రమానికి, నీతినియమాలకు గీటురాయయిన జాతి, వ్యాధ శబ్దం వ్యాధ-బ్యాధ-బేద అయింది కన్నడంలో బేద - బేద శ్రీలంకలో ప్రాచీన జాతి వెద్ద, ఈ పదమూ వ్యాధ శబ్ద భవమే తెలుగులో బోయ అయింది క్రమంగా వ్యాధ – బ్యాధ – బ్యాద అయినట్లే, వాహ–వాఅ-వా అ – బోయగా మారింది వ్యాధుల పరాక్రమాన్ని, సాహసాన్ని, శరీరసౌష్ఠవాన్ని, నిష్కాపట్యాన్ని గురించి గాథాసప్తశతిలో వర్ణనలు కొల్లలు రెండువేల సంవత్సరాలనుంచి ఈజాతివారు సేనానాయకులుగా దుర్గపాలకులుగా, తలారులుగా (నగరపాలకులుగా) కీర్తిపొందారు భారతదేశాన్ని పాలించిన ప్రతి రాజవంశమూ ఈ వ్యాధులను ఆదరించింది చాళుక్య, రాష్ట్రకూట, విజయనగర, మొగల్, కుతుబ్‌షాహి, బహమనీ రాజుల సైన్యాలలో ప్రబలంగా వున్న దళాలు వ్యాధులవి విజయనగర చక్రవర్తులు, ముఖ్యంగా కృష్ణదేవరాయలు వీరిని సేనానాయకులుగా, రాజప్రతినిధు

లుగా, వగరతలారులుగా, తనకు అంగరక్షకులుగా నియమించారు రాయల అంగరక్షకుల దొస్తే నాయకుడు గొంగ గు పాలుడు బోయతే దుర్గరక్షకుడై పాళెగారు వీరి మాతృభాష తెలుగు (ఈ విచిత్రమైన తెలుగు గురించి ప్రత్యేకంగా పరిశోధన జరగాలి)

ఈ వ్యాధుల మూలస్థానం దక్షిణాపథంలో నేటి కర్నాటకలోని గుల్బర్గ, బీజాపూర్, బెళగాం, రాయచూర్, బళ్ళారి, చిత్రదుర్గం జిల్లాలు, ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలు, తమిళనాడులోని ఉత్తర ఆర్కాడు, చెంగల్పట్టు జిల్లాలు వీరి రణోత్సాహం అసాధారణం ఈ బోయ పాళెగాళ్ళ ముఖ్యంగా సురపురంవారలు, తాదిమర్రి పాళెగాళ్ళ తమకు ఎదురుతిరిగినందువల్ల ఔరంగజేబు ఈ వీరి వారిని సైన్యంలో చేర్చుకోరాదని ఉత్తర్వు చేసింది[168] వ్యాధుల పరాక్రమం గురించి, పద్మంగి పామనాయకుని గురించి సుప్రసిద్ధ చరిత్రకారుడు ప్రొఫెసర్ జదునాథ సర్కార్ ముక్తకంఠంతో పొగిడారు – "అతని పదాతి సైనికులు గొప్ప గురికారులుగా, మహాధైర్యవంతులుగా పేరుపొందారు వారు యుద్ధంలో గాయాలను, మృత్యువును లెక్కపెట్టేవారు కారు'[169]

బేడ శబ్దం ఉచ్చారణ తెలియని ముస్లిం నోట్లోపడి వివిధ వికారరూపాలు పొందింది బేరడ్, బిర్యా, బిర్డి, బేందర్, బేదర్ అని అల్లే వాగినగిరి కూడ వాగిన్ ఖేరా అని, వాకిన్‌ఖేడ్ అని వికారరూపాలు పొందింది బేదర్‌కు ముస్లిములు బే+దర్ భయరహితులు అని వ్యుత్పత్తి చెప్పారు చివరకు డాక్టర్ రామరాజుగారి వంటివారు ఆయనను అనుసరించి తిక్కనవారు "బేదర్లు=నిర్భయులు" అని వ్రాశారు గతానుగతికంగా[170] వాక్-ఇన-గిరి = వాగినగిరి బ్రహ్మగిరి అని అర్థం

## భార్గవపురాణంలో వంశావళి

భార్గవపురాణం ప్రథమాశ్వాసంలో రాఘవపామనాయకుడు వర్ణించిన వంశక్రమం ఇది ఈ అన్వయానికి ఆదిపురుషుడు గుహుడు అతని వంశం అనేకశాఖలుగా విస్తరించింది ఆ శాఖలలో కొన్ని వంశంలోనివారు

1 నరసింహ మహీపాలుడు

2 పడియర నాయకుడు

3 కల్ల మహీ వల్లభుడు

---

168 కపటరాళ్ళ కృష్ణరావు—సురపురసంస్థాన చరిత్ర, పుట 224–300 వివరాలు చూడండి

169 పై గ్రంథం పుట 28

170 డాక్టర్ బి రామరాజు మరుగుపడిన మాణిక్యాలు, ప్రొఫెసర్ సాళ్వ-కృష్ణమూర్తి చలాత్మకాపరిణయ పీఠిక, పుట 3

4 చినహనుమ ధరణీకాంతుడు

5 హావి నాయకుడు

6 పెదసోమ నాయకుడు

7 ఎఱ్ఱసింగ ధరణీధవుడు

8 మదిరి ధరాధ్యక్షుడు

9 పిరంబి నాయకుడు

10 బలిసోమ నాయకుడు

11 పెదపామ నాయకుడు

12 దేశాయి బక్క భూవిభుడు

13 గడ్డె పిడ్డ నాయకుడు

14 పెదపామ నాయకుడు
(పచ్చంగి పామనాయకుడు)

15 పీతాంబరావనీశ నాయుడు
(పీతాంబర బహరి పిడ్డ నాయకుడు)

ఈ పీతాంబరావనీనాథునికి ఐదుగురు కుమారులు




సురపురరాజవంశంలో పామ(హావి) నామధేయాలు పలువురు ఉండటంవల్ల గ్రంథ సంస్కర్తలు, పండితులు తికమక పడ్డారు అంతేకాక పిన్న పిన్నలయి యుద్ధాలలో మరణం వల్ల ఎక్కువకాలం రాజ్యం చేయలేకపోయారు అందువల్ల ఒకే తరంలో వారసులు ముగ్గురు నలుగురు కూడ రాజులయ్యారు పీతాంబర నాయకుని పెద్దభార్య కుమారుడైన పామనాయకునికి పెద్ద భార్య కుమారుడు పిడ్డ నాయకుడు, రెండవ భార్య కుమారుడు వెంకటప్ప నాయకుడు (వెంకట క్ష్మావిభుడు) పిడ్డ నాయకునికి

171 లేఖకుడు హనుమధరణీపతిని వదలి పెట్టాడు

సంతానంలేదు గనుక ఇతని సవతి తమ్ముడు వెంకటప్ప నాయకుడు రాజయ్యాడు ఇతడే మొండిచేయి వెంకటప్ప నాయకుడు ఇతనికి కూడ పుత్రసంతానం లేదు ఇతని ఒక పిన తండ్రి కృష్ణ భూపాలుడు (కృష్ణప్ప నాయకుడు) వెంకటప్ప నాయకునికి ఇతనికి (కృష్ణప్పకు) మనస్తాపంవల్ల ఇతడు సురపురం వదలి వెళ్లాడు అందువల్ల మరొక పిన తండ్రి రమణ ధరావరుడు (రమణప్ప) రాజసుడయ్యాడు అతడు వృద్ధుడు కావడంవల్ల రాజ్యం వద్దన్నాడు అతని కుమారుడు రాఘవ పామనాయకుడు రాజయ్యాడు పేర్లవల్ల, రాజ్యకాలం స్వల్పం కావడంవల్ల పలువురు చాల భ్రమ పడ్డారు "పిరాంబురావని పాలని ఐదుగురు కొడుకు లలో పామ మహీధవు డొకడు, ఇతని కొడుకు వెంకట క్ష్మాపాలుడు అతడే వెంకటప్ప కానో పుమ అట్లాగాక భార్గవపురాణ కర్త్రయగు రాఘువ భూపాల పామనాయకునకు వెంకటప్ప యను పుత్రుడుండెనేమో తెలియరాదు పామ మహీధవుని కొడుకైన వేంకట క్ష్మాపాలకుడును రమణ ధరణీ రమణుని కొడుకైన రాఘవ భూపాల పామనాయకుడును అన్నదమ్ముల పిల్లలగుటచే సమకాలికులే అగుదురు" [172] అని ప్రొఫెసర్ సాంబకృష్ణమూర్తి సందేహం ప్రకటించారు ఈ సందేహాల నివారించడం కోసమే పైన వివరంగా చరిత్ర ఇచ్చాను

రాఘవ పామ భూపాలు డిచ్చిన వంశావళిలో నరసింహ నాయకుని తర్వాత పరియర నాయకుడని తెలిపాడు తక్కిన దంతా సరిగావుంది ఇతర చారిత్రకాధారాలవల్ల నరసింహ నాయకుని తర్వాత పీర తిమ్మనాయకుడు, సింగప్ప నాయకుడు ఉన్నారు భార్గవ పురాణ వతారికలోని వంశావళి తెలిపే వచనంలో ఒక పంక్తి లేఖక ప్రమాదంవల్ల ఎగిరిపోయిందని తోస్తుంది "తన్మహీశానికి పీరవరుండగు పీర తిమ్మనాయకుండును, అన్వితునకు సింహ విక్రముడగు సింగప్ప నాయకుడును" అని చెప్తితే సరిపోతుంది

ఇంత స్పష్టంగా చరిత్ర ఉండగా, శ్రీ ఆరుద్ర "భార్గవ పురాణాన్ని వ్రాసిన సుర పురం అధిపతి పామనాయకుడు క్రీస్తుశకం 1696 దాకా జీవించాడు" అని వ్రాశారు" [173] ఆయన ఆధారాలు చూపితే బాగుండేది శ్రీ ఆరుద్ర పద్నంగి పామనాయకుడు, రాఘవ పామ నాయకుడు ఒకరే అని భ్రాంతిపడి వుంటారు పద్నంగి పామనాయకుడు కూడ 1696 వరకు జీవించలేదు అతని రాజ్యకాలం 1686-1687 అతడు ఔరంగజేబు నుండి మన్ సబ్‌లు స్వీకరించడానికి ఢిల్లీకి వెళ్లాడు దర్బారు మర్యాదల తర్వాత హఠాత్తుగా 27-12-1687న మరణించాడు [174] మరి 1696 వరకు జీవించిన పామనాయకు డెవరో!

---

172 ప్రొఫెసర్ సాంబకృష్ణమూర్తి అభిలాత్మకా పరిచయ పీఠిక, పుట 19

173 సమగ్రాంధ్ర సాహిత్యం సంపుట 12, పుట 47

174 ప్రొఫెసర్ జదునాథ సర్కార్ హిస్టరీ ఆఫ్ ఔరంగజేబ్, సంపుటం 4 పుట 337

## కిరీటి వెంకటా చార్యులు

ప్రకృతాన్ప్రసక్తంగా అణ్ణయాచార్యుల కుమారులైన కిరీటం వెంకటాచార్యులను గురించిన అపోహలు, అసంబద్ధపు ప్రచారలను సరిదిద్దవలసివుంది కిరీటం వెంకటాచార్యులు ఇమ్మడి వెంకటప్ప నాయకుని లేక హిరియ (పెద్ద) వెంకటప్ప నాయకుని ఆస్థానంలో వున్నారు

ఇమ్మడి వెంకటప్ప నాయకుడు భార్గవపురాణ కర్త రాఘవ సోమనాయకుని కుమారుడు ఇతని రాజ్యకాలం 1779-1809 ఇతడూ మహావీరుడు మహాపరాక్రమవంతుడు నిజాముతోను, రఘునాథరావు పీష్వాతోను, టిప్పు సుల్తానుతోను, ఆంగ్లేయులతోను యుద్ధాలు చేస్తూ, సంధులు చేసుకుంటూ, సహాయపడుతూ 29 సంవత్సరాలు పాలించాడు ఎంతో రాజనీతిజ్ఞతతో అభినవ వేదాంత దేశిక బిరుదాంకితులైన, అణ్ణయాచార్యుల సోదరులైన శ్రీనివాసాచార్యులు తమ తత్త్వసూత్రాంతంలో ఇతని ఆధ్యాత్మికోన్నతిని వర్ణించారు ఇతడు దేశానికి చేసిన గొప్ప సేవ అప్పటి పిండారీల దండును అణచివేయడం పిండారీల బాధ విపరీతం కాగా, ఇతడు తన రాజ్య పరిపాలన భారాన్ని దాదిమరి కృష్ణ నాయకునికి అప్పగించి, తన వీర నాయక బృందంతో పిండారీల వెంటబడి తన రాజ్యం సరిహద్దుల అవతల తరిమి వారికి తొప్పాళ అనే పట్టణంలోని పెద్ద చెరువులోకి విసిరి పడవేశారు

అణ్ణయాచార్యులకు ముగ్గురు కుమారులు, శ్రీ ఆయన సోదరులైన శ్రీనివాసాచార్యులకు సంతానం లేదు కవి సప్తగిరి గారులా ఈ విషయంలో పొరపడ్డారు[175]

అణ్ణయాచార్యులు

| | | |
|---|---|---|
| శ్రీనివాసాచార్యులు | కిరీటం వెంకటా చార్యులు | బుచ్చి వెంకటాచార్యులు |

శ్రీనివాసాచార్యుల రచన లేమీ లభించడంలేదు తక్కిన అన్నదమ్ములిద్దరి పేర్లు ఒకటే కనుకను చిన్నవారి పేరు బుచ్చి వెంకటాచార్యులన్నారు విశిష్టాద్వైత కిరీటాన్ని ధరించినందున పెద్ద వెంకటాచార్యులకు కిరీటం వెంకటాచార్యులనే పేరువచ్చింది[176] ఈయన 1 గణసూత్రార్థవాద: 2 శృంగార తరంగిణి 3 భావశతకమ్ 4 ఝంఝామారుతః (గదాధరీయఖండనమ్) 5 అలంకారకౌస్తుభమ్ 6 రసిక మానసోల్లాస భాణః 7 కూటవిఘటనమ్ 8 ఉషా పరిణయ నాటకమ్ 9 యతిరాజ దండకమ్ 10 హయగ్రీవదండకమ్ 11 అచలాత్మజా పరిణయము (తెలుగు) మొదలైన షణ్ణవతి (96) గ్రంథాలు రచించారు

---

175 బలుసు వెంకటయ్య, కవిసప్తశతి

176 పెరుమాళ్లగుండాచార్య నగరనాడ దర్పణ పుట 104

కిరీటం వెంకటాచార్యులు సంస్కృతభాషా విదులు, తెలుగు, కన్నడ, మహారాష్ట్రి, హిందీలలోను కవిత చెప్పగల దిట్ట. ఈయనకు, ఇమ్మడి వెంకటప్ప నాయకునికి కొంత మనస్పర్థ ఏర్పడింది. ఈయన శిష్యుల్లో ఒకరిపై రాజా వెంకటప్ప నాయకునికి కోపం వచ్చింది. అతడు గురువు వద్ద మొరపెట్టుకొన్నాడు. "ఈ విషయమై పట్టుదలకు పోవద్దు మనిద్దరికీ మంచిదికాదు" అని ఈయన తన శిష్యునికి సలహా యిచ్చారు. కాని, శిష్యుడు వినలేదు. చివరికి వెంకటాచార్యులు రాజాతో ప్రస్తావించారు శిష్యుని సంగతి. "మీరు గురువులు ఇలాంటి విషయాలలో జోక్యం చేసుకోరాదు" అని రాజా విన్నవించారు. రాజా తన మాట విననప్పుడు ఆ సురపురంలో వుండటం ఉచితం కాదని వెంకటాచార్యులు పూనా పట్టణానికి బయలుదేరారు. వెళ్తూ ఒక శ్లోకం వ్రాసి రాజాకు పంపారు. దాని భావమిది: మదోన్మత్తమైన మతంగజం తన శుండాదండంతో భృంగాలను విసిరి కొట్టి చెల్లా చెదరుచేస్తే, వాటికి అడవులో పూవులు ఆశ్రయ మివ్వవా?" అని. అది వరకే వెంకటాచార్యులు పేష్వాల దర్బారులో పండితులందరిని జయించి విశిష్టాద్వైత కిరీటం పొందటంవల్ల పూనాలో నానా ఫడనవీస్ వద్ద ఆయనకు పలుకుబడి బాగా వుండేది. పూనాలో స్థిరపడ్డారు. వెంకటప్ప నాయకుడు కిరీటం వెంకటాచార్యులను మళ్లీ తన ఆస్థానానికి రప్పించడానికి ఎంతో ప్రయత్నం చేశారు. కాని, ఆయన రాలేదు. పూనాలోనే 82 వ ఏట పరమపదించారు.[177]

ఇవ్వి వెంకటాచార్యులు సీతా పరిణయ నాటకమ్, శృంగార సారస్వతమ్, వేదాంత కారికావళి మొదలైన గ్రంథాలు రచించారు. వేదాంత కారికావళి సంస్కృతాంధ్ర వ్యాఖ్యానాలతో ప్రచురితమైంది.

శ్రీ వల్లపురెడ్డి బుచ్చారెడ్డి దాశరథిచరిత్ర పీఠికలో సురపురపాలకుడు మొండగై (మొండిచేయి) వెంకటప్పనాయకుని ప్రస్తావించి గద్వాల చరిత్రలోని హనుమప్ప కథ మొండగై వెంకటప్పకు అంటగట్టి వుంటారేమో నంటూ "కథయందలి జిగి బిగి చూచి, మాళవదేశములో జరిగిన సారంగధరుని కథను ఆంధ్రదేశమున అంటగట్టినట్లుగా హనుమప్ప కథలు కూడ మారుమారై యుండునా!" అని సందేహం వెలిబుచ్చారు.[178] కథలు యాదృచ్ఛికంగా ఒకటవడం అసహజంకాదు. మాళవదేశంలో జరిగినట్లు భావించే సారంగధరకథవంటి కథ, నూటికి నూరుపాళ్లూ పోలిక వున్నదిది. పంజాబులో పూరణ్ భగత్ కథ వుంది. దీనిని హీర్ అనే మాత్రా వృత్తంలో ఎవరో ప్రాచీన జానపద కవి వ్రాశారు. దీనిని గాయకులు సారంగి సాహాయ్యంతో రాత్రిళ్లు మైదానాలలో పాడుతారు. హిందూ ముస్లిం శిఖ్ఖులు అందరూ చెవులు

---

177 కపటరాళ కృష్ణరావు సురపుర సంస్థాన ఇతిహాస, పుట 282

178 దాశరథిచరిత్ర పీఠిక పుట 18

కొనుకొని దీనిని ఎంటారు. ఈ కథ సినిమాకూడ నేను 1939లో లాహోరులో చూచాను. హిర్ మన ఆశ్చర్యకరమైన వృత్తాంతం. నేను ఈ కథ విని ఆశ్చర్యపడి, గురు వర్యులు వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి వ్రాశాను. దీని విషయమై యాదవాద్రి మానవుల గాథయా పరిశీలించాలని వారు నాకు వ్రాశారు.

తను మొండిగై వెంకటప్ప నాయకుని మొండిచేయి కథ కల్పనకాదు. అతడు తెగిపోయిన తన మొండిచేతితోనే డాలు పట్టుకొని యుద్ధంచేయడానికి వీలుగా ఒక ఇనుపముంజేతిని తయారు చేయించాడు. దీనిని చేతికి తొడిగి బాహానికి కట్టుకొని డాలుపట్టుకొంటే, ఇనుపవేళ్ళ బిగుసుకుపోయేవి. దానితో డాలుకు పట్టు వచ్చేది. దీనిని చేసినవారి చాతుర్యం మెచ్చుకోదాలి. ఈ ఇనుపముంజేతిని సురపుర రాజవంశీయులు నేటికీ మహానవమి ఆయుధపూజలో తక్కిన ఆయుధాలతోపాటు పెట్టి పూజిస్తారు.[179] కనుక ఇది కథకాదు, కల్పనకాదు, వాస్తవం.

సురపురం వారు మొదట శైవులే కాని, పచ్చంగి పామునాయకుడు విశిష్టాద్వైతమతం పుచ్చుకున్నాడు. రాఘవ పామునాయకుని కాలంవరకు భారద్వాజ శ్రీవైష్ణవులే గురువులుగాను, పురోహితులుగాను వుండేవారు. కాని రాఘవపామునాయకుడు ఒక్కపట్నానికి వెళ్ళి అక్కడ వున్న మహావిద్వాంసులు, మహాతపస్వులు అయిన అణ్ణయాచార్య సోదరులను తన రాజ్యానికి పిలుచుకొని వచ్చిన పిదప భారద్వాజుల ప్రాభవం తగ్గింది. కాని వారికి దర్బారులో మర్యాదేమీ తగ్గలేదు. సురపురము రాజులకు గురుత్వము వహించిన సంబెరుమార్యయ్య కుమారుడు లోకయ్య తారాజులతో సంబంధ మున్నట్లు కనిపించదు. సంస్కృతాంధ్ర కన్నడ ద్రావిడ భాషా సాహిత్యములలో విశిష్టస్థానము వార్జించిన లోకయ్యకు రాజాస్థానమున పీఠము లేకపోవుట విచారణీయము. పితాంబరుని మన్నుడు పామునాయకుడు తనకృతి భార్గవపురాణములో తన పూర్వులకు గురువులుగా నుండిన లోకయ్య సంబెరుమార్యయ్యలను స్మరించకపోవుట మరియు చిత్రముగా నున్నది. దీనికితోడు కేశవయ్యయు తన తండ్రి రాజాస్థానమున పొందిన గౌరవములగూర్చి ఏమియుచెప్పలేదు. ఈ కారణమువలన రాజులకు, వారి గురువులకు పరస్పర విశ్వాసములు సన్నగిలి యుండునేమో యను సందేహము కలుగును. కేశవయ్య వంశములోని తరాలను పరిశీలించ దాశరథి చరిత్రకర్తయు, భార్గవపురాణకర్తయు సమకాలికులై యుందురని తోచును" అని శ్రీ వల్లపురెడ్డి బుచ్చారెడ్డి వ్రాశారు.[180] అక్కపట్నం ఆచార్య సోదరుల రాకవల్ల కేశవయ్య మొదలయిన భారద్వాజుల ప్రాభవం తగ్గడం నిజమేకాని, వారికి దర్బారులో

---

179 కపటరాళ కృష్ణారావు సురపుర సంస్థాన ఇతిహాస పుట 88

180 దాశరథి చరిత్ర పీఠిక, పుట 16

గౌరవమర్యాదలేమీ తగ్గలేదు దక్కుపట్టం వారికి, కేశవయ్యగారికి సమానమైన గౌరవ స్థానాలు ఉండేవని ఇప్పటి స్థానిక ఆచారాలనుబట్టి తెలుస్తున్నది [181] భార్గవ పురాణకర్త కేశవయ్య పూర్వులనేకాదు, తాను సగౌరవంగా పిలుచుకొనివచ్చిన అల్లయాచార్య సోదరులను కూడ తన కృతిలో స్మరించలేదు ఈ విషయంలో కృష్ణరాయలను అనుసరించాడు ఇక కేశవయ్య ౪౯ సంవత్సరాలు జీవించాడు కనుక ఇమ్మడిపామునాయకునికి, ముమ్మడి పెద్ద నాయకునికి, మొండగ్రి వెంకటప్ప నాయకునికి ముమ్మడి రాఘవపాము నాయకునికి, ఇమ్మడి వెంకటప్ప నాయకునికి, ఆరుగురు రాజులకు సమకాలికుడు పైన పేర్కొన్న మొదటి ముగ్గురి కాలంలో బాలుడుకాని, తర్వాతి ముగ్గురికాలానికి యువకుడు, వృద్ధుడు

## భార్గవపురాణము

రాఘవపామునాయకుడు స్వతః మహావిద్వాంసుడు, సంస్కృతాంధ్ర కన్నడ భాషలలో కవి, అల్లయాచార్యులవంటి విద్వద్వరేణ్యుల సత్సంగంలో వున్నవాడు కనుక భార్గవ పురాణాన్ని ప్రబంధ పద్ధతిలో ప్రౌఢంగా విశిష్టాద్వైత సంప్రదాయానుసారంగా ఎనిమిది ఆశ్వాసాలుగ ఆంధ్రీకరించాడు ఆశ్వాసంల కథలను — ఏ కథకాకథను — చిన్న భాగాలుగా తీర్చాడు మూల సంస్కృత భార్గవ పురాణం అధ్యాయానుసార ఎక్కడికక్కడే పేర్కొన్నాడు "అని నయందు నారాయణునివలన మహాయోగిమాహాత్మ్యమును, సంవాద రూపంబును, శ్రీమంతం బనునగు భార్గవపురాణోత్తరఖండంబునందలి ప్రథమాధ్యాయం బాలించి —ఇత్యాదిగా [182]

ఉభయవేదాంత సంప్రదాయజ్ఞుడైన పామునాయకుడు ప్రబంధప్రథమాశ్వాసప్రారంభంలో ఇష్టదేవతాస్తుతి సంప్రదాయాన్ని కృష్ణరాయలలాగ కొత్త పద్ధతిలో చేశాడు భగవత్తత్త్వం పైనుంచి కిందికి దిగివచ్చి లీలావిభూతి అయింది ఆ పరతత్త్వ లీలావిభూతి అయిన నాగినగిరి సురపురవేల్పుగోపాలుని కవి మొదటి రెండు పద్యాలతో వర్ణించాడు ఆ పరతత్త్వం మరికొంత కిందికి దిగి అనంత దయాంచి అనంతుడు — ఆదిశేషుడు ప్రథమజీవుడు విడవ తార్క్ష్యని, అనంతరం విష్వక్సేనుని పంచాయుధాలను - శంఖ చక్ర కౌమోదకీ శార్ఙ్గ సుదర్శన దేవులను ముక్తులైన పన్నిద్దరు సూరులను వర్ణించాడు "అవి ఇవిధయిగా సార్థంబగు దివ్య దేవతా ప్రార్థనంబు" కావించాడు కవి [183] సార్థమంటే అనుగ్రహ శేషభూతులైన అనం గరుడ విష్వక్సేనాదులను క్రమంగా వర్ణించడం ఇది సృష్టిక్రమం

181 తిరుమల సుచరిత, ఎం ఎ, ఎంఫిల్ సగరనాథదర్శన, పుట 287
182 భార్గవపురాణం ప్రథమాశ్వాసం ౬౧వ పద్య తర్వాత వచనం
183 భార్గవపురాణం ఆ 1, పద 12

## అంకితం

పర్వంగిపాపనాయకుని ఆహ్వానంపై వేణుగోపాలస్వామి కోవెలలో అధ్యయనాధ్యాపనాలకు, పురాణ ప్రవచనానికి దక్షిణాదినుండి సురపురం చేరిన శ్రీవైష్ణవ బ్రాహ్మణ కుటుంబాలలో వాధూల గోత్రజులయిన నా మామగారు శ్రీమాన్ పెరుమాళ్ళ వెంకటాచార్యులవారి పూర్వుల కుటుంబం ఒకటి. శ్రీమాన్ వేంకటాచార్యులవారికి రామాయణ భాగవత మహాభారత విష్ణుపురాణాలు వాచోవిధేయాలు. విశిష్టాద్వైత వేదాంతంలోను వారు ఉద్దండులు. ఆరేడు దశాబ్దాల క్రితం వనపర్తి సంస్థానం దివాను శ్రీ వెంకోబనాయకుడు కృష్ణాతీరంలోని యాపర్లలో భారతదేశం నాలుగుచెరగులనుంచివచ్చిన పండిత ప్రకాండులతో నిర్వహించిన భాగవత సప్తాహ మహోత్సవంలో శ్రీమాన్ వేంకటాచార్యులవారు మధుర గంభీర కంఠంతో శ్రీమద్రామాయణం పారాయణం చేసి, శ్రీమద్భాగవతాన్ని ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సంప్రదాయానుసారంగా ప్రవచించి సన్మానితులయ్యారు. ఆ మహోత్సవంలోనే ఘంటాశతక కవి, ద్రావిడసన్మతి, శ్రీమాన్ తిరుమల బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులవారు నిర్వహించిన వేదాంత విద్వత్ సంస్కృత పరీక్షలో శ్రీమాన్ వేంకటాచార్యులవారు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులై "వేదాంత కేసరి" అనే సన్మానపత్రం పొందారు. పిదప వారు 1886 లో అమరచింతాత్మకూరు సంస్థానంలో శ్రీమాన్ కోసూరి కృష్ణమాచార్యులు జరిపిన భాగవతసప్తాహమహోత్సవంలో సన్మానితులయారు. ఆ మహోత్సవం నిర్వహించిన విద్వద్వరేణ్యులు శ్రీమాన్ పుసులూరి శేషాచార్యులవారు శ్రీమాన్ వేంకటాచార్యులవారికి బహూకరించిన శ్రీమద్భాగవత సంపుటిలో ఈ శ్లోకం వ్రాశారు

అపార సంసార విచ్ఛిన్న భావాత్
కృష్ణామృతాబ్ధా వవగాహ్య కృష్ణః,
అదా దిదం భాగవతం తదర్థ
విదే మదే వేంకటసూరయే హరిః

శ్రీ వేంకటాచార్యులవారికి భాగవతం వేంకటాచార్యులనే ప్రతీతి ఉండేది. వారి దివ్యస్మృతికి ఈ పీఠికను అంకితం చేసి ఋణ విముక్తుడిని అవుతున్నాను.

## మంగళాశాసనం

ఈ పీఠిక రచనలో సురపురం పుట్టినిల్లయిన నా అర్ధాంగి శ్రీమతి అనంతలక్ష్మి సురపురాన్ని గురించిన ఎన్నో సందేహాలు తీర్చింది. ఆమె సురపురపు పచ్చటి పొలాల పట్ల ఆమెకు నా మంగళాశాసన పూర్వకమైన కృతజ్ఞత

## కృతజ్ఞతలు

మిత్రులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాలయ సంచాలకులు డాక్టర్ దాసరి వేంకట లక్ష్మీనరసింహారావు కవి పండిత పరిశోధకులకు ఈ రామకవి పాండిత్యవైభవాన్ని, కవితాకమనీయతను, నిర్మాణమాన్యతను గురించి వివరించారు గనుక నేను చెప్పడం అప్రస్తుతమవుతుందని భావిస్తున్నాను

ఈ గ్రంథ పరిష్కారంలో నావల్ల కలిగిన విలంబాన్ని సహించి నాతో ఈ ఉత్తమ సాహిత్యసేవ చేయించిన మిత్రులు డాక్టర్ దాసరి వేంకట లక్ష్మీనరసింహారావు సహృదయతకు కృతజ్ఞుడను

ఎ బి రెడ్డి ఆర్ట్ మ్యూజియం,
హైదరాబాద్-౪౪

భాషాసేవకుడు
**తిరుమల రామచంద్ర**

# భార్గవ పురాణము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీలక్ష్మీరమణిన్ వివాహమునఁ దా జేగంట వీక్షింప నే
త్రాలోలాంబుజహృద్వయం బాగిని మిత్రామిత్రదీధితంబొట హ
ర్షాంచద్భూయున నందు రై వరదిశాయం బెంచ భాసిల్లు ని
ర్గోళానస్తుతిఁ బ్రోచుతన్ సురపురీగోపాలకృష్ణుం డిలన్ 1

మ. పరమాంగస్థితిఁ గల్గి వాగినగిరి[1] ప్రాశస్త్యిఁ గాపించి సు
స్థిర భక్తవ్రజ పాలకత్వమున నిశ్శ్రేయోఽధిక ప్రాప్తియై
యరుదారన్ విభవాప్తి ని సురపురాధ్యక్షస్థితిం బొల్చు న
ద్గురుఁ [2]దా నందుఁ బ్రోచు మమ్ముపుడు శ్రీగోపాలకృష్ణుం డొగిన్ 2

చ. అనయము నే మహామహుఁ డనంత పరస్థితి పూర్ణతాప్తియై
తన నఖిలావనీభృతిని కల్పమహోన్నతి యొప్పు శ్రీ భా
వన సమరాగరం బొరయు వాసవముఖ్యసురాళి నయ్యహం
తుని వినుతింతు సంతసమునొ నతిదాంతు జగన్నిగాంతునిన్ 3

చ. నెరయ సహస్రఫేదరక దీప్తులవైభవ శౌర్యరేఖయుం
బొరయఁ బవిత్రతాప్తిఁ గొని పూరితగోత్రత శక్తివైభవిం
బరపద సంపదం గలుగు భాసురశీలుని నాగవైరి శ్రీ
ధరతురగున్ బతంగపతి తార్క్ష్యు మహోన్నతిఁ బ్రస్తుతించెదన్ 4

---

1 మూ — దర, వాగినగిరి సురపురాధీశ్వరుం డౌరాజధాని సురపురమునకు ఐదామైళ్ళదూరమున నున్నది

2 మూ- దా నం

చ. పరమ వివేకశాలిఁ దవు బ్రాహ్మణ పోషణ తత్పరుండవై
యరయుట నేను బ్రాహ్మణ ముఖాదివరాప్తి దనర్చు టున్నికన్
వరమతిఁ బ్రోవ నిచ్చలికి వచ్చినవాఁడను నొక్క సూక్తి ధ
న్యరతనఁ జేతు నీ కిపుడు వాంఛ ప్రమథరాధిపా వినా. 14

సీ. అస్మత్పితామహ మానవేంద్ర శ్రీవిష్ణు
రాయఁడు తెనుఁగున రసికు లెన్నఁ
గృతి రచియింపించి కతకర్త మా కంటి
తండ్రిఁ జేయించిన ధన్యమతివి
యరయఁ బ్రసిద్ధరైనట్టి మద్వృత్తాం
చరితంబు నాంధ్ర భాషా ప్రబంధ
మునఁ జేసి మా కిష్టముగ సమర్పణము గా
వించినఁ బ్రీతిమీర్నమున

తే.గీ. సకల పుణ్యాతరావాప్తి సంభవించు
నీ కనుచు సురపుర వాసులై కరంగు
దేవుఁ డా కృష్ణమూర్తి యద్భుతుఁ డయ్యె
మెయికొని మానసోత్సాహలం దనర 15

వ. ఉదయంచిన సాకల్యంబగు కాల్పుకరణీయవిధి నొనర్చి దండనాథ సామంత
ప్రభృతి వర్గంబులోఁ గూడ నాస్థానంగంబుగాఁ గొల్వుండి చతుస్సంఖ్య పార
ధూర్వహ ప్రశంసులగు విద్వాంసుల రావించి వారంతై తత్సంప్రష్న ప్రభావం
బెఱింగించిన సంతోష భరితులై యిట్లనిరి 16

చ. విరతవం ధర్మశీలుఁడవు నిరఘనాథ కటాక్షవీక్షణా
కరుఁడవు వైష్ణవాగమ వికాసిత ధీనిధి వౌట నీకు శ్రీ
హరి కలలోన వచ్చి సదయన్ వచియించిన రీతివల్ల ని
ద్ధరుణ కథాభివృద్ధి విరతస్థితిఁ గాఁగం దింక నెల్లెడన్ 17

1 మూ—ప్రభృతి

తే.గీ. స్మరణమువలన మోక్షం బొసంగుచుండు
పతిశయంబు మహాపుణ్య మతులితంబు
నమరునెప్పుడు [1]బదర్యాశ్రమ [2]మనగ సుకృత
రతియునై సంతతంబు శుభంబు దనర ౪౨

వ. విభుండు ప్రసూన సంయుతంబును నందన బృంద ప్రకాశితంబును నత్యుల్ల
సంచన కమలాసార విరాజితంబును నగుచు ధన్యంబగు నద్దివ్యాశ్రమంబు
నందలి చంద్రకాంతశిలాతలంబునందు సమాసీనులై ధు ధువవ జన
రక్షణంబునకై యవతరించిన మహామునులును జగదధీశ్వరులును నగు నర
నారాయణు లిరువురు నానాప్రకారంబులగు సకలశాస్త్ర ప్రసంగంబు లొగ్గడిం
పుచు వసియింపుచున్న కాలంబునందు నరుండు మహానుభావుం డగునట్టి
నారాయణ మునీశ్వరుంగూర్చి పరమార్థయుక్తుం డగుచు వినయంబుగా
నవయనూర్తి నిట్లనియె ౪౩

క. మునినాయక నారాయణ
యనయము మా కిప శరణమౌట నడిగెదన్
జనమోక్షసిద్ధికొఱకై
యనుపమ మతినై రహస్య మధికము గాఁగన్ ౪౪

క. తమ నీ మాయాప్రాభవ
ర్తమునందులఁ బ్రాణికోట్లు దగులుదురోఁ [3]బో
ధ్యమగాఁ బ్రతిక్రియ గలుగ
దమరఁగ వానికి ముక్తికై సులభముగాన్ ౪౫

---

1 మూ. బదర్యాశ్రమ 2 మూ. మనఘ

2 మూ.—బోధ్యమగా

తే గీ. అనఘ భవవార్ధిమగ్నులైనట్టి యీ స
[1]మస్త జీవ వ్రజములం గార్యాదరమున
సులభమగు మోక్షమార్గంబు గలుగునేని
దానిఁ బలుకుము దయచేసి ధన్యమతిని 96

కం. గురుమతిత్రై పల్కిన యా
నరువచనముఁ బ్రియముఁ జేసి నవ్యయశస్కుం
డురుమతి హరి విని మురిసెన్
నరుఁగూర్చి తదీయభక్తి వంచితుఁ డగుచున్ 7

మ. మను సర్వేశ్వరి లోకమాతయగు సంతోషాలయాదేవి నే
ర్పున వైకుంఠపురంబునందు హరి సంతోషాత్మునింగూర్చి దీ
నిని బ్రశ్నింపఁగఁ బల్కినట్టి కథ నే నీకూహఁగావించి సూ
క్తిని జెప్పొందఁగఁ జేతునంచుఁ గరుణా దివ్యప్రభాభాద్యుద్రై

ఆ. అల త్రిపాద్విభూతి యైన వైకుంఠంబు
విరజ కవలి దరిగ [2]వెలయు నెక్కి
పురి యయోధ్యగాఁగఁ బొల్చు నిత్యం బది
యంత నమృతమనని యావరించి 99

తే గీ. కంచు మణిసా[3]లయ నిస్తంద్రమంగు
రత్నమయ మందిరములు [4]హర్మ్యప్రసార

---

1 యతిభంగము 2 వెలయు 3 మూ — లేయ
4 ప్రాసాదములకు ప్రసాద ప్రయోగము

ములు విమానమ్ములును శుభములగు తోర
ణములు గోపురములు గల్గి యమరుచుండు

వ. సకలం కార్యకారణ కారణంబును నావరణ సప్తకంబును దశగుణోత్తరంబును చతుర్దశభువనాత్మకంబును నగు నండంబు గడచి పరమంబగు వ్యోమ శబ్దంబున[1] జేసి యభిధేయం బగుట బ్రహ్మాదుల కవాఙ్మనసగోచరంబై శ్రీమంతంబగు దివ్యలోకం బగుట సనకసనందన శతానంద శివాదులచే నె నీ ధ్యానంబు సేయుట యవశ్యం బగుట నద్రిత్యస్వరూపై శ్వర్య నిత్యానంత సిద్ధులును భగవత్పరిచర్యానుకరణ యోగ్యులును భగవదనుకూల్యైక భోగులును మహాత్ములు నగు దివ్యపురుషులచేత నత్యంతపూరితంబగుట తదన్యాదికంబేని యార్ద్రస్వభావంబును నింతపరిమాణంబును నింతయైశ్వర్యంబును నని పరిచ్ఛేదంబు చేయుట కశక్యంబుగాన నవ్వానరణ శతసహస్రావృతంబును దివ్యకల్పతరూపశోభితంబును దివ్యోద్యాన శతసహస్రకోటి సమావృతంబును నతిప్రమాణంబును నగుచు దివ్యతరం బగునొక్క తలంబున విచిత్ర దివ్యరత్నమయంబగు దివ్యాస్థాన మంటపంబు గలిగి దివ్యరత్న స్తంభ శత సహస్ర కోటి శోభితంబై నానాదివ్య రత్న కృత స్థలం విచిత్రంబయ్యు దివ్యాలంకారాలంకృతంబౌట పతితంబులును పరమానంబులును నగు పాదపస్థ వివిధ గంధ వర్ణంబులంగల్గు దివ్యపుష్పశోభమానంబులగు దివ్య పుష్పోపవనశోభిత సంకీర్ణ పారిజాతాది కల్పద్రుమోపశోభితంబులయ్యు దివ్యంబులగు గొన్ని యంతస్థ పుష్ప రత్నాది నిర్మితంబులగు దివ్యలీలా మంటపశత సహస్ర కోటులంజేసి శోభితంబులుగా నిరంతరానుభూయమానంబులై యపూర్వ పదార్థంబు నాపహించిన క్రీడాశైల శత సహస్రంబులచేత నలంకృతంబులయ్యు నారాయణ దివ్యలీలాంకృత నారాయణ దివ్యలీలా సాధారణంబులుగల్గి కొన్ని [4]పద్మవనాలయా దివ్యలీలా సాధారణంబులయ్యు గొన్ని శుకశారికా మయూర కోకిలాదులచే నైన కోమలంబులగు కూజితం

1 గ్రంథపాతమున్నట్లు తోచుచున్నది

2 మూ—పూరిత 3 మూ—నగర 4 మూ—పద్మ

ములచేత నాకులంబులగు దివ్యోద్యాన శత[1]సహస్రంబులచేత నావృతంబై మణిముక్తాప్రవాళకృత సోపానంబులను దివ్యామృతామృత రసోదకంబులను గల్గి దివ్యాండజ తరంబు(?)చేత నతిరమణీయ దర్శనంబులైన యతిమనోహర మధుర స్వనంబులచేత వ్యాప్తంబులైన యంతస్థ ముక్తామయ దివ్యక్రీడాస్థాన శత[2]సహస్రకోటి శోభిత దివ్య సౌగంధిక దివ్యరాజహంసావళీ విరాజితంబులగు వాపికా సహస్రంబులచేత సమావృతంబయ్యు నిరస్తాతిశయానందైక రసత్వంబునం జేసి యమంతంబులగు నదులు గల్గి ప్రకృష్టక్రీడోద్దేశ ప్రభాసమానంబై [3]యందందు నిర్మింపబడిన దివ్య పుష్పపర్యంకంబుల చేత శోభితంబయ్యు వివిధ కుసుమ మరందాస్వాద మత్త మధుకర నిరంతరోద్గీయమాన దివ్యగాంధర్వ పూరితంబయ్యు చందనాగరు కర్పూర దివ్య పుష్ప రసావగాహిత మందానిలసేవ్యమానంబగు వైకుంఠపురంబునందు కోటిసూర్య సమప్రభంబగు తదంతఃపుర వరంబున ప్రాకారము దన్మధ్యంబునందు మాణిక్య స్తంభ శోభితంబగు దివ్యమంటపంబు సమృద్ధి ప్రాపగుట నందు

తే.గీ. బాలసూర్య సమాకారమై పరగి కనకము
వంటి సింహాసనమున సహస్రదళ వి
శోభితంబయి భాస్కరు సొంపగు నమరి
కమలమొప్పారు నిత్యం కాంతి గల్గి 43

క. ఆ పద్మ కర్ణికయం దధివసించు
పద్మేశ్వరుండు జనార్దనుండు

---

1 మూ—సహస్ర
2 మూ—సహస్ర 3 మూ-యెందెందు

ప్రథమ విశ్వమునకుఁ బతి దేవదేవుండు
నారాయణుఁడు శ్రీ నాయకుండు
శ్రీ భూమి నీళావిభుండు దేవాధి
పతి యనంతుండు శశ్వంతశాశ
[1]సాహస్రదళ సమాసక్తామలాద్య స
హస్ర ధామం విచిత్రైక మూర్తి

ఆ.వె. ధూర్యసంఖ్య నిత్య ముక్త శేషాది సం
సేవితుండు భూత భావనుండు
సంతతంబు నిట్లు సంస్థితుండై దివ్య
భోగ విభవ మహిమఁ బొల్చు మీఁద 43

క. విమలార్యసేన చామర
సముచయ పరి[2]వీజితుండు సౌఖ్యపరుం డు
ద్యమముఁ దగుట [3]వనధి సుత యొక
సమయంబున విష్ణు శౌరి జగదధిపాలున్ 44

వ. పిమ్మట నమ్మహాత్ముండు తదీయ నేత్రారవిందమ్ములకుఁ బొనం పుణ్యా-
నంద సంధాయకుండగుచుఁ బ్రత్యగ్రోన్మీలిత పుండరీక సదృశ నయ
నుండును విమల పీతాంబరంబుండును నత్యుజ్జ్వల పీత వసనుండును
నచింత్యంబును దివ్యంబును నద్భుతంబును నిత్యంబును నగుయౌవన
స్వభావ లావణ్య స్వరూపామృత సాగరంబు గల్గు [4]మహాత్ముండును
నత్యంత [5]సుకుమారేషత్ప్రసన్న వదనాంభోజుండు [6]నిటాలంక దివ్య

---

1 మూ — సాహస్ర 2 మూ — వీచితుండు 3 మూ — వనిధి
4 మూ — మహాత్ముండు 5 మూ — సుకుమారంతేష
6 మూ — నిషాం

లతావళీ విభ్రాజితుండును సతతవికచమాన దాయతర సారసాక్షుండను [1]సవిభ్రమ భ్రూలతా సంయుతుండును ప్రవాళికాధరుండను అతిశుద్ధ స్మేరాననుండును మృదుల కపోలఫలకుండును మన్మథచాపసుందరుడను సుదగ్ర [2]పీనాంస విలంబమాన [3]వక్రకుంతలాలతావళీ విస్ఫురిత దర కంధరుండును శ్రియావతంసేందీవర శ్రీకరయుగంబు [4]గ్దాంతాంధ విమర్ద ప్రశంసాంకాను విలంబిత చతుర్బాహు విరాజితుండును నతిమృదుల విపులోరోభాలంకృతాకుంచిత కరతల దివ్యాంగుళీయక భాసమానుండును నత్యంతకోమల దివ్య నఖ పంక్తికా విభ్రాజితాసురక్తాంగుళ్యలంకృతుండును కల్యాణ సమున్మీలిత కమల సన్నిభ పదయుగళుండును వరకరతర కోటీర కోటి చూడావతంస గ్రైవేయ [5]క హార కేయూర కటక శ్రీవత్సకౌస్తుభ మౌక్తికదామోదరబంధన చామీకరాంబర [6]మేఖలా గుణ మణితర మంజీర రంజిత సువర్ణ దివ్యగంధ భూషా భూషితుండును శ్రీమద్వైజయంతీ వనమాలా విలసితుండును శంఖచక్ర గదా నందక శార్ఙ్గాది దివ్యాయుధ సేవ్యమానుండును నిజ్ఞామాత్రావక్లప్త భువన భవన సంస్థితి సంహారక శ్రీమంతుండగు విష్వక్సేను[7]నందును సమస్తైశ్వర్యంబు తెల్పిన స్వభావంబు వలన నిరస్త సమస్త సాంసారిక స్వభావులు భగవత్పరిచర్యైకభోగులును నిత్యసిద్ధులును నగు వనంత వైనతేయాదులచేత యథాశక్తి యోగింయనంశేసి యలు సంపాశ ధరాది కాలంబున దివ్యమును కోమలాలోకనంబు జేసి విశ్వంబును నాప్యాయనంబు సేయుచున్న మహానుభావుండును కించిదున్మీలిత వదనాంబురుహ వినిర్గతంబును వాఙ్మాధుర్యౌదార్య సౌకుమార్య సౌందర్యాద్యనవధిక గుణగణాలంకృతంబును నతిరమ్య దివ్యభావ గర్భంబును నగు[8]దివ్యలీలాలాపామృతంబున నఖిల జన హృదయంబులు పూర్ణంబులు గావించుచున్న

---

1 మా - సలేదు 3 మూ — పీనాంస
2 మూ - వక్రకుంతల 4 మూ — శ్రకా
5 మూ — కాహార 6 మూ — మేఖలి
7 మూ — నందను 8 మూ దివ్యలీలా

త. స్థిరమతి రామకృష్ణ ముఖ దివ్య శరీరము దాల్చి నీవు త
న్నరయను బ్రోవ నిట్లు [1]ననంత సుశీలతరాత్రి వల్ల వి
స్ఫురణముగా నిరంతరముఁ దాల్చి హితంబు నొసర్చు వాఁడ వు
త్కర తత్కారిపై దువహకల్పక మూర్తివియై ముదంబునన్ 50

ఆ.వె. ఎపుడు శివమోక్ష హేతువు నగు నీవు
వర్తిలంగ నెల్ల ప్రాణులకును
ముక్తి కొఱకు నిట్లు మొనసి సంకల్పింపఁ
బడుదు వీవ జగతి శంకరాఖ్య 51

వ. అందఱు భవసాగరమునందు మునుంగుటయుఁ గొందఱు కొందఱుగుదాని ముక్త జీవు లగుటయు నీ మాయాప్రభావంబు నీకుఁ బ్రసిద్ధంబగుట నీవు [2]నీవే రచ్చరటం గలవు నీవ సత్య సంకల్పుఁడవు సత్యకాముఁడవు నాదు బ్రకృతియందుండు వస్తుగుటంజేసి నిగమంబుల [3]కన్పృతంబు గావింప వలదు దేవ దేవా భవదనుగ్రహంబువలన సమస్త జీవకోటులకుఁ బరమంబగు పదంబు గల్గు కొఱకు నిన్నుం బ్రార్థించెద మత్యాంతరంబగు దాని నురువ వలయు మహాత్మా సర్వశేషివగు నీకు భేద బుద్ధి యేల? ఈ లోకంబు నందుఁ గొందఱు బద్ధులును గొందఱు ముక్తులును నగుటకేమి దాని విచారింపఁదగు నిట్లు గావింపక సర్వజనులకు ముక్తి ప్రదుండవు గమ్మని యివ్విధంబునఁ బ్రార్థింపుచున్న శ్రీ రమాదేవి నవలోకించి పరాత్పరుండగు జగత్పతి భవనంబు నందుఁ బుత్రుల యెడ జనకున కంటె జనని కధికంబగు బ్రియంబు గంధని యత్యాదర కృపారసుండగుచు నామె కిట్లనియె 52

1 మూ. యనంతు 2 మూ - నెచెరెద్చు 3 మూ - కన్పుంతం

సిరియు చక్రంబును శార్ఙ్గంబును నందకంబును గౌమోదకియుఁ బాంచ
జన్యంబును విష్వక్సేనుండును ననంతుండును వైనతేయుండును సునందా
దులును మఱియుఁ బరిజనులుగాఁ మీర లంద అంశభాగంబున [1]భూలోకంబున నం
దవతరింపఁబడగు [illegible] యుగంబునందుఁ బొరసి సర్వాధికారులగు నరు
లకు సులభంబగు సన్నిధానంబువలన మోక్షం బొసంగుదురు ఉపనిష
న్మార్గోక్తంబును గుహ్యంబు కంటె గుహ్యతమంబును శుభంబును రహ
స్యతరయు సంస్థితంబును బరమంబును నగు నష్టన్యాసయోగంబు సర్వ
బంధవిముక్తికొఱకు సర్వులకును నుపదేశంబు గావించి యంత సకల పర్థాధి
కారంబు కొఱకు నిగమాగమంబులు సంగ్రహించి ద్రావిడభాషచే బ్రబంధ
ములు గావింపుదురు మహాగుణంబులగు నప్ప్రబంధములచేత దుర్మత
భేదనంబు చేసి పావన స్వాశ్రితంబులను సాత్త్వికంబులను గావించి
వాని శోధింపుఁడని యిట్లు దేవుం డాజ్ఞాపింప శ్రీ భూనీళాదులును బరిషత్తు
లగు ననంతాదులును వసుధయం దావిర్భవించి రని యిట్లనియె ౬౮

సీ. సకల దేశములందు శౌరిదాస్యనుషా
రమునెల్ల నిల్పించి రమ్యమతిని
ప్రకటింపఁగా నందఱకు నుత్తమము రహ
స్యమునగు న్యాసయోగము ముదమున
నుపదేశమును జేసి యుర్వియందు మహాత్ము
లై మోక్షదాయకు లయ్యె దివ్య
ధమున పేరఁట ప్రతి ద్వాపరాంతమునందుఁ
ప్రతిమహాయుగమున [2]జనుల బ్రోత

---

1 మూ – భూలోకంబున నవతరింప

2 మూ – వలన ౩ మూ – బహుళ.

క పరివృత నీలనీరద విభాసిత శైత్యము లల్లి నిల్ల వి
స్ఫురిత శిరోగృహాగ్ర పరిశోభిత కుంభ పయోజ లోచనో
త్కరముగ స్వస్థకేతన విలాసము పట్టన దామరాశియై
యరయ పురీ గృహేందిర లనంతపదస్థితి మించె నెంచఁగాన్ 67

వ కాంచన ప్రాకార సంయుతంబును సకలసంపదానిక్షేపంబును సమంత
తస్సమావృత ప్రకాశమాన మేరుసంకాశ ప్రాసాద నికరంబును నగు
పురంబునందలి [1]హస్తిగిరిశిఖరంబు మీఁదిభాగంబునందుఁ గనక కమల
సంకీర్ణ మత్తమధుకర నికర [2]ఝంకారితాలంకరణంబును విమలజల
[3]చలత్ప్రవమాన శతశిర సంచరిత సకలం జంతు సంతాన దురంత నందీ
పిత తాపహరయ నివారకంబును నగు సరస్సమలాకరంబునందు
బాలార్క ప్రభాభాసమానంబగు హేమనలినంబు వందుఁ బ్రవేశించి
యరవిందవదన పదారవింద మరంద నిషేవణంబువలన సద్యః ప్రవర్త
మాన నిఖిలావయవుండును భగవత్ప్రియుండును మహత్తర పాంచ
జన్యాంశుండును నగు మహానుభావుండు శుభంబగు ద్వాపరాంతంబు నందలి
శ్రవణనక్షత్రయుతాశ్వయుజ మాసంబునందు సకలదేహి ముక్త్యర్థంబుగా
సముద్భవింప దివ్యులు [4]దేవ దుందుభులు మొఱయింపుచు మహనీయం
బగు పుష్పవర్షంబు గురియించి రమ్మహాత్ముండు ప్రాదుర్భవించు సమ
యంబునందు యప్పరస్సంఘాతంబు నటియించె నంతదేవుండును సర్వేశ్వ
రుండును పరరుండును నళినభూతకారియు పుండరీకవిశాల నయ
నుండును శంఖచక్రగదా ధరుండును నీలజీమూత సంకాశ మం
తనుండును కోటిసూర్య సమప్రభాభాసమానుండును పీతాంబర
ధరుండును వనమాలా విభూషితుండును హారకేయూర కిరీట కంకణాంగద
శోభితుండును మహనీయకాంచితా దామ నూపుర ప్రకాశితుండును గరు

---

1 మూ - హస్త . 2 ము - ఝంకార

3 మూ చలోత్ప్రవ 4 మూల - దేహ

దాధిరాజుండును శ్రీమద్రమావతీ సహితుండును జగద్విభుండును ధవళ
చామర పరీత ధవళాతపత్ర పరిశోభితుండునునగు నచ్యుతుండు దయార్ద్ర
హృదయుండయి పౌరంబగు నర స్థిరంబున కరుగుదెంచె 68

క. అరయఁగ నల్పాయువు గాని
శర మ్మూఢాలయిఁ జేసి శ్రీహరి నిగమా
రత నీతి నిశ్చయంబుఁ
బరికింపఁగ వలది వేదపారగుఁ జేసెన్ 69

తే.గీ. ఆపి సరోయోగి యని య హాస్యంబు చేసి
ప్రభువులోకాధినాథుండు బాహువులను
స్పర్శ గావించి తన ప్రియభామ కొసఁగె
సంతసంబున నల్పాలు సత్యతో 70

క. స్థిరమతి వాత్సల్యంబునఁ
గర మా సిరి స్రావితంబుగాఁ దగు చనులా
లరుదార నొసఁగి యాతని
వరసి సుతుని పగిదిఁ బ్రోచె నతిమోదముగాన్ 71

చ. అతఁడు ప్రవర్ధమానుఁడయి యంచితభక్తి నిజాత్మ నెంచి నం
తతముగ వారి పాదసరసీరుహసీమను దండవత్ప్రణా
మ తనుఁడునై యధోక్షజుని మాధవు లోకవిభున్ మహాత్ము నం
స్తుతి రచియించె చిత్పరిశోభిత సత్య మృదూక్తి వైఖరిన్ 72

సీ. అతఁడు సంస్తుతిఁ జేయ నప్పుడు సంప్రీతుఁడై
దేవతేశ్వరుఁడు సుధీమతుండు
వరదుండు నిర్మలస్వాంతుండు యా గమ్య
తత్ప్రదంబు సకలంబు సుప్రభావ
మహిగమ్మ మతిశయంబుగు ధ్యానయో గంబు
మునివర్యుఁ గాసార భూతయోగిఁ
గూరిచి కరుణాన్వై కొని యుపదేశింపఁ
దన్మహామహుఁడు తత్పాద నళిన

తే.గీ. ములకుఁ బ్రణమిల్లి సంతోషమున వినీత
వంతుడయ్యెఁ బ్రసన్న తద్వదన నీర
సంభవ న్యాసముంగొని సమ్మదయాప్తి
హర్షితుఁడు గాఁ దనర్చె యత్యంత మతిని 73

క. మునిపతి కృతకృత్యుఁడుగాఁ
దనుఁ దెలియుచుఁ బరుని దేవుఁ దామరస దళా
క్షునిఁ గూర్చి కృతాంజలియై
యనియెన్ వ్యాసార్థ కాంక్షతా[1]యాతుండై 74

తే.గీ. అనఘ నీవు వచించిన ధ్యానయోగ
మరయు గుహ్యంబుఁ దాత్పర్య మనుట యెట్టి
దానినంతయు నతివిస్తృతముగ మాకు
యాధిగాఁ బల్కి వలయుఁ గారుణ్యబంధి 75

వ. అనుడు భగవంతుం డిట్లనియె, 76

---

1 మ — తాయ

నవెదు [1]న్యసనంబు తత్త్వవేదులగు మునులంచెం దాత్మన్యాసంబని పల్కం బడియె ప్రధానంబు గూర్చి బుద్ధి తత్త్వంబు గదారూపంబుగంజేసి నాకు ధరియింపనగుట భూతప్రవృత్తీంద్రియాదియు శంఖరూపంబుగా ధరియింపు చుండు నుత్తమంబును ద్వివిధంబును నగు నహంకారంబు శార్ఙ్గ రూపంబును జేసి ధరియింపుదు మనస్తత్త్వం బేను చక్ర రూపంబునంజేసి[2] దాలుతుం బంచ యగు నింద్రియంబులు బాణ రూపంబులం జేసి ధరియింపనగుట విద్యా మయంబగు జ్ఞానం బెద్ది యది ఖడ్గరూపంబుచే నాకొఱకు ధరియింపంబడు నవిద్యామయంబగు జ్ఞానం బెద్ది యదివర్మరూపంబున ధరియింపంబడు పై బయంటి స్వరూపంబు వలన పంచభూతంబులు ధృతంబులయ్యె నిట్లు ప్రధానంబును బుద్ధియు నఖిలాత్మకంబగు భూతాదియు నింద్రియాదియగు నహంకారంబును మనంబును సకలేంద్రియంబులును విద్యావిద్యలును భూమి మొదలగు భూతాదియు నునవి మదీయహస్తకమలంబులయందలి విజ్ఞానధ్యానంబునంజేసి సన్న్యాసంబుగా నాత్మీయ న్యాసంబని న్యాసయోగ విశారదులం పల్కుదు రివ్విధంబున స్వాత్మను నా యురంబునందలి కౌస్తుభ రూపంబుచేత సన్న్యసించి సద్యస్స్వానందసుధారసం బహర్నిశంబు గ్రోలుచు నాయుధ రూపకంబులగు తత్త్వంబులచేతం బరివృతుండయ్యు మత్కరారవింద మాధుర్య మకరందంబు మిక్కిలి సేవించు బహిర్విషయ వైముఖ్యంబగు నాత్మన్యాసంబుగాఁ దలంపఁ దగు నని యిట్లనియె

తే. గీ. ఈ సమస్తంబు తెల్లగా నెఱిఁగి నీవు
సర్వసర్వేశ్వరుండవై సంతతంబు
నూహము వర్జింపు నాయందుఁ బాదుకొఁ జేసి
యలరుచు సమాధిఁ గ్రీడింపు మనుచరిత 81

---

1 మూ వ్యస 2 మూ దాలిత

సర్వదేవాంతు మోక్షదమునా మల్లప
రంబునం దము నీరరుహ కుముద
ములను దెంగల్వలం బలి సుల్పంబులు
నెనసి దివ్యంబుగా నెసఁగు నొక్క

తే.గీ. సరసి తలమున రాజహంస స్వనంబు
గలఁగి సురరాజ నీలప్రభాళి మెఱుచు
శుభము గామించి నిస్తుల స్ఫూర్తి నలరు
దివ్య నీలోత్పలంబు సంభావ్య మగుట 85

వ. అందు 86

క. కౌమోదకీ మహాంతుఁడు
తామరసాక్షాంఘ్రి పంకజ (?) ధ్యాన సుధా
ధీ మహిత వివర్ధితుఁడు [1]మ
హా మహుఁడు వసించి నిస్తులానందుండై 87

క. క్షితి తత్త్వ జ్ఞానాధికుఁ
డరఁడు పవిత్రాశ్రయుఁడు నగు మాసమునం
దతి శుభమగు దినమున నం
చిత మతి ఇక్కందె విమలచిత్తాయితుఁడై 88

వ. అయ్యవసరంబున

---

1 ము — మా

చ అనుపమ కోటిసూర్య తులితాభుఁడు సంతతనాటఁ దాౖగా
[1]వనుఁ దవిలెక్కరుండు ఎధవంద్యుఁ దనేక సుమాస్త్రదారుతా
స్తి విగఎరూపుఁ దచ్యుతుఁడు దెవుఁడు శౌరి చతుర్భుజుండు [2]శ
ర్వానయుండు గోముఖావయవభాసితుఁ దవ్యయుఁ డప్రమేయుఁడున్ 83

సీ సర్వజుతుఁడు శంఖ చక్ర గదా పద్మ
విభ్రాజమానుండు విశ్వమయుఁడు
సుముఖుండు సుభ్రూశ్రు సుజనస్తుతుఁడు పుండ
రీక విశాక్షుఁ డస్తోక గుణుఁడు
నారాయణుండు సునాసుండు విద్రుమా
ధరుఁడు సుదంతాఢ్యుఁ దరిజయుండు
సు[3]శ్రోత్రుఁ డకఘుఁడు సులలాటవంతుండు
సువిభూషణుండు విశ్వరయుతుండు

ఆ సుగుణ మాలి సుగంధ చుబుక కంధరుఁడు సు
నఖుఁ డమరకుతుఁడు వాసుదేవుఁ
డమృత దాయకుఁడు సదానందరూపుఁడు
దివ్య గంధలిప్తదేహుఁ డనఁగ 31

వ పుష్పమాలా విరాజితుండును దివ్యపీతాంబరధరుండును నగు వాక్షీధరుండు
నగణనని యగు ఎన్మతోఁగూడి విత్యముక్త పరివృతుం డగుచు సరస్తిరం
బున కరుదెంచి యుత్తముండును సిలోత్పలాంతరస్థుండును నగు నయ్యర్ప
కుం గ్రక్కొ[4]పోషణం బు జేయుటకై ప్రియముగు[5]కమలాహస్తకముఁయునం

1 ము - నను 2 మూ - తా
3 మూ - శ్రోతు 4 మూ - పోషణంబగు
5 మూ - కము

దొసంగిన నాలేమి బావింబుగా నత్యంతుంగొని హర్ష మానసయై
నృప్పయింపుచు నతని కమ్మరం బొసంగిన సమ్మహోత్సవంబు లక్షణంబు
ప్రవర్తమానంబగుటఁ దర్శనీయంబునం దాశౌరి యమ్మునీంద్రునకు
భూతాభిధానుండని ప్రవరమైన సరహస్యంబును సవిస్తరంబును బరమం
బను న్యాసాఖ్యంబును నగు యోగంబు యోగి ధ్యేయంబును భక్తుండును నగు
సమ్మహోత్సవ మొసఁగెఁ బాగా వింప మునిశ్రేష్ఠుండగు వాతండు జ్ఞానయోగ
రహస్యం బెఱింగి యతాండును నన్యుయుండును నగు వాని గూర్చి
సంబంధ జ్ఞాన భేదంబుగు వాని ప్రశ్నఁ జేసిన భగవంతుండు సంబంధంబు
లగు జ్ఞానభేదంబులయందు కర్తృ కార్యం యందలి [1]సంబంధంబు
శ్రేష్ఠం బని లోకంబునందుఁ బెక్కయిన కతంబున మునీంద్రా దాని వది
యింతు వినుమని యిట్లనియె ౬౨

తే. గీ. ధాత్రి రామావతారంబు దాల్చి నాదు
చరిత మతికంబుగాఁగ నాశ్చర్య మగుట
నిదియె విజ్ఞాన సిద్ధికై యొసఁగుచుండు
బూర్వకాలంబు నందు విఖ్యాతి మించి ౬౩

క. మనసువలన నీ చరితం
బును దశకంధర వధార్థముగఁ దెలియఁగ నీ
కను జీవునిగాఁ బరమా
త్మ నయిన నను రాముగాఁగఁ దలపఁగ వలయున్ ౬౪

సీ. ఉరుదీప్తియగు మదయోధ్య వైకుంఠంబు
[2]దగఁ బ్రపంచము దండకావనంబు
నందుఁ బ్రవిష్టుండనై పరమాత్మనౌ
నాకు లీలార్థమై సంభవించ

---

1 మూ — సమ్మంధ 2 మూ — దనప్రపం

సీతా సదృశముగాఁ జెన్నొందు రాక్షసు
రహిని మనస్సులో రావణుండు
మృగ రూపమైన ప్రకృతిచేత మత్ప్రీ
ఎము వల్లఁగొని తీర మను లంకఁ

తే.గీ. జేరి యుద్యాన సంస్థగాఁ బెంగు వనమం
నందు వరిక్షిత దా విపయాల్మ కోత్త
మాంగమును విఱరాజ్యము నసుభవింగె
మహిళ సుతాధుర్య సుచరిత్ర మౌనివర్య 95

తే.గీ. అప్పు డా సీత యౌవనమునందు నాదు
విగ్రహస్వరూపం బెట్టి విస్తృతముగ
వలుపుచు వసించునట్లు నీ ఎంఘమతిని
భక్తిరంజిల్లగా ధ్యానపరుఁడ నగుచు 96

మ. సతతంబున్ మునివర్య యివ్విధముగా సంబంధ విజ్ఞాన మం
చిత భక్తిన్ హృదయంబునం దరసి విద్విన్నైక భక్తాత్మ సం
తతినై నాదు గుణానుభూతియును[1] మత్ప్రీతియో లీలయున్
చతురత్వంబున మౌనివర్యులకు నిచ్చన్ బోధ గావింపుమీ 97

వ. ఉత్తమంబును రూపానుభవంబును మత్స్వరూపానుభవంబును స్మృథ్గుణాను
భవంబును జరమంబగు విధూత్యనుభవంబును మానులంగూర్చి నిరంత
రంబు స్థిరంబగు సమాధించేసి యుద్బోధకంబు గావింపుము సంసారసార
మగ్నులగు శరీరులకు పుత్కృరుణంజేసి యపయంబు తత్త్వం బధికంబుగా

---

1 మూ 'ను' లేదు

బోధింప నీ వనువర్తింపుము దివ్యంబులౌ మదీయక్షేత్రంబులం గూర్చి
యథాసుఖంబుగా సంచరింపుము భవత్పుణ్య స్పర్శంబున భూమి
యందు సంచరణం బొనర్చుచు దానిఁ బవిత్రగా సలుపుము మునీంద్రా
భవచ్ఛరీర స్పర్శ మారుతంబుచే నందఱు మర్త్యజంతువులు ధన్యులగుచు
నిన్నాశ్రయించెద రనియెడు పితృవచనంబు విని యప్పు డప్పుణ్యశీలుండు
వినయావనతుండై యాజ్ఞనుం బ్రతిపత్తిఁ జేసి యతనిచేత మిక్కిలి యను
జ్ఞాతుండగుచు ననవరతంబు యాత్రం గూర్చి చనియెనని మహాయోగి
మాహాత్మ్యంబను శ్రీమంతంబును నగు భార్గవపురాణంబునందలి యుత్తర
ఖండంబునందు సంవాదంబుఁ జేసి భక్తపరాయణుండగు నారాయణుండు
నయనకుఁ దృతీయాధ్యాయముఁ జెప్పె యిట్లనియె 98

మ. అట ధర్మావరణావృతంబు మణిహర్మ్యానేక సంకీర్ణమై
పటిమన్ నింగికి నంటునై యెసఁగు దేవయాల్చి విశ్వోత్కటో
త్కటమై యొప్పు మయూరి పట్టణము విఖ్యాతంబుగా సర్వ ది
క్తటముల్ స్వాత్మరుచిచ్ఛటం బరవఁగాఁ గన్పట్టు లోకంబునన్ 99

వ. అందు 100

క. అనుపమ కలహంస క్రౌం
చ మదభ్రమరావృతంబు చంచత్కోక మ
ధ్యమము లతాపాదపసంఘము
కమలాకర మొప్పు విమలకమలకముపై 101

ఆ.వె. అందుఁ బొల్చి నందరాజుఁ డా యాశ్రయు
జమున పుత్రము గాంచు శతభిషమున
శుభదినంబు నందు శుభలగ్నమునఁ బుట్టె
దివ్యతనుఁడు నిత్యభవ్యధనుఁడు 102

సీ. ఆకారధిగా నహా మర్ధంబు విర్దేం
మను ధారు దాస్యైకముగఁ బ్రియంబు
నగుచు దివ్యతఁ జేసి యనుదినంబును బ్రతి
క్షేత్రంబు గూర్చి వసించు నెన్ని
దగు గుణంబుల గల్గి యరయ నటంతస్వాంత
దింబు మవ్యక్తమనియు పలింప
నలరు చిదాత్మం బహంకారమును ఎంచ
ఘాట 'బల్ విస్మయములా'ను నైదు

తే.గీ. నింద్రియంబుల పదునొకొం డెసఁగు బుద్ధి
తత్త్వ మవ్యక్త తత్త్వ మీ తత్త్వములను
నెంచి నిర్వికార్యాగా నెసఁగుచుండు
మహితగుణధుర్యు శుభచర్యు మౌనివర్యు 108

తే.గీ. అవియు త్రైగుణ్య విషయమై యలరి జడమ
నగు నచిద్రూప మని యరయంగ నగుటఁ
నిందు సర్వేశ్వరుండనై యే సనాత
నుండనగు నీశ్వరుఁడనుగా నొప్పుచుండు 109

వ. సర్వ వ్యాప్తంబును సర్వ శోధంబును నమలంబును నానందంబును నగు
ఆకారంబుతోఁ గూడికొన్న యనంతుండును నగుణుండును సాక్షియు
నాస్తయు సర్వంబునకు ధారకుండును స్వాధీన సర్వవ్యాపకుండును
శ్రీభూనీళాధినాయకుండును ప్రభుండును నిత్యలావణ్య సౌందర్య సం
యుక్త శుభ విగ్రహుండును నే నగుట నేతత్పదార్థ త్రితయంబునందు
ద్విపదార్థాత్మకంబగు జగత్తు మచ్ఛరీరంబనియు నీశ్వరుండనగు నేను

---

1 మూ. సలేదు

రేలు గృహంబులు గల్గి తుల్యశీతోష్ణ సుఖ దుఃఖులై శరీరాదులందు నిర్మో
హంబు గల్గి భగవత్పాదాసక్తులై భోగాసక్తి బరంబు వలన భీతులై భగవ
త్ప్రియ బాంధవులుగాన పరమానంద సంభృతులై యంత లౌక్య కలం
బునం [1]దేశీకృతులై యానంద్రితులయ్యు దూరంబువలన దండ ప్రణా
మంబులు చేసి తద్దర్[2]శనాతిశయాహ్లాద [3]పులకీకృత విగ్రహులును బర
స్పరాలింగన తత్పరులును నానందాశ్రు విలోచనులును మాటిమాటికిం బెద్ద
దగ వచియించి దృష్టిం [4]బట్టి బెను పున్యలగు నంజలియుం దాసక్తి గల్గి
వినయానన మస్తకులంగుచు వారు ధన్యోస్మియని పల్కుచు నమీపంబు
నందుఁ గూర్చున్నవారై [5]యతిభక్తి వినయాన్వితులుగా నన్యోన్య ప్రశ్నం
చేయుచు రహస్యంబును శేషశేషిత్వ లక్షణంబును భగవత్పరతత్త్వంబును
నగు ధ్యానయోగంబు పరస్పరంబు వలన వినుచున్నవారై యనంతరంబు
112

సీ. సంతతం బన్యోన్య సత్సంగ వశమున
నిలఁ బరమానంద వృత్తిఁ జెంది
మాటి మాటికి వేఱు మహనీయ విస్ఫూర్తిఁ
దిరుగుచు నొక్కెడ దివ్యమైన
సిరిమించు వామన క్షేత్రంబునకు [7]యదృ
చ్ఛంజేసి వారలు నని రయమునఁ
దత్పుర ప్రాంతంబు దడయకఁ బ్రాపించు
యోగీశ్వరులయం దనూనవృత్తి

---

1 మూ - దేశీకృతులై
2 మూ - నాతిశ్రయా   3 మూ - పులకే
4 మూ - గఱపి   5 మూ - కృత
6 మూ - మరి   7 మూ - యధృచ

తే. గీ. నలిని యోగీశ్వరేశ్వరుం డచ్యుతుండు
సదధిపతి సకలాత్ముఁ డుత్సాహమూర్తి
వారికరుఁ జెఱిఁగియు నవ్వారి నెఱుఁగఁ
గోర్కులఁగంటుఁదగుచు వేర్కొని మునీంద్ర 113

తే. గీ. అంతటను జంచలాగ్ను లంపుటొంటి ధ
యంతరంబుగ నిస్తంద్రమై మహత్తు
గాంచు తఱిఁగాని జడివాన గడలు కొనఁగఁ
జేసె నక్కపాలాక్షుఁ దక్షుఁ సుజనుఁడు 114

క. ప్రకటితమోవృష్టికి నో
ర్వక యెగరముఁ జొచ్చి విష్ణుభక్తి హృదయుఁడై
యొక పుణ్యభాగ్ గేహ
వరకంఠి నరోమునీంద్రుఁ డధివసియించెన్ 115

తే. గీ. అంతట ననంత సంస్మరణానురక్తుఁ
డైన భూత మహాయోగి యరుగుదెంచి
సకలసృష్టిని వాగేహకివి విధిం
యోగి వినుతుండు నిష్కలాత్మాప గుణుఁడు 116

మ. సనయుం డా మహదాహ్వయుం డరట దేశయుఁత్ విహరించి స్వ
ల్పని గూఢంబగు దానిఁగన్గొని జహర్ష్యా[1]గంబునం దున్న నా
లవి వర్షాధర పీడితుం బ్రియమువేరన్ గాంచి బొందించు యా
త్రెపు ధామం బ నరోమునీశ్వరుఁడు విప్రవ్యాపునంతాముఁడై 117

---

1 పరా — గపు

వ. సకల జీవదయాపరుండుగానఁ గాసారయోగి ధామం బొసంగి చప్పు డా
మహాయోగి యచ్చట వృష్టిసిరంబునం దడిసి [1]సవాఁడగుచు హరిపదాంభోరు
హధ్యాన సంలగ్న హృదయులై సంతుది [2]తండగు నా స్థలంబునం
దధివసించిన యమ్మునిశ్రేష్ఠుం గూర్చి యాగేహి సేసుదెంచి తదవ
లోకనంబు సేసి నివర్తితుండగుచుఁ జొచ్చుచున్న మహదాఖ్యుంగాంచి వేది
వారు గృతాంజలులై ఎలాత్కారంబుగాఁ గరంబులంగై కొని గేహింజేర్చి
ప్రమోదంబున నమ్మునివ్యూ రేకావాస మాత్రయగు నాగేహి యందుఁ బర
దుఃఖా సహిష్ణులగుచు వార [3]లం దత్యంతయుగా సంతుదితావ్యతులగా
నీరథ్యాసులును నిశ్చలులును నిష్పందులును విపులంతర విఖ్యాతి పరులును
సమ్యగ్ధ్యాన సుధాపానులును సునిర్వృతులుంగా నూరకున్న యెడ విశ్వే
శ్వరుండగు దేవుండు గేహింజేరి తత్క్షమా చంశేచ్చుంజేసి తన్మధ్యంబు
నం దతిప్రవృద్ధుండయ్యె నని యట్లనియె 118

తే. గీ. ఆరయ సమ్మర్దము నఁద్రైనట్టి పంక
వాతుచేత మునులు దారు యంత్రమునను
దగిలికొని యున్న చెఱకుల దంట్లరీతి
నుండి రచ్యుత సంస్మృతి నూని మదిని 119

ఉ. ఆయెడ వార లద్భుతము నొందుచు నచ్చటఁ గ్లేశకారణం
బై యలరారు [5]నామునిని యమ్మురవైరిని నాత్మదృష్టిచేఁ
దాయక చూచి చూడకయె భాసిలుచుండిరి నిర్వ్యథ క్రిసం
ధాయక మానసంబు గాని సవ్యసచోన్నతులై వయంబునన్ 120

---

1 మూ — సలేదు 2 మూ — తలేదు
3 మూ - వారలయందత్యంబుగా 4 మూ - రు
5 మూ — నాపునియ

క బాలార్కుని కెన నరుణం
బై లసితంబైన కాంచనాంబరము మహా
శ్రీల నెసంగెడు దానిన్
జాలిం [1]ధరియించువాడ భక్తియుతుండవై 179

క పొరిం గింకిణీ వినాద
స్ఫురిత మణిగణ ప్రకాశమును గల కాంచిం
గరము ధరించెద భయ భ
క్తి రచిత బత్తింబుఁజేసి దివ్యాకారా 180

కం స్ఫురణంగాని నీ యురమునం
దరయఁగ వాత్సల్యతత్త్వమగు శ్రీవత్సం
బురమతి ధరియించెద నీ
కరుణారస దృష్టిఁ జేసి కంజదళాక్షా 181

మ మిగిఁ జెన్నొంది కరీంద్ర పుష్కరనిబద్ధంబులై కంబు చ
క్రగదా పద్మధరంబులై విభవమున్ దార్కొన్న నీబాహులన్
నిగమోక్తిన్ ధరియించువాఁడ మదిలో నిరతాసంయూత వం
ద్య గుణాతీత జగన్నివాస పరమాత్మా భక్తసంరక్షకా। 182

క శరదిందు సమానంబై
యిరవొప్పిన దీప్తిఁ దనరి శ్రీకర నయన
స్ఫురణము గల నీ వదనము
స్థిరబుద్ధి ధరియించువాఁడ శ్రీరమణీశా 183

---

1 మా. ధృతి 3 ము. ప్రకాశముగల

వ. ముకుంద దర్శనంబు వలన నాహ్లాద పరిపూర్ణ రసాత్మకంబును నానంద
గద్గదంబును నగువాక్యం బిట్లు నపుడీరితంబగుట నత్యాసార భూత
యోగీం[1]ద్రులు జగదీశ్వరు నవలోకించి తద్దర్శనంబువలన నమితంబగు
నానందంబు భరియింప నగరుహంబులంజేసి(?)యంచితులై ప్రపంచంబు
స్మరియింపక పారవశ్యగతులైన యప్పుడు సంపూర్ణమతులును మువ్వురు
నగు నమ్మునులకుఁ బాహ్యంబగు హరి యచింత్యంబును నవ్యయంబును
నగు నట్టి విశ్వరూపంబు దర్శింపంజేయ మువ్వురు సత్త్వమయంబును
నానందమయంబును శుభంబును నగు రూపంబుఁగూర్చి ప్రణమిల్లి
యాయోగిశేఖరు లానంద మగ్నులై యిట్లని స్తుతియించిరి 187

సీ. జయ రమేశ చతుర్దశ భువనైశ్వర్య సా
ప్రాముఖ్య ధురంధర మధువినాశ
జయ సర్వ సురగణ సార్వభౌమా[2] యఖి
లేశ్వర యద్రిజాతేశ వినుత
జయ భక్త జనస్తోత్ర సాఫల్యమయ విగ్ర
హా జయ నీలమేఘాంగ శౌరి
జయ కనకాంబర జయ కమలావర
ధ్యాన మనోజ్ఞ భుజాంతరతలం

తే.గీ. నాథ జయ సర్వకల్మష నాశ నామ
కీర్తన యనంత యచ్యుత కృష్ణ యోగి
మానసాంబుజ కర్ణికా మధ్య వాస
జయ విమల పద్మపత్ర[3]విస్తారనయన 188

---

1 మూ-ద్రుడు 2 మూ-మా తర్వాత ం అక్షరమున్నది

3 మూ విస్తార -

క. జయ ఖండిత దుష్టదనుజ
జయ విక్రమ దేవదేవ జయ సర్వజగ
న్మయ నిగమాంత విహార ని
ర్ద్వయ భువనవ్యాపి   మురశౌరీ 139

చ. జయ కమలాసహాయ మునిసన్నుతపాద జనార్దనా హరీ
జయ పరమేశ నీ వెపుడు సర్వజగంబును ప్రోచు[1]చుండ్గ మే
మయమతి(?)భక్తిగైకొని త్వదంఘ్రి సరోజము మిక్కుటంబుగా
నయతరనిష్ఠతో   వసువొందెద మెప్పు దద్యుతా 140

వ. ఇట్లు మహాయోగీశ్వరేశ్వరులు హృషీకేశు స్తుతియించి నిగమసారార్థ
సంగ్రహంబులును నద్భుతమంటపసోపానంబులును నద్భుత చింతామణు
లును శుభంబులును నగు మాదుప్రబంధములు గావించి రంత దేవుండును
నామ్నాయవేద్యుండును దయాపరుండును విశ్వమయుండును నగు విష్ణుం
డనవరతం బాయోగీశ్వరుల హృదయకమలంబులయం దధివసించె నట
మున్నవారు యోగంబుచేత దివ్యయోగసామ్రాజ్య వైభవం బతిశయంబుగా
భరియింపుచు జగతియం దెయ్యెడ సంచరింపుచుండురని మహాయోగి
మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవపురాణంబు నందలి యుత్తర
ఖండంబునందు భక్తిపరాయణుండగు నారాయణుండు సంవాదంబుఁ జేసి
నరునకుఁ జతుర్థాధ్యాయంబుఁ జెప్పె నెండియు నిట్లనియె 14

సీ. అంతట నాయోగు లందఱు పుణ్యభూ
    ములయందుఁ దిరుగుచు నెలమి మెఱసి
నీ యాత్రయంబగు నాయొప్పి బిరుదంబి
    యాత్మీయ మానసాబ్జాదు లగుచు

---

1 మ. టుచ్కు

ననుఁగూర్చి ప్రణమిల్లి నమ్యంబులై దివ్య
మంగు సంస్తవముం ముఖ్యమైన
స్తోత్రంబు సలిపి మర్త్యామరాయణు
లై కొంత సమయంబు నతుల భక్తి

తే.గీ. ఎందు వసియించి యిచ్చట నిరవుకొనిన
జనములంతు వార లధిక విజ్ఞాన మనువ
దింపు తత్త్వత్రయం బుపదేశ మిచ్చి
చిత్త మొగి యోగముకొనుటఁ జేసిరంత 142

క. జగతి విశాల మనోహర
మగు మూఁడు గుహలను జేరి యతిశయముగఁ జెం
పగుఁ దమ్ము గద్దియం గాని
యొగిఁ జేరా[1]సనము వరతుకోత్తరు లగుచున్ 143

తే.గీ. ఆసనమువందుఁ బ్రాఙ్ముఖు లగుచు మువ్వురు
భక్తితోడఁ బ్రాణాయామ పరత నొంది
పూని యష్టాక్షరీ మంత్రమునను రేచ
కంబు పూరక కుంభముల్ గరపి రంత 144

తే.గీ. మంత్ర మధ్య[2]మూర్ధ్న్యగ్రమ మహిమవలన
సారముగ కుంభకోద్భవ మారుతమునఁ
గలయ హృదయాంబుజం బున్ముఖముగఁ జేసి
యచ్యుతధ్యాన పరు లౌచు నతుల మతిని 145

---

1 మూ. తీర్థ  2 మూ. మధ్య

సీ ఇం దనుత్తమముగా నెసఁగు యోగముదాల్చి
మద్వృత్తులగు వీరు మహితగోష్ఠ
వసియింపుదురు నాదు ప్రాణభూతులుగట
నిర్భటనే వసియింతు వాఁర
ధారుణి యోగ విద్యానుశాంతుల కవ
శ్యతి మగు వీరి దర్శనము వచ్చి
వట్టి నీ వరయవో నరయంగ నాచేత
నల్పుఁ దగినవాని సారసభవ 166

తే గీ యా క్షణంబున వసియింతు నౌ క్షణార్థ
మవని వారక్త సంగమం బభింపావ
హారము కైవల్య సాధనం బనుఁడు బ్రహ్మ
నన్నుఁ గూర్చి వచించె విష్ణుఁ డియగుచు

ఆ వె యోగసిద్ధు లగుచు నొప్పు నీ భక్తులు
చూడ[1] రెట్టు లయినఁ జూడ్కిఁ జేసి
నన్ను వీరలాను ననంత శ్రీ పురుషోత్త
మా యటన్నఁ బల్కె దలఘుమతిని 167

వ మనంబున యోగంబు ధరియించి బ్రహ్మానందం బనుభవింపుచుఁ బ్రపంచం బతిక్రమించు చూడ్కిఁ గంటారం కవలోకనం జేమి వని యనినఁ జతుర్ముఖుండు మహానుభావా నిశ్చయంబుగ వీరి యోగంబు పరీక్షింప విధోపాయంబులచేత భగ్నంబుఁజేసెదఁ బ్రసన్నుండ వగుచు నాకు యోనంగుము దీనంజేసి వీరి మాహాత్మ్యంబు బ్రకటంబుగాఁ జేయఁబడుగాక యనుడు లక్ష్మణుండనందుఁ బ్రహ్మాష్టంత నగుచు నే నానతిచ్చిన నిట్లు మదనుఁ

1 మూ రెట్టనయిన

కుందగుచ్ఛ పటుహాసుండగు పరమేష్ఠి యప్సరోగణంబు రావించి
మదనుం గూర్చి యిట్లనియె 158

సీ. అప్సరసలఁగూడి యస్త్రాస్త్ర నీవు ప్ర
యత్నంబుఁ గాని తీవ్ర మరిగి వీరి
యాగంబులకు విఘ్న మొనరింపు మని యట్లు
లకలుఁ బంపించిన యా¹సురేశ
వనితా సమేతుఁడై చని వివిధోపాయ
సంపూర్ణమగు సుత్రాపానసత్క
గేయంబులను బరికింప దృఢవ్రతు
లైనట్టి మౌను లావరించి

తే.గీ. వారి కన్నులు దెరపింప బంపులేక
మగుడి ధాతకడకుఁ బోయి మధురపటిమ
నంతయు వెల్లడిగఁ జేసిన నాతఁ డధిక
రోష మానసుఁడై యంత యూధిగాంచి 159

తే.గీ. వ్యాఘ్రసింహప్రముఖమౌ హస్త రచిత
మును సృజించి భువి రాల భూరికరత
సహిత వర్షంబుఁ గావించె సత్వరముగ
దింపుగాఁ దనకోపంబు దీర్పఁదంగ 160

క. ధర నవ్వర్షంబు భయం
కర మగుటయు దానిచేతఁ గడు శ్రమరుచున్
త్వరితములై మృగములు ని
ర్భరముగ నిమ్మైయను గుహలఁ బ్రాపించె నొగిన్ 161

1 మూ. సురాశ

వ. ఆ గుహాలయంబున శరీరధారులును యోగస్థులును నగు మునీశ్వరులం జా
మృగంబులు దారుణంబులగు పాదవిక్షేపంబులచేత మర్దనంబు గావించె
[1]దాని యందుఁ గొన్ని శరభంబులు క్షుధా సంపరిపీడితంబులగు దంత
సంఘట్ట పీడనంబులచేత నాయోగివర్యుల భక్షించెఁ దత్క్షణ సంస్థిత
లయ్యు వారందఱు ధ్యానసుధా పరిపూరితులై దానిచేతఁ గోపింపఁబడిన
వారగుచు సుఖంబుగా నుండి రత్యాహార దోషంబుచేత శరభంబులు
పెక్కులు పీడింపఁబడిన వగుచుఁ గృశీభూతంబులును నిరుచ్ఛ్వాసంబులును
నగుచుఁ బ్రాణాంతికము నొందిన వయ్యె నిట్లు హతంబులగు మృగంబులను
శిష్యులగు నమ్మునులను నవలోకించి విరించి విస్మితుండై వారలఁ
బ్రశంసచేసి దివ్యలోకమయంబులగు వారల కాయంబుల నిరీక్షించి దేవ
మహర్షులతోఁ గూడఁ బ్రదక్షిణ నమస్కారంబులు గావించి యా యోగ
ప్రభావం బెట్టిదో మాటిమాటికిం బ్రశంసించి యనుత్తమంబును
యోగదార్ఢ్యంబును నగుఁ దత్ప్రభావం బిట్టిదని నరసిన వాఁడయ్యెఁ
బనుదెంచి నాతు ప్రముఖ్య వారలకగు యోగలక్షణము ప్రశ్నఁజేసి నా
కీయోగం బొసంగుమని ప్రార్థించిన నేను శేషశేషిత్వ లక్షణంబును
లోకంబునందు జ్ఞానులకు యోగుల కత్యంత రహస్యంబును నగు యోగం
బతనికొసంగిన పిదప దేవతాసనంబున మహర్షులతోఁ గూడ సంతు
ష్టుం డగుచు నాయనుమతింగై కొని పరమంబగు నిజధామంబుఁ బ్రవేశించె
నంత 162

క. అదురార బ్రపంచితీయగు
రతి నా మునివరులైన యోగి ధన్యులు దా మూ
ర్కరమతి నానష్ట గదపి
స్ఫురణతనై మత్పదముఁ జేరి రొగిన్ 163

---

1 మూ. దానియందు

క. ననుఁ గూర్చి మ్రొక్కి స్తుతియింపఁ
గానియాడి ప్రియంబు వలన గుణనిధులగు న
మ్మౌని వరులు నాదు పంపున
ననిరి సుపుణ్యమగు నైమిశవన స్థలికిన్ 164

తే. గీ. అంత వసియించు హరిదేవు నల్లు దాఁకఁ
బడు ననంతునిఁ గన్గొని వందనములఁ
గరపి యందున్న మునులఁ గాంచుటకు ధ్యాన
యోగ మువదేశ మిచ్చి రనూన మతిని 165

వ. అనంతరంబు 166

క. పొగడొందు హరిక్షేత్రం
బగు సాంగ్రామమునకు నరిగి హరిఁ బ్రణతిన్
బొగడి వెఱఁజేరి చేసి
జగతిని ధన్యుల మటంచు సలుపుదురు నతిన్ 167

ఉ. ఆ మునివర్యు లంతట రయంబునఁ దోయి యమోఘ్యఁ జేరి వి
ద్యామ [1]యుందత్వ [2]నిర్ణయ మహాత్ము రఘూత్తము లోకపాలను సు
త్రామ సురాంఘ్రి పద్మయుగుఁ దామరసాక్షునిఁ గూర్చి మ్రొక్కి లోఁ
బ్రేమము మీఱ భక్తి గురిపించుచు స్తోత్ర మొనర్చి రర్థితోన్ 168

---

1 ము- య 2 ము నిర్ణయము

తే.గీ. భవ్యతీరముగు గోమంత పర్వతమునఁ
తెలఁగు శౌరిని సంస్తుతిఁ జేసి యవల
యత్నముఁవలనఁ జని హరిద్వారమునను
జరఁగు జగదీశు సపర్యఁ జేసి 172

క. కరము ప్రయాగఁ దనర్చిన
హరిమాధవు దేవదేవు నమరస్తుతును
త్కరముగఁ బూజించి యచట
నరనుత వర్తిలి కొంతసమయము భక్తిన్ 173

సీ. ఆప్రయాగకుఁ బోయి యందుఁ దనరు గదా
ధరు సన్నుతించి యుదారమతిని
గంగా సముద్ర సంగమమున వర్ధిల్లు
విష్ణుని మ్రొక్కి యభిజ్ఞుఁడగుచుఁ
జిరకాల మచ్చటఁ జెన్నొంది యందున్న
వారల హరిభక్తి పరులఁ జేసి
గురుతరంబగుఁ క్షీరకూటంబునకుఁ జని
యచ్చటి రాము నధిక భక్తి

తే.గీ. వినుతిఁగావించి నిస్తుల విమల హృదయుఁ
డగుచు రమ్యనందిగ్రామమందుఁ గల్గు
రాఘవజ్ఞాని దేవేశుఁ బ్రణతిఁ జేసి
యచ్యుతారాధనాసక్తుఁడగుచు నంత 174

చ. కలయఁగ సర్వపావనము గాంచు ప్రభాసమునందు జేరి యం
దులఁదగు విశ్వరూపి పరితోషయితామరకోటి సేవయున్
సలిపి యనంతరంబున విచక్షణశీలుఁడు మాసి పాల ర
మ్యాలఁ జని రాత్మకారిని సపర్య యొనర్చుచు భక్తియుక్తుఁడై 175

తే గీ ఘనతఁ జెన్నొందు శ్రీకూర్మమునఁ [1]దనర్చు
కూర్మరూపిని సేవించి కోర్కి దీర్ప
తదనుసారిగ ధాత్రి సత్తమము గాంచి
యింపెసంగెడు నీలాద్రి కేగుదెంచి 176

క దూరంబుగఁ దద్భూధరం
బారూఢిగఁ గాంచి వార లతిభక్తిని బ
ల్మారుఁ బ్రణమిల్లుచును గం
భీరతఁ దత్క్షేత్రమునుఁ బ్రవేశించి రటన్ 177

వ ఇంద్రనీల శ్యామలతనుండును [2]పీతకౌశేయ వాసనుండును గిరీట హారకే యూర కుండలాంగద ధారియు గ్రైవేయ కాంచీ కటక కంకణాది విభూషితుండును పుండరీక విశాల నయనుండును దీర్ఘాయత భుజాయుగళుండును బింబాధరుండను కౌస్తుభమణి భ్రాజమానుండును శ్రీవత్సకృత లక్షణుండును బలభద్ర సుభద్రా సమాయుక్తుండును సర్వేశ్వరుండును బురాణ పురుషోత్తముండును నీశ్వరుండును [3]సంస్మృతాశేష పతిత పావన వ్రతుండును రమానాథుండు నగు జగన్నాథు నవలోకించి విధ్యుక్తంబుగాఁ బ్రణమిల్లి [4]వేదాంతానవహంబులగు స్తవంబులచేతఁ గొనియాడి తదీయ సేవాసక్త మనస్కులగుచు నా యిరువురు కొన్నిదినంబు లందు [5]వసియించి పురుషం బనుత్తమంబను మంత్రంబును నైనయష్టాక్షరం బుపదేశించి యభీష్టితంబగు సిద్ధివంబు నొసంగిరని మహాయోగి మాహాత్మ్యంబును సంవాదరూపంబగు శ్రీమంతంబును నగు భార్గవపురాణంబునందలి

---

1 మూ. దర్శ
2 పు. పీతకౌశేయవాసుండును 3 మూ. సంస్మృ
4 మూ. వేదాంతా 5 పు. వసియించెన

యుత్తరఖండంబునందలి పంచమాధ్యాయంబు భక్తపరాయణుండగు
నారాయణుండు నరునకుం జెప్పిన చెందియు నతం డవ్వలి కథాక్రమం
బెట్టిదని నతని కతండు వివరించిన విధంబు సూతుండు శౌనకాదుల కిట్టనియె
178

మ. లలితామూల దయాపయోధి పటుశౌలంకార యోగీంద్రహృ
[1]జ్జలజక్షేత్ర నివాస దానవగిరిశస్త్రైక ప్రోత్రక్రియా
జ్వల దివ్యాంఘ్రి పయోజ యుగ్మ యుత భాస్వత్పర్యటాతాంత క
ల్పలసత్ప్రాభవ భావ భావభవ రూపారూప నామక్రియా 179

క. శరచర శిఖి హరి వటు భృగు
వర రఘువర రామ బుద్ధ వాజీశ్వర భా
స్వరరూప రూపవిజిత
స్మర స్మరణామృత పదాను సంధాయి హరీ 180

మాలిని. శరణభవ సుతాంగా సత్యరూపాను[2]షంగా
వర విభవ నివేశా వాగివాద్రిష్ఠ వేశా
సురనగర విహారా సూరిలోకప్రచారా
విరచిత గుణ హారా వేణుగోపాల బాలా 181

గద్య. [3]ఇది శ్రీమద్రాజగోపాల కృష్ణ కరుణా కటాక్ష [4]వీక్షణాపాది పాండిత్య
ధుర్యానవరతావని మండలాఖండ సామ్రాజ్యధౌరేయ స్వసమర్థతాకృత
పటహ ధణంధణారావ విపరీత పరస్మృతియా ధిల్లీదాధీశ దుందుభి ధ్వాన
కోలాహల హనూ[5]మద్ధ్వజాంక కనకదండికృత హేర కలిత్రుత సందీపిత
ప్రతాప కీర్తి ప్రాభవ కౌసం వంశపయః పారావార రాకాసుధాకర పీఠాం

1 మూ జలజా 2 మూ షంగా 3 మూ ఇతి
4 మూ వీక్షణా 5 మూ మధ్వజా

ఇరనాయక శ్రోత్రరమణ భూపాలపుత్ర లక్ష్మణామాత్య గర్భశుక్తి ముక్తా
ఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్యనిధి సుమసాయక ఐహరి హేమ
నాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబునందు ఐదవాశ్వాస
మందు నారాయణుం గూర్చి నరుండు ప్రశ్నఁజేయుటయుఁ ఐదవపద
వర్ణనంబును వాసుదేవ ప్రభావంబును లక్ష్మి ప్రశ్నంజేసి నారాయణానుమతి
వలన శేషశాయి లింగరూపంబునుఁ దౌరవ మద్యోగింపుటయుఁ గాసార
భూత మహాదాన్వయ సంజనంబును దత్తసన్నుతగుమ భగవంతుండు
తదుపదేశకుండగుటయు వాసుదేవుండు మహాయోగులఁ గూర్చి విధిం
ప్రాణంతు న్యాసయోగం బుపదేశంబు గావింపుమని యనుటయుఁ దత్త
పాదంబున వార లట్ల వలనే సేయుటయుఁ దదనుమతింజేసి వారు తీర్థాట
నంబు సల్పుటయు వర్షాగమనంబున నొక్కెడో వారు ముప్పురుం గూడు
టయు వారిభక్తి దెలియ కౌతుక భగవంతుఁ దప్పుడు ప్రత్యక్షంబగుటయు
సమ్మోహయుముల హరిం గూరిచి మానసపూజ గావించుటయుఁ దదాజ్ఞం
గొని వారు నారాయణాశ్రమంబున కేతెంచుటయుఁ దత్త పో మాహాత్మ్యం
బును బ్రహ్మవైభూతకంబున నరోభూత మహాదాన్వయుల సకల
పుణ్యక్షేత్రముల సేవించి నీలాచలంబునందలి జగన్నాథుని సభివర్ణించు
టయు నను నైత్యభావంబుగల ప్రథమాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## ద్వితీయాశ్వాసము

క	శ్రీవనితా భూ[1]పీశా
ధారాళందానువర్తి వాగినగిరి వా
సా వాసవ వందిత శ్రీ
రీ వైభవశీల సురపురి గోపాలా 1

వ	అని సకలగుణ నికర ప్రజ్ఞాధురంధరుండగు నయ్యందు వివిధ వివిధో[2]ప
లాలన పరాయణుండగు నారాయణుం గూర్చి ప్రణమిల్లి మహాత్మా మహా
భాగులగు యోగులు నిఖిలపుణ్యక్షేత్రంబులు సంచరింపుచు నీలాచలంబు
నందలి సుభద్రా ప్రాణనాథుండగు జగన్నాథుం జూచింది యవల నెటు[3]గని
రని యడిగిన నతం డిట్లనియె 2

తే గీ	క్షితిని నంతటఁ దన్మహాక్షేత్రముల్
మయి యతిశయంబు గాంచు సింహాచలంబుఁ
జేరి యందున్న నరసింహసారసాక్షుఁ
బుణ్యమూర్తి జనార్దనుఁ బూజచేసి 3

క	ఘనమతు లవ్వలఁ దులసీ
వనమున[4]వర్తిలెడ గతిని వనజాక్షుని దే
[5]వనుతుని భక్తపరాయణు
వినుతించిరి యాత్మభక్తి విస్తృతి గాఁగన్ 4

---

1 మూ భూపీశ 2 మూ ధోసలా 3 మూ నెటురని నడిగిన
4 మూ వర్తిలి 5 మూ వనుతిని

తే. గీ. అంతఁ గృతశౌచమునమందు హరుని బయిని
వృషభవాహుఁ బూజగావించి పిదపఁ నధిక
పుణ్యముఁ బరమమగు స్తోత్రభూధరంబుఁ
జేరి రాధూధభక్తి సంస్ఫూర్తి లగుచు 5

తాపారభూత మహదాహ్వయుఁడు సింహాచలాది క్షేత్రముల సేవించుట

చ. మునివరు లాస్థలంబున సమున్నతిఁ గల్గ నృసింహరూపి దే
వునిఁ బరమాత్ము నచ్యుతుఁ బ్రభున్ మధుసూదనుఁ దద్గుణాత్మకం
బునగు సుధారసంబుఁ బరిపూరితభక్తిని గ్రోలుచున్ ముదం
బునఁ బ్రణమిల్లి నిష్ఠఁగొని పుణ్యతరోక్తి నుతించి రక్షితోన్ 6

తే. గీ. హర్ష నిర్భర మానసుఁ లగుచుఁ గొన్ని
దినము లందుండి యచట వర్తిలిన వరుం
కాశ్రితప్రియుఁ డగు శ్రీశునందు భక్తి
దృఢముగాఁ బాదు కొల్పిరి దివ్యమతిని 7

వ. అనంతరంబు నయ్యోగివర్యులు గోష్ఠి దినాంతరంబునందలి గుహాపార
మాహాత్మ్యక్షేత్రంబునందుఁ బ్రత్యక్షంబుగా స్మరణంబువలన ముక్కాలి
మూర్తి నొసంగు దేవుండును నారాయణుండును నగు హరింగూరిచి ప్రణ
మిల్లి స్తుతియింపుచుఁ దద్గుణంబు లభివర్ణింపుచు మహాయోగంబు ధరియిం
పుచుఁ జిరకాలం సమాహితులై యందున్న వరుం డనవరతం బపవర్గ
మార్గంబు దర్శింపం జేయుచున్నంత శ్రీకూర్మాధీశుండును వాంఛ్రనాయ
కుండును నగు నచ్యుతుం గూర్చి దండంబుఁ బెట్టికొనియాడి యవం ధర్మ
పురింజేరి యందలి యోగానంద నృసింహుం గూర్చి మ్రొక్కి స్తుతియించి
యధివిష్ణు పదంబు నందలి పిఠుండును వణుండును లక్ష్మీనారాయణుండగుఁ
గృష్ణుంగూర్చి నమస్కరించి యభివాదించి భక్తివలనఁ బూజగావించి
పిదప నహోబలంబున కేగెంచి హిరణ్యాసుర మర్దనుండగు జనార్దను

సేవించి [1]యంతటఁ గాంచురంగంబునందున్న విరంస్వామి సపర్య
గావించి తదనంతరంబున శ్రీవేంకటాచలంబుఁ జేర వేంచేసి 8

## కాసారభూత మహదాహ్వయులు వేంకటాచలంబున కరుదెంచుట

సీ. సౌవర్ణమయ సముజ్జ్వలము విచిత్రాతి
చారు[2]శిఖాప స్ఫుర ద్వారపరము
నానామృగాకీర్ణ వనరాజి విరాజి
తంబు పొన్న సహస్ర ధన్యకీర్ణ
పరివేష్టితంబయ్యుఁ బరికింప నూరుయో
జనములం [8] విరుపు యోజనములైదు
వెరలపు గల్గి భావింప మర్త్యుల కతి
లాఘవ హరంబు నాహ్లాదకరము

తే.గీ. భుక్తి ముక్తి ప్రదంబు సంపూర్ణ ఫలము
[4] సర్వ తీర్థాధిపతియగు స్వామి పుష్క-
రిణి గలిగి శేషరూపమై గణుతికెక్కు
కరుదు శ్రీవేంకటాచలం బనుదినంబు 9

క. వింసిత ఫలోపభోగా
కలనము భక్తాఘహరము గాఁదగు శేషా
చలము నిబిడర్షి సేవిత
మహము శుభంబైన దాని సరసిరి భక్తిన్ 10

క. వనజాక్షునకు వికుంఠ పు
ర నివాసం బెట్లు ప్రీతి రంజిలు నట్లం

---

1 మూ యట 2 మూ తుట 8 మూ విధుదు
4 మూ సర్వతీర్థాధిప యగు శ్రీ స్వామి పుష్క-

రంభాంచితోరుయుగళుండును సుజాను ద్విక[1]రాంచితుండును సర్వాధి
కారియు సులలిత శరణ్యాంఘ్రియుగాంచితుండును విహంగరాజ పక్షవిక్షేప
విచలిత కాంచనాంబరుండును శతపత్ర సంకాశ చామర సమీర చల
దాతపత్ర కమలవాసుండును ననంత విష్వక్సేనాది నిత్యముక్త సమావృ
తుండును బ్రహ్మరుద్రాదిదేవతతి పరిసేవితుండును సర్వేశ్వరుండును బూర్ణ
మండును జగత్త్రితయ వగు శ్రీపతి ప్రాదుర్భవింప మునిహృదయ కము
దృశ్యమానుం డగుచు నదృశ్యుండైన నప్పుడా మహాయోగులు మిలితాక్షుల
గుచు నాదేవేశు నవలోకించి మాటిమాటికిం బ్రణమిల్లుచు నిగమగోచరంబు
లను బహుస్తోత్రంబులను నగు ప్రబంధంబులచేతఁ గొనియాడిన శ్రీని
వాసుండు సంప్రహృష్టుం డగుచు స్వహస్తంబున వెక్కిలివిస్పృశియించుచు
దయచేతనగు పూర్ణావలోకనంబుల నమ్మునులం గనుఁగొని యిట్లనియె

కాసారభూత మహదాహ్వయులకు వేంకటాచలాధీశ్వరుఁడు
ప్రసన్నుఁడగుట

ఆ వె  భక్తులార యోగివరులార మత్ప్రియులు మీ
రలు మదీయ మూర్తి దెలిసి మీరు
వెంటనంటి నేను వేడ్క వచ్చెదఁ గాటి
గోవు గ్రేపుఁ గూర్చి పోవు కరణి 17

ఆ వె  సకల జీవకోటులకు ముక్తి కొఱకు మ
కాంక్షితంబు నమృత వారి సుఖము
వాడు తత్త్వము నగు ధ్యానయోగం బెఱు
దేశమిచ్చి పరము దెలుపఁ గోరి 18

క  ఇది మొదలుకొని జగంబుల
పదపడి విహ్వాశ్రయించు వారికి మోక్షం

1 మూ రాంచి  2 మూ నమ్మునిం  3 మూ రాసుల

యి దనరుఁ గోర్కు లొసంగెడ
కుదమున సంశయములేక మునివరులారా 19

సీ. ఆ దేవదేవుఁ డచ్యుతుఁ డిట్లు నా
జ్ఞాపించి వేంకటాచలముఁ జేరి
నంత నా యోగినాయకులు మువ్వురు భక్తి
తీర్థంబునందు వర్తిల్లి యచటి
వారికి నందు వఖ్యాగతులగు వార
లకు ముముక్షు రహస్య మకలంకంబు
నధికతరంబగు న్యాసయోగం బంత
యు విశేషముగ నిచ్చి యొప్పు దుర్కి

ఆ.వె. నప్పు డొక్క భూసురాగ్రేసరుండు త
త్త్వము నెఱుంగు కోర్కెఁ దనర వచ్చి
వారిపాదములకుఁ బ్రణమిల్లి భక్తిఁ ద
దాశ్రితుఁడయి ప్రవిమలాత్ముఁ డగుచు 20

క. ఇంయంగ జీవ పరమా
త్మల సంబంధంపుఁ దెలివిఁ దంచు నతని వి
త్కులి గారవించి మౌనీం
ద్రులు నుడివిరి నయతరోక్తి తోషిత మతులై 21

తే.గీ. అతుల మైనట్టి సంబంధమైన జ్ఞా
యాదిగా దేవ దేహి స్వరూప[1] కముఁ

---

1 మూ. కనుగు

దెలియ దేహాత్మ దానికి దేహమయ్యె
దేహి హరి యచ్యుతుండయ్యె ద్విజవరేణ్య 22

వ ఈ రీతి శరీరంబు భగవంతుని మోక్షసాధనం బగుట నేతద్విజ్ఞానంబు దెలిసి విధ్యుక్తంబుగా [1]నిరంతరంబు భాగవతార్చనంబు గావింప దద్దేహో[2]త్తమా శాశ్వతి యగు ముక్తిఁ బ్రాపింపఁ గలవని యిట్లు వల్కిన వరం దేము రిత్తుం డగు భాగవతార్చనంబుఁ జేయఁ దాం ద్రవ్య సంగ్రహణంబునం దాసక్తుండ నని వలుకుచు భక్తి శ్రద్ధాన్వితుఁ డగుచు వెండియుఁ దత్పాద సేవనంబుఁ జేసిన నప్పుడు సర్వజ్ఞుం డగు యోగు లతని యాశయం బెఱింగి వారాయణా కరుణచేతను నక్షయంబగు పాత్రం [4]బిచ్చి ధనపాత్ర సంరక్షణార్థంబు సుదర్శనంబను చక్రం బొసంగి యది దాని వం[5]శపారం పర్యంబుగా ధర్మసిద్ధికొఱకు భగవతాది సంపత్సారస్వతాత్మకుండగు పుత్రు నతని కిచ్చిన యాగీశ్వరుం వలన నిట్లభీష్టంబు గాంచి భూసురుండు భూమియందలి శ్రీరంగాది సర్వక్షేత్రంబులయందు నిరంతరం బెందెందు హరి యర్చగం దండందు మహాభాగవతులకు విధి పూర్వకంబుగా వస్త్రం బొసంగి తత్రత్యపేచ్ఛఁ జేసి తద్వైష్ణవంబులు శిష్యులకు శత తద్విధిని వసాధారణ వైభవంబుగ నే నవగాహింతు నని హరిం గూర్చి మనువుచుఁ బరుషంబు ధర్మ కీర్తనంబువలన జ్ఞానవంతుం డయ్యెదునని యమ్మహాం డు నిత్యంబు చతుర్విధంబగు నన్నంబు వైష్ణవులచేతఁ జేయించి వస్త్రం బులును గంధ పుష్పంబులును మహాభరణంబులును దను ధనసంపూర్ణం బగు నేతత్సంపాద్యంబు భాగవతకు నమర్పణము గావించి తద్వైష్ణవంబు మొదట హరి భక్తుల కొసంగి యథాక్రమంబుగా బ్రాహ్మణ క్షత్రియ విట్

1 మూ నిరంతంబు 2 మూ తి 3 మూ ని
4 మూ బిచ్చిన 5 మూ పార పర్యంతంబుగా

¹శూద్రుల కొసంగి యట్లనె నిరతంబులగు సర్వ వర్ణంబులకు స్థాన భేదంబు వలనఁ బ్రత్యేకంబుగా నొసంగి చతుర్విధాన్నంబును వస్త్రంబును గంధ పుష్పంబును భూషణంబును పర్వ్యపాద్యాది యాపంబునం జేసి పూజావందన పూర్వకంబుగా నభయం బొసంగి యశేష జనుల కభీష్టంబులగు వివిధ పదార్థంబు లిచ్చి వెండియు

క నిరతము సకలంబు లయిన
హరి యర్చావిగ్రహములయందు ద్విజుఁడు దాఁ
గలుపు సమస్తంబులుగా
నెరసిన పక్షోత్సవములు నిత్యోత్సవముల్. ౨౪

ఉ ధరణి సమస్త దిక్కుల నుదారత విస్ఫూర్తిఁ గాంచు దేవమం
దిరము లనేకముల్ మతి విశీర్ణములై యలరార నిట్లు భా
స్వర మతి భూసురుండు ప్రతిసంవత్సర ముత్సవమున్ రచించె [2]
హరి కరుణావలోకన సుధాంబు పరీత మనః ప్రభావుఁడై ౨౫

తే.గీ ఇవ్విధంబునఁ బరకాల పెంపు మీఱ
భక్తి భావన వర్లమ బ్రాహ్మణుండు
పరమ భాగవతార్చనఁ గలిపి సకల
ములు కనకమయములు సేసె లలితమతిని ౨౬

వ ³అట్లు సంబంధంబున సంసిద్ధులగుచు దుర్లభంబగు ముక్తిఁ బ్రాపించునట్టి
వైష్ణవాగ్రగణ్యుండగు హరిదాసాభిధాను చరితం బెవ్వఁడు విను సరిం దప్ప

---

1 మూ విట్పా 2 మూ విపి 3 పు అ

దానపరుం డయ్యెడు నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును
నగు భార్గవపురాణంబునందలి యుత్తర ఖండంబునందు సంవాదంబుఁ
జేసి శ్రోత్ర పరాయణుండగు నారాయణుండు నరునకు షష్ఠాధ్యాయంబుఁ
జెప్పె నా విట్లనియె 27

కాసారభూత మహదాహ్వయులు హస్తిగిరీశుని దర్శించుట.

సీ. అంతట మౌని నాయకులు మువ్వురు శ్రీని
కేతనంబగు గిరిఁ గేలుమోడ్చి
ప్రణమిల్లి భక్తి సంపత్తిఁ బ్రదక్షిణం
బొనరించి యాదవాచలముఁ జేరి
నారాయణునకుఁ బ్రణామంబు గావించి
యతని యథావిధి నర్చనంబుఁ
జేసి యర్చ్యావాస స్థిరయందు నధికంబు
నగు ఘటికాద్రికి నరిగి యందు

ఆ.వె. ఘటికయందుఁ బాపఁ గావింప నప్తమో
నుంకు మంగళముఁ బసూన గరిమఁ
దోఁచినట్టి దేవుఁ దోయజ నేత్రు న్నృ
సింహుఁ బ్రాపుఁ జేరి సేవఁ జేసి 28

తే.గీ. అంతఁ గాంచీపురముఁ జేరి యందుఁ దనరు
వర్ణి యరుణాచలముఁ గాంచి యధిక భక్తి
బ్రొక్కి ప్రియ హృష్టదేహులై రూఢి దాని
చెక్కిరి తత్పరిలమగ మౌను లిష్ట మతిని 29

---

2 పు. భక్తి

3 పు. పాఠ 4 పు. దేశాయనేత్ర

సీ. పుణ్యకోట్యర్కకాంతి భువనప్రభావంబు
దివ్యమాణిక్య సందీపితంబు
నగు నవ్విమానంబునందలి దివ్య సిం
హాసనం బందున నధివసించు
నద్ది మహాత్ముకు నమర వందితు గురు
వరదు విరాజితు వరధిశయను
దేవరాజుఁ గపర్ది దివిజనాథార్చితుఁ
బద్మాలయామనః పద్మమిత్రుఁ

ఆ.వె. పుండరీకనయను బార్థదయాకరు
జగదధీశు దైత్యజనవినాశు
మౌనివరులు గలరి మన్మథ మన్మథుఁ
గోటిశేఖరాభ స్ఫురితతేజు 80

మ. కరిశైలేంద్ర విభున్ జగత్పతి రమాకాంతున్ శుభాధారు భా
స్కార సంస్థానుఁ జరాచరాంతరవ్యాప్తప్రకోటిసంతాను శ్రీ
ధరు లోకేశు సమస్తలోకతను [1]సంధ్యకోటి సూర్యప్రభా
కరుదానందమయాంఘ్రి పంకజ నహిగ్రైవేయక ప్రస్తుతున్ 81

సీ. సౌశీల్య సౌందర్య దారు వత్సల ముఖ్య
గుణ వారినిధి లోకగురు మహాత్ము
దేవు బాలన్య భూతియగు ప్రసన్నాస్య
బింబఫలాధరుఁ గంబు కంఠు

---

1 సంధధాతువు ఆత్మనేపదముగాన సంధ్యానేక అని సవరించవలెను లేక సమస్తలోకతను సంధ్యున్ గోటిసూర్యప్రభున్ గరుణా అని సవరించవచ్చు

గోచరంబులగు సంస్తవంబులచేత సంస్తవంబు లొనరించి తదీయ సేవా
కాంక్షితులగుచు వారలం దధివసింప రంత మహాబలుండును గాంచీ
పురాధీశ్వరుండు విష్ణువర్ధనుండును బ్రేమ గర్భితస్వాంతులై వారి
సన్నిధి కేగుదెంచి సంతతం బమ్ముని శ్రేష్ఠుం గూర్చి ప్రణమిలి ప్రీతి
పూర్వకంబుగా సర్వోపచారములచేతఁ బూజించి యనుగ్రహంబు వడయుచు
[2]నుండు నవసరంబున 34

చ. అతని సమగ్ర శత్రుబల మహా బలవంతులు బాహువిక్రమో
న్నతు లగువార లప్పుడు ఘనంబగు రోషముఁ జెప్పి చుట్టుకో
డుపతి యుగ్రులై సమద సింధురవాజి రథాంగసైనిక
ప్రకరములతోడఁ బట్టణముఁ గాని భయానక దండయాత్రలన్ 35

క. ఆ విమతులఁ గన్గొని యా
ద్రావిడ నాయకుఁడు తురగదంతి బలములన్
లేవఁ బురికొల్పి కయ్యము
గావించె దదీయ బల వినాయమూలోదన్ 36

మ. సకలాశేష మనః పుటి ప్రకటన ధన్యత్రిపుర [3]హేషార కౌ
తప్రత బంధా [4]ఖురోత్థ పాంసుపటల చ్ఛన్నార్క[5]చంద్రర్క్ష రూ
పకులై ద్రావిడరాజ రావంబు బల కుండ దిక్క్రమా[6]దిత్యులై
ప్రకట స్ఫూర్తిని శత్రు సైన్యములఁ బోరం దాల్చె యుద్ధంబునన్ 37

---

1 మూ. సి 2 మూ. దు నవసరంబున
3 మూ. బంధా 4 మూ. ఖురోద్ధ
5 మూ. చంద్రార్కః 6 మూ. ధృత్యుక్తై

సీ. చటుల పదాతి మస్తక ఘర్షిత పదంబుఁ
దెగఁగింది [1] విడివడు సింధురములు
పృథుతర పరిపంథి హృత్పుటంబు లగల్చు
ఖురగతి మట్టాడు ఘోటకములు
పరిచెహ ఘర్షణాప్తి చక్రస్ఫూర్తి
రావంబుఁ బరగింద రథ చయంబు
పటుతర గాత్రవ ప్రహారంబుల హరింపఁ
గా హుంకరించెడు కాల్బలంబు

తే.గీ. గర్జి ద్రావితరాజ సంగ్రామరంగ
మండలం బొప్పె నప్పు డుద్దండ పటహ
దండధారావ కాహళ ధ్వాన మయ్యుఁ
గాంచు లోకంబునకు భయంకరత రోధ ౪౪

కాహారభూత మహదాహ్వయుఁడు కాంచీరాజున కభయమిచ్చుట

వ. ఇట్లు ప్రదీప్త మహో[2]మండలాఖండతరం దళిత విక్రమంబుగైకొని సముద్దండ కోదండ మౌర్వీకా టంకార రవంబుగం జేసి విపాటితాశాంత దంతావళస్వాంత పుట పటలాంతరగుచు నవ్వు కల్పాంత పావక శిఖుఁ దీంద్రించు నిశిత నారాచ పరంపరం సందీపితాటోప ప్రతాప విమత వీర [3]తుంబుఁ ఖాకాళ గావించి బంధుర మదాంధ సింధుర ప్రేంఖితీయ కంఖాళ సమర్హోత వాహా సేనా వితానంబు రిపుచమూ పద్గంబుపైఁ బురికొల్పి ఘోరంబు సేయ నెద లోకంబున కకాలవిలయ సమయ భ్రాంతి సంపాదకంబగు పరిపంథి రాజలోకం బనన్య సంభ్రమంబుగా గుమిగూడి

---

1. మూ విడు 2 మూ ఖండలామండి 3 మూ తుండంబు

తే.గీ. అంత నమ్ముని యందఱుం దధివసించు
కమలలోచను సేవించి మవతరంపు
స్తుతులు స్తుతియించి భగవంతుఁ జూచు కోర్కి-
యందు సతృప్తు లగుచు నత్యంత మతిని 42

తే.గీ. వమ్మట యథోక్తకారిని విధియుతంబు
గా సమర్పించి యవలఁ బ్రత్యాతిఁ గాంచి
భక్తి వల్లను నీరాజనమ్ములిష్టు
హరిని జూచి యొనర్చి రాహ్లాదు లగుచు 43

క. ప్రకటిత మతి నతిఁ బాంధవు
లతు రూతమైన యనంతు [illegible] భూవా
యతు [1] వరునిఁ జేరి మ్రొక్కడి
యతలంత స్థితిని భక్తి వంపర నవంన్ 44

తే.గీ. శౌరిని మహోన్నతు మహాత్ముఁ జక్రధారి
శ్రీహరిఁ ద్రివిక్రముని నుపాసించి పిదప
దేవతామానికి నివాసు దివ్యకాయు
శ్రీ నృసింహునిఁ గరుడాద్రి బ్రతివేరు 45

ఆ.వె. సేవచేసి వారు స్థిర నొక్క తలమునం
దున్న యష్టభుజునిఁ దోయజాక్షు
హరిఁ బ్రవాళ వర్ణ నక్షనికేతనా
సహితుఁ గూర్చి మొక్కి సంతసమున 46

---

1 మ. వసని

వ. విరాజితుండును మహాయశఃపుంజుండును నగు నర్పేవ్యు నుపాసించుచు నవంత
రంబ యమ్మునీశ్వరులు దీపాఢ్యుం గొనియాడి యవ్విధంబున జిరకాలం
బం దధివసించి కాంచీపుర నివాసులకుఁ బరతత్త్వంబు బోధింపుచు
న్యాసయోగం బుపదేశించి యట నప్పురంబున దాసిలోన మంగళ శ్రీగృధ్ర
సరస్తీరంబునందు నెలకొన్న సకలలోకేశ్వరుండగు విజయరాఘవుం
భజియించి యంత వీక్షారణ్యంబుఁ జేరి హృత్తాపనాశ[1]తటస్థుండగు
వీరరాఘవుం బూజించి దివ్యంబులగు స్తవంబులచేతఁ గొనియాడి
తదంఘ్రి పంకజద్వయంబుఁ గూర్చి ప్రణమిల్లి యటపై [2]దోత్రాద్రి
నెక్కి సంశ్రితామర భూరుహంబగు నృసింగరాయను నారాధించి పిమ్మట
గిష్ఠంబయిన కరిగి యందల గజార్తిఘ్నుల నరసి యవ్వల బలి
పురంబుఁ బ్రవేశించి మహాబలి సమర్పించి యంతటఁ బురస్థితుండును
జగత్పతియు నగు భక్తిసారుం గూర్చి వినమ్రీకృత మస్తకులగుచు
మిక్కిలి ప్రార్థించి తరువాత దేవేశుండును నవ్యయుండును నగు నైంద్ర
పురాధీశు నుపాసించి గోపురియందలి గోపతి నధికముగా సమర్చించి
యుత్తమంబగు శ్రీ ముష్ణ క్షేత్రంబున ఁ దృష్టలోచనిర్ఝరులగుచు దర్శ
నంబువలన ముక్తిదాయకుండగు వరాహరాజు సంసేవించి సంపూర్ణ
మానసులగుచు మహా పుణ్యంబగు మహిళాఖ్య క్షేత్రంబునందలి పద్మ
లోచనం గూర్చి నమస్కరించి యనుత్తమంబులగు స్తోత్రంబులచేత
స్తుతియించి యనంతరంబ 47

కాసారభూత మహదాహ్వయులు శ్రీరంగంబు ప్రవేశించుట

క. ధరణిని బ్రత్యక్షమయిన
పరమపదము నిఖిలలోక పావన మధికో
త్కరమగు శ్రీరంగము ముని
వరులు ప్రవేశించి రతుల భావాన్వితులై 48

1 మూ తటి 2 మూ స్తో

సీ. అతి భాసురము ప్రణవాకారము మహోన్న
తంబు నామ్నాయ వరంబు కాంచ
నాద్రి పోల్కి సింపనగు రంగ సంస్థితం
బగు సద్విమానంబు వదలి కర్త
దూరంబుగాఁ గాంచి వారు ధారుణి నేత్ర
వత్ప్రణామముఁ జేసి సత్ప్రసక్తిఁ
గల్గి వినయ సముత్కలితులై యుత్తమం
బగు నా రథం బెక్కి యందుఁ దనరు

ఆ.వె. భుజగ శయను శౌరిఁ బరమ శ్రీ రంగ నా
థుని వనేకకోటి తోయజాప్త
సన్నిభ ప్రభునిఁ బ్రసన్న ముఖాంభోజుఁ
బుండరీకనయనుఁ గాంచ నదను 49

సీ. మకుట కుండలదీప్త సుకర ముక్తామణి
హార విరాజిత వమర వినుత
విష్ణుం బీనోరస్కు విభ్రాజిత స్వర్ణ
వసను వక్షఃస్థిత వారిరాశి
తనయతోఁ గూడ నుద్యద్విద్యుదంచిత
పీం మేఘముఁ బోలి నెఱయు వానిఁ
గరుడకంధరు దివ్యకాంతి గుణ ధరుని
నతులిత పారిజాతాంఘ్రము యజ్ఞు

తే.గీ. సూత్రకోటీరుఁ బరమ పవిత్ర దీక్ష
తనువిఁ బ్రసృతాన్య కరపద్ముఁ దత్త్వ సద్ము
స్వామి నీలకువల దళ శ్యాము గౌరి
హారి వస్త్రోపధాను మహానుభావు 50

సీ. దైత్య సంహార నీకు దండంబు హరిదేవ
ర భవా యవంతి సరసిజాక్ష
పద్మాసనస్తుత్య ప్రణతి నీ కొనుము స
ద్భక్తప్రద నతి నీకుఁ బద్మపాణి
వనమాలి [1]కు వందనము వ్యాఘ్ర ని
వాసి పంకజాక్ష భక్త వరద
సత్య స్వరూప ప్రసన్నుఁడ వగుము శ్రీ
రంగనాయక గణరాజ వినుత

తే. గీ. శంకరార్చిత శ్రీపాద పంకజాత
యమరపాల ప్రశాంత ప్రపన్నార్తిహారి
కాంతి కోటిల దేహ సంహారనాథ
[2]మా కనుగ్రహంపవు కమ్ము లోకధారి 64

కాపారకుమార మహాద్యాయులు కావేరి తటంబునం దధివసించుట

వ. అని యివ్విధంబున దేవదేవుంగొనియాడి తదీయ కరుణావర్ష సంప్లుతులై యందున్నవారలంచేతఁ బూజింపబడిన వారలగుచుఁ గించిత్కాలం బధివసించి యనుత్తమంబును [3]సరహస్యంబును దాత్పర్యసహితంబును నగు ధ్యానయోగం బచటి వారల కందఱ కధికారానురూపంబువలన నెఱింగించి యాశ్రితులకు వార్త ప్రవర్తియుఁ [4]దృష్టులకుఁ దృష్టాంతరంబును ధ్యాన[5]కాములకు ధ్యానంబును

---

1 మూ. మాల విద్ధచరిత్ర 2 మూ. మ కనుగ్రహంపవు నమ్మ
3 సరహస్య 4 మూ. దృక్తులకు 5 మూ. కాలము

సీ. అట వారి కడ కేగి యతఁడు తత్పాదంబు
లను (గూర్చి యుఁ బ్రాలి లలిత మతిని
మరి మరి తెలి సుస్థిర భక్తిని గృతార్థ
హంగాంజలి యగుచు సదల బాష్ప
పర్యాకులాంగుఁడై భక్తి నా యోగి
వరులను గొనియాడి వారి చరణ
ములయందు భాసక్తి గల చూడ్కిఁ గైకొని
వ్యాప్త మనంబునఁ [1]దుష్టి నొంది

ఆ.వె. పల్కె మీ పదాబ్జ పాంక ప్రభావంబు
సద్వ్రతంబు సంపదావహంబు
గాన దర్శనంబు గా నాదు కుత్సితాం
గంబు దివ్యముగుచుఁ గదలఁ గొనుట 60

కాపారభూత మహాదాహ్యాయులు తుష్టతృప్తియుఁడగు
యోగిదాసున కనుగ్రహం బొసంగుట

వ. భాగవత సదారవింద పరాగం బఖిలార్థ సాధనం బగుట నిఖిలాపన్నాశకరంబును బరంబును పావనంబును మహత్తరంబుగాఁ దనరు నదియ లోకంబునందు ముక్తి నొసంగు సాధనంబు దానికంటె నితరం బగు సాధనంబు లేదని పెద్దలతప్పఁ బొగడుచున్న యతని సౌహార్ద దయా రసంబు వం గనుంగొని మహాత్ములును హరిప్రియులును నగు మునీంద్రులు కరుణాంతఃకరణులై [2]స్మృతియించుచు మరి యమ్మహాభాగ్యపదంబు దనంచి రంత సదియ యోగియు దాసావహ్యయుండును నగు పురుషశ్రేష్ఠుండు సంతతంబు వారలకు శుశ్రూష సేయ నిశ్చయించుచు నంత నిటియుండియుండెనుఁ బాతురంగబలయుతుండును భార్యాసహితుండును శ్రీమంతుండును లోకాధిపతి యను రాజు పుత్రకళత్ర సంయుతుండగుచు శ్రీరంగనాథ సపర్య కొఱకు తత్క్షేత్రంబున కేఁగుదెంచి తత్రాంతరంగాధినాయకుండగు

---

1 మూ. దృష్టి 2 మూ. స్మృతి

శ్రీరంగనాయకు సంసేవించి వివిధంబులగు రత్నంబులును విచిత్రంబులగు వంబ
రంబులును మహత్తరగు స్వర్ణంబును కటకంబును నను నను త్తమంబును నసంఖ్యం
బును బ్రియతోన్నపార్జితంబును నగు వస్తువు సమర్పించి తద్భృత్యులకుఁ గనకమణి
వసనాదికంబగు ద్రవ్యం బొసంగి యపు యోగీంద్ర సేవ కౌతుకుఁ దద్గ్రామం
బున కరుగుదెంచి మహిమాన్వితులు చెప్పుచున్న నప దారం నిరీక్షించి
కుటుంబిని కుమారికలతోఁ గూడఁ దత్పూజ గావించి యప్పుడు 61

### యోగిదాసుఁడు చోళరాజకన్యకా శతమును బరిణయమగుట

సీ. ఆ రాజ పుత్రిక లరిరమణీయ కం
దర్ప సన్నిభు యోగిదాసుఁగాంచి
మన్మథ నిర్భిన్నమానసులై వాని
యందు విలగ్న[1]మైనట్టి యాత్మ
ననువొంది యచ్చట నధివసియింప వా
రలచిత్త మెఱిఁగి యారాజు మదన
సుందరుండగువానిఁజూచి యమ్మోహుఁ
గూర్చి దండము పెట్టి గురుమనివఁ

తే.గీ. దనరఁ గృతాంజలి యగుచు వినుతిఁజేసి
తమ్ముములవల్ల వాయోగిదాసకులము
గలయ విస్ఫురిత గోత్రంబు దెలిసి ప్రీతి
నరది కొసఁగెను[2]ధారఁ గన్యాశతంబు 62

క. పౌర నరట యోగిదాసుఁడు
గరమునఁ బాణిగ్రహణము గావించెను ద

---

1 మూ. మానసలైనట్టి 2 దార

ధరతీగతుమారికలను
బరిపూర్ణానంద విమల భవ్యాత్ముండై ౬౩

మ. అనవద్యుండయి యమ్మహీపతి సముద్యల్లీలమై సర్వమా
తనరాజ్యం బట యోగిదాసునకు సత్యస్ఫూర్తిగా నిచ్చి వే
డ్కను వానిం జతురంగ సైన్యముల తోడన్ వేగ మార్కొయ ప
ట్తనముం జేరఁగఁ బంపి తా నచట సుధ్యాత్మ స్థితిన్ వర్ధిలెన్ ౬౪

తే.గీ. ఘోర వైరాగ్యుఁడగుచు నా జనవరుండు
సంతతంబా హరిప్రియ నామఁ గూర్చి
భక్తి పూశావఁ జేయుచుఁ బ్రమతి మోక్ష
మొందె దేహాంతమందు నానందుఁడగుచు ౬౫

ఆ.వె. అంత యోగిదాసుఁ డంగనాసహితుఁడై
బాల సమేతుఁ డగుచుఁ బట్టణంబుఁ
బొంది రాజ్య భోగములు చిరకాలంబు
ననుభవించె [1]సుఖరతాప్తి యగుచు ౬౬

క. అరయ నొకప్పుడు సుగీ
శ్వర సేవ యొనర్పు కోరికను శౌరిప్రియుఁ డు
త్కర మతిని యోగిదాసుఁడు
స్థిరభక్తిం జేరె వేడ్క శ్రీరంగంబున్ ౬౭

---

1 మూ సుఖ

తే.గీ. అందుఁ దగు యోగి రాజ పదారవింద
[1]బ్రతితాపనియందు విశేషభక్తిఁ
దివురు నా యోగిదాసుఁ జింతిత ఫలము
నసఁగి పౌనులు సంప్రీతి నలవరింప 68

క. కర మనవద్యుఁగ వాతని
నెఱిఁగి మునులు వాని కొసఁగి రింపుగ భక్తాం
ఘ్రి[2]రజస్సమర్చన యుత
స్ఫురణము హరిభక్తిరతము పుత్ర శతంబున్ 69

వ. అంత 70

క. మును లాతనిఁ బంపించిన
ననుపమమతి యోగిదాసు డతి మోదముతోన్
జనియెఁ దన పట్టణమునకు
ఘనతర చతురంగ బల నికాయము తోడన్ 71

వ. అనంతరంబు

శా. ధీమంతుండగు యోగిదాసునకు నందీప్త ప్రతాపంబు ను
ద్దామ [3]శ్రీ విభవంబు పుత్రశత సత్ప్రాభవంబున్ గల్గెబో
భూమీనాథుఁడు పెద్ద కాలము మహాభోగానుసంధాయియై
ప్రేమన్ యౌవన సంపదం దనరె గంభీర ప్రతిష్ఠారతిన్ 72

వ. నిగమ నిగమాంతవేత్తలును ధనుర్వేద విశారదులును నగు వారం జిరం
బగు కాలంబుచేత యౌవనంబు నొంది సంతతంబు విష్ణుభక్తి పరులును
తదీయారాధనోత్సుకులుగాఁ దనరుచు మహీ విభుండు పుత్రశతంబునకు

1 మూ. భి. తాపని 2 మూ. రజస్సేవార్చనయుత 3 మూ. బలప్రమో

రాజ్యశతం బొసంగిన మహాబలులగు రాజపుత్రులు తమతమ రాజ్యంబు లెంది ధర్మంబున సకలం బగుధరిం బాలింపుచు హర్షయుక్తులై యనయంబు భగవద్భాగవత పూజనంబు గావింపుచుఁ బ్రబలదేశ [1]నల్లె యలరింపు చుండి రంత ధీమంతుండును నిరపేక్షుండగు యోగిరాజుండు మోక్షార్థి యగుచు రంగ క్షమాతలంబు వందున్న యయోధ్యం సన్నిధి కేఁగు దెంచి నిరంతరంబు శుశ్రూష గావింపుచు దత్కృపావలోకన వీక్షితుం డగుచుఁ దత్పాదసేవకుండయి వారంవలన న్యాసమార్గం బవగా హించి తదనుగ్రహం బవలన దుర్గమంబగు పరమ స్థానంబు ప్రాపించె నేతద్యోగిదాస చరితం బెవ్వ రెవ్వండు వినఁగలండు వాఁ డిహలోకంబు నందలి సుఖం బనుభవించి దేహాంతంబునందు పరమం బగు చెందునని మహా యోగి మాహాత్మ్యం[2]బిమ్మంతంబునగు భార్గవ పురాణం బునందలి సప్త మాధ్యాయంబు సంవాద రూపంబుగా భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పెయు వెండియు నిట్టనియె 74

## కావేర భూతమహదాహ్వయులు సకలలోక తీర్థాటనంబు సేయుట

తే. గీ. ఇవ్విధంబున ఋరణా మెలమి మౌని
పుంగవుల భక్తిఁజేసి శ్రీరంగమున వ
సించు యప్పురి వెడలి విశేష మతిని
భూరితర మార్గమునఁ గూర్చి పోవ నెదుట 75

క. విమలాని శ్రీరామ క్షే
త్రము నడుమ వసించు హరిని ధరణీ నాథున్
గమలాక్షు గానక్రియు
సముదంచిత భక్తిఁ బూజ సల్పిన పిదపన్ 76

---

1 ము నట్లనె వం 2 రూ

తే. గీ. శ్రీనివాస స్థలమున వసించు దేవుఁ
యార్తజన భక్త కల్పవృక్షోత్తముఁ డాతఁ
భక్తిఁ గావించి యవల సువర్ణ భవన
వాసిని హరి సువర్ణన్ సపర్యఁ జేసి 77

క. పొగడొందఁగ నటఁ జన్నం
బగు వ్యాఘ్రపురంబునందు నలరు మహో దా
హం గిరిశ వందితు శ్రీహరి
నగధరు నర్చించి రతులితాహ్లాదమతిన్ 78

తే. గీ. అంత నాకాశనగరంబునందుఁ గల్గ
హరిని భక్తపరాయణు సంస్తుతాత్ము
శ్రీహరిని భక్తవల్లభు నారాధనంబు
సల్పి యవ్వలఁ దోషిత స్వాంతు లగుచు 79

క. ననతాత్మ భక్తి తత్పరు
లనఘులు మౌనివరు లుత్పలావర్తకమం
దానరసి శౌరిని నచ్యుతు
మనుఁ బూజయొనర్చి విగతకలుషాత్మకులై 80

తే. గీ. అంతటను బుణ్యవరియుగా వరి భ్యాలిఁ
గాంచు మణికోటియందులఁ గల్గుదేవుఁ
బుండరీకాక్షుని మహాప్రభుని నుతించి
యవలఁ గృష్ణపురినిఁగూర్చి యరిగి యందు 81

క. తనరు మహాకృష్ణుని పద
వనజంబులఁ గూర్చి మ్రొక్కి భక్తిని యతిసిం
గొనియాడి మౌని పుంగవు
లనుపమ హృదయానురాగులై యటఁ జనుచున్. 82

క. అమలంబగు విష్ణుస్థా
నము చేరి యచటి మహాత్మ్య వసదగాథన్
గమనాధినాథు నచ్యుతు 83
సముదంచిత భక్తిఁ బూని సన్నుతి సేర్మిన్

వ. అంతట నుత్తమంబగు శ్వేతహ్రదస్థానంబందలి గాంతమూర్తిని సమర్చించి పిదప నగ్నిపురంబుఁ బ్రవేశించి యచటి సురప్రియు సమారాధించి యనంతరంబు భార్గవస్థానంబనందలి భార్గవుం బ్రార్థించి వైకుంఠాఖ్యం బగు క్షేత్రంబునందలి మాధవుని పదారవిందంబులు సేవించి యటఁ బురు షోత్తముం జేరి భక్తసులభ సర్వసంపద గావించి యవల చక్రతీర్థంబునందలి సుదర్శనుంగూర్చి శరణంబుఁ జెంది మహాపుణ్యంబైన కుంభఘోణంబునందలి శార్ఙ్గపాణి చరణకమలంబులం గూర్చి ప్రణమిల్లి కొనియాడుచు నట్టి వాసి భూత స్థానం బాశ్రయించి శార్ఙ్గధనువంబుఁ జేసి, యంత పద్మనుల కపిష్ఠలంబున కేఁగుదెంచి గజార్తిఘ్నుం గూర్చి నమస్కృతిఁ గావించి యంతటను మనోహరంబగు చిత్రకూటంబునందు వెలుగొందు దుత్త మోత్తమంబగు గోవిందుఁ గాంచి ధ్యానంబు జేసి తరువాత శ్వేతపర్వ తంబునందలి పద్మలోచనుంగూర్చి నమ్రులై యథాన్యాయంబుగాఁ బూజించి పిమ్మటఁ బార్థస్థలంబునకుం బోయి యందు పరబ్రహ్మ నుపాసించి యనంతరంబు కృష్ణకోటియందలి మధుద్విషు సేవించి మహోత్సుకులగు వారలు పరిపూర్ణ మనోరథు లగుచు నందపురి యందలి మహానందు నభివందనముగావించి మథురపురి కరిగి యచట వృషాశ్రయు నాశ్రయించిన వారగుచు నంత 84

తే.గీ. అరుణమణి సంగమగ్రామమందుఁ జేరి
సంగమాహ్వయు సేవించి సదయు లమ్ము
నీంద్రదులు శరణ్యపురికేఁగి నిష్ఠభక్తి
శరణము గాఁ గొందిరి శరణ్యు హరినిఁగూర్చి 85

క. విమలంబగు సింహాక్షే
త్రమునకుఁ జని యందుఁ గల్గు ధరణీధరహరిన్
గమలాక్షు మహాసింహునిఁ
గమనీయ సుపాశ్రయంబు గావించి యటన్ 86

క. ధరణీమంటప సంస్థితు
హరి మల్లారిని నుతించి రనఘులు మౌనీ
శ్వరులు సమాహ్లాద హృదయు
లురుతర సుఖి[1]తాత్ములగుచు నూర్జితరతిన్ 87

క. ఘనమగు నిబిడ క్షేత్రం
బున హరి మహాత్ము నిఖిల పూజ్యుని దేవే
శుని నిఖిలాకారుని హరి
వనజాక్షుని సంశ్రయించి పరమోత్సవులై 88

క. లలి నట ధానుష్కంబునఁ
గల జగదీశ్వరునిఁ బూజగావించి మఱి

---

1 సుఖా లాత్మ

క్షాల యగు మోహనపురి యం
దలి యచ్యుతుఁ గాంచెమేఘా దర్శించి రాగిన్ 88

ప అంత 80

తే ఇల సరోభూత మహదాహ్వయులు సుభక్తి
నలరఁ బద్యంబు సమర్పించినట్టి మధురఁ
వేరి సుందర పదసరసీరుహంబు
సంస్రయించి మునీంద్రులు సంతసమున 01

క భూసుర మరి వృషభాద్రిని
వాసము గావించినట్టి పరమస్వామిన్
దాసవనుతుఁ బూజించిరి
ధీ సంపద గర్గ నిఖిల దివిజస్తుతులై 02

వ అంత శ్రీ మద్వరగుణ క్షేత్రంబు నందలి వాదు మహసించి ప్రేమార్ద్రిం బను గమలంబును వగు వనంబు గంటార లగుచుఁ బిదపఁ గురుకాద్యంబగు మహోత్సవంబు నందలి రమానథు నారాధించి ప్రియాన్వితు లగుచు గోష్ఠి పురంబునందలి గోష్ఠీపతి నభివాదనంబు గావించి దర్పసంస్తరంబగ వేఁగుడెంచి రయానంగూర్చి వందనం బొనర్చి ధన్విమంగళశైలవంబునందలి శౌరిం బూజ గావించి క్రమరక్షణంబునం దధివసించు బలాధ్యుఁ బిక్కిలి సపర్యసల్పి కురంగంబు నందలి పూర్ణుఁ బ్రార్థించి యవల రక్షీణంబు నందలి విష్ణుం గూర్చి మాటిమాటికిం బ్రణమిల్లుచు దివ్యంబులగు సంస్తవంబులంగొనియాడి తామ్రవతి యందు సమావిష్టుండగు నచ్యుతు వర్ణిగావించి పుణ్యంబగు పవంతకయిపం బందుండు జగత్పతియగు పద్మనాభుం గూర్చి నమస్కరించి స్తుతిఁ జేసి పరమానంద నిర్భరులగుచు మహీతలంబున నివ్విధంబున నగశిఖరంబులును మోక్షదంబులును విష్ణువాసభూతంబు

లును దివ్యంబులును నేతదాదృశంబులును నగు క్షేత్రంబులం గూర్చి సంచరింపుచు యోగివరులు సంసారధ్వాంత[1]వర్తులగు తత్తన్నివాసులకుఁ గృపాస్పదులగుచు సంతతంబు ధ్యానయోగ ప్రదీపంబున బ్రహ్మాది దుర్లభంబు నగు మోక్షంబు దర్శింపఁ జేయుచు యదృచ్ఛచేతఁ గొంతకాలం బధివసింపుచు ననంతరం బొక్కసమయంబునఁ గ్రమ్మఱ వేంకటాద్రి కరుదెంచి యెందియు తత్తీర్థంబునం దధివసించి యథాసుఖంబుగా సమాసీనులగుచు మనమిర్వు రనుత్తమంబగు నశేష క్షేత్రయాత్రలు గావించితిమి శ్వేత ద్వీపాదియాత్రఁ గావింపలేదని మిక్కిలి చింతించి యున్నరు 93

క. వారు మహా యోగము వి
స్ఫారమతింగొని యధోక్షజస్మరణము పొ
ల్పారఁగ శ్వేతద్వీపముఁ
జేరిరి నిస్తుల మహత్త్వశీలాస్పదులై 94

క. పొరిఁ దారకసంజ్ఞికమై
పరగం గా నందు నుండు పరమగు బ్రహ్మం
బరసి శిరస్స్పృష్టాంగముఁ
గరపి రథికసుతులఁ జేసి గౌరవఫణితిన్ 95

సీ. అంతట క్షీరాబ్ధి కరుదెంచి శ్రీభూమి
పుత్రీపతిని హరిని విశ్వరూపుఁ
బన్నగశాయిని భవహారకుని దివ్య
మగు నలంకారంబు నలరువాని

---

1 మూ వర్త

ఉ అందుఁ దనర్చు విష్ణుఁ బరమాత్ముని విశ్వవిభున్ బ్రభున్ సదా
నందు రమాసమేతుని యనంతు విధాతృమహా సేవితున్
గంధనిభాంగు నచ్యుతునిఁ గౌస్తుభ భూషణదివ్యసుందరున్
మందరధారిఁ గేశవు సుమానుత పాదపయోరుహంబులన్ జూచిన్ 100

క సక[1]లాలంకృతి సంయుతు
మకరధ్వజు జనకుఁ గాంచి మోదిశ్వరు డా
త్వర భావంగుచు మ్రొక్కెరి
[2]వికసీకృత భక్తి హృదయ విమలాంబుజుఁడై 101

తే గీ దివ్య సన్నుతుల నుతించి దివ్యదీప్తి
లవల సామోదలోకంబు నందుఁ జేరి
యందు వర్తిల్లు ననిరుద్ధ నమలమూర్తి
నరసుని సుషాపతిని గూర్చి సంస్తుతించి 102

వ అతని నమస్కరించి సంప్రహృష్ట తనూరుహుం డగుచు నటఁ బ్రమోదకం
బగు లోకంబు నందలి ప్రద్యుమ్నుం గొనియాడి దివ్యస్తుతులంచేత సంస్తు
తించి యోగీంద్రులుఁ బ్రహృష్టులగుచుఁ దదన్యామోద లోకస్థుండును
విభుండును నగు సంకర్షణుం గూర్చి మ్రొక్కి పరిపూర్ణమనోరథుం డగుచు
స్తోత్రింబు గావించి యవల నానంద నిలయంబును మహత్తువగు వైకుంఠ
నిలయంబుగాంచి యందు దివ్యంబగు సింహాసనంబునందుఁ బ్రకాశించు
సనాతనుండును గోటిసూర్య ప్రతీకాశుండును గోటిమన్మథ సదృశుండును
దివ్యపీతాంబర ధరుండును దివ్యకుసుమగంధ సమన్వితుండును శ్రీ భూసీ

---

1 మూ సకలాలంకృతి 2 మూ వికస్వ

శేషశాయి యుక్తుండును ఛత్రచామర శోభితుండును ననంతగరుడాది నిత్య ముక్త సంసేవితుండును నగు వాసుదేవుం గూర్చి పునః పునః ప్రణామం బాచరించి మహాహర్ష పరిపూరితు లగుచు నిగమాంత సంస్థితంబులగు స్తోత్రంబులచేత స్తుతియించి పూజాదికంబు గావించి శరణ్యంబగు తత్ప దయుగళంబుఁ గూర్చి పరంబగు శరణంబు నొంది యిట్లు భగవంతుని దివ్యలోకంబు దర్శించి తత్కృపా సంభృతు లగుచు నెందియు ముదంబునఁ జనరెండి యివ్విధంబున నిరంతరంబు భగవద్ధ్యానంబులు విలోకింపుచుఁ దిరుగుచు నిం యం దధివసించిన వీరం దివ్య చరితం బెవ్వ రాలకించుదు వార లాయురారోగ్యంబులు పరమైశ్వర్యంబు ప్రాపింపం గలరని మహాయోగి మాహాత్మ్యంబువం సంవాద రూపంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి యష్టమాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నరుననుంజెప్పె క్రమ్మఱ నిట్లనియె 108

సీ. అంతటఁ గాంచిమహా పురంబునకుఁ బ్రా
గ్భాగ మం[1]దత్యంత భవ్య మగుచుఁ
బార్శ్వ పారావారమునకుఁ బశ్చిమ భాగ
మందు నానా మహీ [2]జాత శోభి
తంబౌట నద్భుత దైవ పురోపమం
బగు మహాసౌరాఖ్య పురవరంబుఁ
బొలుపొంద మనుష్యయంత్ర భగవంతుఁడు
విశ్వస్రష్టుఁడు బ్రహ్మ విబుధనుతుఁడు

తే.గీ. ఇటతిఁ దన్ క్షేత్ర మొకటి కద నకలముంగు
క్షేత్రములోన కద నుంది స్థిర మనిన

1 మూ. ఎది 2 మూ. జాతి

వాని సారంబు దెలియుటకై నయముసఁ
[1]దూరెఁ బాతుర్య మెసఁగ సంతోషి యగుచు 104

# భక్తిసారుని జననము

క మున కరమున [2]దా క్షేత్రం
బున గం మహా సార యగుట భూరి మహిని దా
ని నెఱింగి పద్మ భవుఁడి
ట్లని తద్ఘా మంబు దాని కంసర పఱచెన్ 105

తే గీ [3]ఆదియు మొదలుగ ధారుణి యందు నవ్వ
రము మహీసార సంజ్ఞచే నమర దదభి
ధాన విఖ్యాతి పూతామృత ప్రదాయి
నిగఁ బ్రకాశించు నిత్యంబు షగి గడంగి 106

సీ అట పావనంబగు నవ్వరముననుండు
దేవేశుఁ డధిపతి దివ్యమూర్తి
కైవల్య మార్గానుకాంక్షి విరించి ప్ర
భృతి సురభార్గవర్షితతి భక్తి
నిత్య సంసేవ్యుండు నత్యసంధాయుండు
దనరుట ముక్తిప్రదంబు సర్వ
భూరుహ సేవితంబు మునీంద్ర జీవనం
బును దివ్యమును ఋజ్యముగఁ దనర్చు

---

1 మూ దూర్చె 2 మూ ముగుషే
3 మూ ఆది మొదలు ధారుణి

తే.గీ. దత్పవిత్ర మహానందు ధన్యుఁడౌచుఁ
భార్గవ [1]మునిరుఁ దతులప్రభావ ధుర్యుఁ
డాత్మ విద్యా విశారదుఁ డయమనిష
[2]నూని తపమాచరింప నుద్యుక్తుఁడయ్యె 107

తే.గీ. అట మహాగ్రీష్మమునను బంచాగ్ని మధ్య
సంస్థితుండయి హిమవేళ జలమునందుఁ
జేరి వర్షర్తువున బహిస్స్థమ నుండి
తపము గావించె నాతఁ దుగ్గార మతిని 108

క. తంమష్టాక్షర మంత్రము
స్థిర మతిఁ జరియింపు చతఁడు శ్రీహరి యర్చన్
గరపుచ దుస్సహమును   న
చ్చెరువుగ ఘోరముగఁ దపము సేయుచుఁదనరన్ 109

క. అల దుస్సహమైన తపో-
నలమునఁ దప్తుఁడయి దివిజనాథుఁడు క్రోధో-
ద్విగ్నుఁడై దానికి విఘ్నము
సలుపుట కుద్రిక్తుఁడగుచు సత్వరలీలన్ 110

తే.గీ. అప్సరసలందు శ్రేష్ఠయౌ నట్టివతిని
[3]తదనన్యముఁ గవలాంగి సుక్రుఁ బిలిచి

1 మూ మునీశ్వరు 2 మూని 3 మూ తనరాంఘ్రి

యాశివు భార్గవుఁ దపము హరింప నా స
రోమమునఁ గూర్చి నవ్విభుఁ డీతోఁ దనియె 111

చ పరమతి బ్రహ్మపుత్రుఁడు భార్గవమౌని యొనర్చె నెక్కుడై
పరఁగుఁ దపంబు విష్ణు మహిమస్థితిఁ జేయ మటంచు వేడ్కమై
స్ఫురదభితుఁడై వ యద్దిసురపుంగవుఁ డంపిన నా మహాంగి నం
స్మర యయి భార్గవాశ్రమరసాస్థలి కొయ్యనవచ్చె నున్నతిన్ 112

తే.గీ. పల్కి యా భార్గవునిఁ గాంచి వామనయన
శ్రేష్ఠరూపంబు గావించి ఋషికులేంద్రు
ప్రేమ పీతాక్ష్యతిత కల్పమ్ముఁ గలుపుచు
లలిత గాంధర్వ గానంబు సలిపి యపుడు 113

క కలయఁగ నహందేష్టితమై
కలరవము దనర్చు నధికగాంధర్వము వి
క్కిలి విని ముని దనతపమున
కలవడు విఘ్నంబు[1] దక్షి నతిసంతసుఁడై 114

వ అమ్మునివరుండు సూపనాను దాని నిర్విణ్ణుండై యత్యంతప్రీతియం దాసక్తుండగు
చుండు కలవాఁడగుచు దానితోఁగూడ రమియించి పిదపఁ దపోవ హర
ణంబు వలన దీనాత్ముండును బశ్చాత్తాపంబు నంతేసి దుఃఖితుండును
నయ్యెఁ బరిశుద్ధ భావంబు గతంబయ్యెనని పల్కి నిష్కృతి యందుఁ
గృత నిశ్చయుండగుచు భగవచ్చరణ కమల శరణాగతహృదయుండై

---

1 మూ. దక్షినపుడు

యాత్మ విద్యా విశారదుండును సర్వభూతదయామయుండును నగుచుఁ
దీర్ఘయాత్రాపరుండయ్యె నప్పు డక్కనకాంగి భార్గవస్య సంకల్పంబు వలని
సద్యోగర్భంబునం జెసి పరమ శోభనంబగు కలిద్వాపర సంధి కాలంబు
నందలి పౌర్ణమాసియందలి మధ్యాహ్నంబునందుఁ బ్రాంతంబునను యోగి
పుంగవుండును శ్రీపతి ధ్యాన సుధాపాన సంసక్తచిత్తుండును సుజ్ఞలుం
డును నగు తనయుం బ్రసవంబుగాంచి యట నొక్క లతాగృహంబు నం
దక్కుమారుఁ జేర్చి కార్యసిద్ధి వడసి దివిజలోకంబు గూర్చి [1]చనిన పిమ్మట
సర్వత శ్రేష్ఠుం డా లతానికేతనంబునందు సామస్వరంబున రోదనంబు
గావింప నంత నఖిలేశ్వరుండును మహిసార పురీశ్వరుండును నగు వాసు
దేవుండు శ్రీ భూమి సహితుం డగుచు ప్రత్యక్షంబుగాఁ దన్నికుంజంబున
కేఁగుదెంచి ప్రియతోఁ గూడ సంతుష్టుం డగుచుఁ గటాక్ష వీక్షణామృత
ధారల ననఘుఁడగు నా శిశువును సంతృప్తుంగావించి తిరోహితుండగుటయు
నట్లుండు సంప్రాప్త [2]స్వాంతుఁ డయిన యనంతరంబు 115

మ. హరిదాసాఖ్యుఁడు వేఁటలావికుఁడు నత్యంతప్రాభవోపేతుఁ డు
త్కరతేజుం డనపత్యుఁ డుత్తముఁడు బ్రహ్మజ్ఞాను మోదుండు శ్రీ
హరిభక్తుండు మహానుభావుఁడగు వాఁ డారూఢుఁడై యవ్వన
స్థిర కేతంబున ద్వారాన్వితుం డగుచు విద్విన్నామ సంస్కారుఁడై 116

ఆ.వె. శోకసంభ్రమములఁ బరగింపు దా వేత్ర
మందిరాంతరమున మఱియు బాలు
పగపు వాలకించి వచ్చి మోదమున వ
ర్ధకుని గాంచి పూర్ణభావుఁడగుచు 117

---

1 మూ. చనిపిమ్మట 2 మూ. ఎంతు

తే.గీ. దీప్తి విద్యోతమానుని దివ్యలక్ష
ణాంకితునిఁ గాఁగఁ బలరతి నరసి యద్భు
తంబు నొంది వరుండు పదస్థుఁ డగుచు
నింపు మీఱంగఁ దనమది నిట్టు లనియె 118

సీ. ఈ శ్వేతవన మేద నీ విద్య బొంగెఁ
విగ్రహం జేత ఘాపించి చూడఁ
దలిదండ్రు లెవ్వ రీ స్థలమున నెట్టుల
యధివసించుచునీ యర్భకుండు
క్షితిని యెవ్వనిచేత శివింపఁబడు వీఁడ
టని యవ్వనంబునం దమ్మహాండు
చింత గావింపు దా శివునకు బరక
ముఖ్యంబు లేకున్కి మోద మందు

తే.గీ. చంద్ర మనపత్యుఁడ నగు నా కతిశయంబు
నగు నపత్యంబు దైవ మొసఁగెఁ బ్రియమున
నని మనంబున నిశ్చయుఁడై గ్రహించె
నుత్తముని బాలుని నిగమోక్తిశాత్ము 119

వ. అంత 120

క. పురమున నర్భకు విడిచొని
శిర మాఘ్రాణించి సంతసిలు చిత్తముఁ దెం
పరయ లతాగృహము వెడలి
పరమానందాశ్రు భరిత భవ్యద్భుతుండై 121

ఆ.వె. గృహముఁ జేరి తనదు గృహిణిఁ గొనఁగ వారు
గౌరి పాదలోలు సత్కీలు
వేలావితుండు విభవసంపన్నుండు
స్ఫూర్తి యుతుఁడు నిత్య కీర్తితుఁడు 122

సీ. అటు యశోద సరసి నత్యుదిత సంస్పృష్ట
యై పూర్ణశశి మాడ్కి నవతరించు
సుతునిఁ గ్రై గొని పరిశుద్ధ సుగంధ జ
లాభిషేక మొనర్చి యతులమతిని
స్తన మధ్యమునఁ జేర్చి చన్నివ్వ నమ్మహాఁ
దెదుటఁ గల్గిన దేవు నింటిరేశు
జగదధిపాలకు సందర్శన మొనర్చి
తత్పదాంభోరుహ ధ్యాన మనెడు

తే.గీ. సుధ గ్రహించుటవలనను సుస్థిరముగ
తృప్తి తృష్ణయుఁ దాని యౌత్సుక్య మొంది
తల్లి చనుబా లొసంగినఁ ద్రావ కహర
హంబు వర్ధిష్ణుమానుఁడై యలరె [1]తనిని 123

తే.గీ. ఇట్లు దినదినంబులు నన నెల్లజనుల
హృష్టపుష్టాంగు డనయంబు వృద్ధినొందు
వానిఁగని విస్మయముఁ జెంది పరమదేవుఁ
గాఁ దలంచిరి సంతోషకారులగుచు 124

---

1 మూ. విభు

వ. అంత 125

క. ధర నందుండిన యొక భూ
సురుఁడు మునిరివాఁడు దనదు సుందరితోడన్
దొరిఁ బుత్రార్థముగాఁ దాఁ
జిరకాలము గడపెఁ ద ప్తదిత్తుం డగుచున్ 126

## భక్తిసార తపోమాహాత్మ్యము, కణికృష్ణ జననము

వ. తత్ప్రభావంబు విని ద్విజశ్రేష్ఠుం డతని దైవంబుగాఁ దలంచుచు నొక నాఁడు గోసంబంధంబగు పయంబును పాత్రంబునఁ గ్రైకొని యొక్కనాఁడు వేళలా విక గృహాంతంబు ప్రవేశించి పటుశ్రద్ధయమఁదగు జనార్దను వగిది రమ్యంబగు తన్మందిరంబు నందలి శోలయంద బాలార్కసంకాశుండగు నయ్యార్యు నవలోకించి యోగనిద్రాపరాయణుండగు నయ్యోగీంద్రు స్తుతియించుచుఁ దదీయ చరణంబుల కెఱఁగి పురోభాగంబున దుగ్ధపాత్రంబు లిడి మహాత్మా! భక్తవాంఛ ముపత్రిదుండ వగుటఁ గుచేలుం డొసంగిన పృథుకప్రసృతి శ్రీధరుండు సంగ్రహించిన విధంబునఁ బ్రీతిదినంబు భక్తిపూర్వకంబుగా దీని గ్రహింపుమని యట్లు నుడివినఁ గరుణాసాంద్రుండగు యోగీంద్రుండు సమీపిన పద్మాసనుం డగుచుఁ బ్రియంబుగ క్షీరాన్నంబులు గ్రోలి నివ్విధంబునఁ బ్రీతిదినంబు భక్తిపూర్వకంబుగా వారిచేత సమర్పితంబగుదానిఁ ద్రావుచు నొకనాఁడు నమ్మహానుభావుండు భక్తశేషంబు వారల కొసంగిన నద్భక్తింజేసి మహాత్ముని భక్తశేషంబుగైకొని దంపతులు పానంబుఁజేసి తత్క్షణంబ నవయౌవనంబు నొందిరట నమర ప్రభావంబున నొక్కసుకుమారుండు ప్రియంబున వారికిఁ గుమారుండయ్యెఁ గణికృష్ణుండని యురయంబడి యమ్మహాండు శమాదిగుణ సంయుతుండును నారాయణ చరణ కమలాసేవకుండును దదీయ పూజా నిరతుండును విద్యావిశారదుండునుంగాఁ బ్రీతి

శింటెచంత భార్గవయోగీంద్రుఁడు వర్షసప్తకం బా గృహంబునం బధివ
సించి,[1] దాని పిడ యోగ సంశీలనమ్మున యగుచు వ్యారయోగంబు కొం
కుత్తముఁడగు మహదాహ్వయము వాఁగ్రయించి యనంతరంబు 187

ఆ.వె. అంతనివల్ల దాని నరసి సంతుష్టుఁడై
యతఁడు వైశ గహ్వరాంతరంబు
పొడుకొని వయమునఁ బద్మాసనాసీనుఁ
డగుచు యోగ మూని నతుం మతిని 188

## యో గ వి ద్యా మ హి మ ము

క. కరఁగి యమాద్యష్టాంగయు
తుఁడునై యత్యంత నిష్ఠతోఁ బరమాత్మున్
జరరాగరహితంబును
మృతవంద్యుని సంస్మరించి నిగుడించుచు నంతన్

సీ. పరికింపఁగఁ గపాలభాతి ధౌత్రాదిక
షట్కర్మములఁ జేసి సమత గల్గి
యలరు నా జాలంధరాది ముద్రలు పది
విధ్యుక్తముగ సల్పి విమల మతిని
దగ నిరాద్యంతస్థ ధమనులు పదుగాఁ
జూచుచుఁ దీపక స్ఫూర్తి మరి
యమవొందు శీతలయును భ్రమరయును భ
స్త్రికయును కుంభ మూర్ఛికయు నవల

1. మూ వాని 2 మూ లేదు

పరిస్థితంబును నుత్తమంబును దివ్యంబు నగు తుర్యాంబుజం బూర్ధ్వంబు
గావించి తత్క్రమం బధ్యస్థంబును ననుపమంబును నీప్సితంబును నగు
సుధారసం బధోముఖంబుగా స్రవియింపంజేసి ముదంబున నిజహృదయ
కమలంబునందుఁ బూరించి యోగసామ్రాజ్య సౌభాగ్య భూషణం బగుచు
నమ్మునీంద్రుండు మనఃపద్మస్థాచ్యుతధ్యానమగ్నుండును బరవశ
గరుండును దదీయచరణకమల సంలగ్న చిత్తుండును నగుచు నమృత
రసంబు గ్రోలుచు బాహ్య ప్రపంచంబు మఱచి బ్రహ్మానంద
పరాయణుండై యిట్లు నత్త కులాచల గుహాంతరమున వేఱువేఱుగా
నూఱు మహేంద్ర యోగంబు గైకొనియుండి గోవింద నిలయంబులగు
క్షేత్రంబు లనవరతంబు సంచరింపుచు నఖిల సిద్ధాంతంబు లరసి వివిధంబు
లగు శాస్త్రంబు లాలోడనంబు గావించు మర్మంబులఁ బేధించి సిద్ధాంత
కరుఁడు విశిష్టం బగుచు విష్ణుసిద్ధాంత సామ్రాజ్య పరిపాలన నిపుణుం
డయ్యె నంత 182

తే. ఇట్లు మునివరుఁ డున్నతో త్కృష్టుఁడు
శౌరి భక్తానురక్తుండై జగతి నతని
కెలమి విశ్వ స్వరూపంబు వీక్షణంబు
సల్పఁ గావించె నవ్వ దుత్సాహ మతిని 183

క. అగణిత మగు నైశ్వర్యం
బగు నా రూపంబు గాంచి యానందాత్మ
త్రిఁ గాని నిగమాంత గోచర
మగు నుతుల నుతించె యోగి యతులిత భక్తిన్ 184

తే.గీ. ఇట్లు భక్తి రసావేశ మెనయ నట్టి
భావ భావనవల్లభు భక్తిసారుఁ
డనెడు నామంబు గల్గి విఖ్యాతిఁ బొందె
నప్పు డుర్వరయందు మహర్షి వరుఁడు 185

## భక్తిసారుఁడు భర్గుగర్వ మపహరించుట

ఉ. అంతట నొక్కనాఁ డొక వనాంతర సీమ మహర్షి యిందిరా
కాంతుని పాదపద్మమునఁ గల్గు సుధం గలయంగఁ గ్రోలు సు
స్వాంతము గల్గి వర్తిలుట సజ్జన పూజ్యుఁడు భూమిభృత్సుతా
కాంతుఁడు శంకరుండు త్రిజగన్నుతుఁ డం దరుదెంచె నయ్యెడన్ 186

తే.గీ. అవని వృషభాధిపారూఢుఁడైన హరుఁడు
భవుఁడు చండీశ్వరుండు దా పార్వతీ స
మేతుఁడై కాంచె మునిరాజు మిహిరతేజు
ఘనగుణసమాజు సజ్జనకల్పభూజు 187

ఉ. అంతఁ బ్రకాశమానుఁడగు నమ్ముని నాయకుఁగాంచి పార్వతీ
కాంత మహామహన్ సతత కంజదళాక్ష పదారవింద సు
స్వాంత మహాత్మ రాజిత రసాధర వాసుని భూతనాథు ధీ
మంతుని శూలిఁ జూచి నిజమంతరభక్తి వచించె నీయెడన్ 188

తే.గీ. ఇట్టివాని యందు యోగీశ్వరుండు
గన్నుగవ మోడ్చుకొని యొంటిగా నయంబు
వీడి యున్నాఁడు బాహ్యంబు వీడి తరుణ
సూర్య సంతాపఁ దనుచు నస్తోకమతిని 190

క. ఇతని ప్రభావము చరితము
నతి ముదమున నిప్పు డెఱిఁగి యవలం బ్రయాణ
స్థితి గలవగ మూర్తియమై
కుతుకంబుగ దీనిఁజేయు గుణరత్న నిధీ 140

క. అని పార్వతి నుడివిన న
య్యనలాక్షుఁడు సంతసంబు నందుచు యోగీం
ద్రుని సామర్థ్యం బరయఁగ
వనముఁ బ్రవేశించి పల్కె భవ్యతరోక్తిన్ 141

ఆ.వె. ఏమి కోరెద నో మహానుభావా! నీవు
నధికమైన వరము నడుగ నిత్తు
నాదు దర్శనము వృథా దనందు గాన
భువన మందు సుజన నివహములకు 142

సీ. అనవుండు తద్వాక్య మాలించి మునిరాజ
నయన సముల్లసనంబుఁ జేసి
ముంగల వర్తిల్లు భూతనాయకుఁ గాంచి
యర్థవత్తైన వాక్యంబు నుడివె
నేను నిస్సంగుండ నిరపేక్షుఁడను నాకు
ఏ చేయవలసిన చింత లేని
లేదు మహేశ్వర నీదుస్థానంబున
కేగు మటన్న మహేశ్వరుండు

ఆ.వె. తన్నృపదూతిని సుధర్ముని నిరపేక్ష
కుని దిగించి వెండియును తపుండు
పల్కె నిస్పృహుండు ప్రశాంతవక్త్రుఁ డిట్టుల
హేళనంబు సేయఁగాల దనుచు 148

ఆ.వె. సిద్ధమై యదృచ్ఛచేతఁ బ్రాప్తంబైన
దానిఁ గొనఁగవలయు ధన్యచరిత
యడుగు మనుచు నయ్యమాధిపుఁ డాడినఁ
దన ప్రయోజనంబు దలఁచి యతఁడు

తే.గీ. అంత కంఠోపస్థితమైన సూఁది
గొని తదంతనె యా దింబున పసించు
నిష్ఠ సూత్రంబు గల్గుట శేష పరంబు
చేరుకొనియెద మాకిమ్ము విమలమతిని 146

క. అనఁ దా వాక్యము విని హరుఁ
డనుపమ రోషప్రయుక్తమగు నేత్రుండై
ఘనతర కాండహను డో
ల్కొని పెల్గుచుఁ బల్కె పరివికీర్ణతరోక్తిన్

తే.గీ. ఏల నాతోడఁ బరిహాస మెలమి చిత్ర
మైన వాదు మహత్త్వ మీ వఱయఁగాం
వేల యా ముని వరికింపు మిపుడు నా ప్ర
భావము సమస్త జన భయ ప్రాపకంబు 147

అదిన ఘుటిక రసప్రౌఢత్వ మగుట
ఏఏ రెండుఁ గ్రైకొను మిష్టమతిని
రని చెప్పి వాని వారిని బ్రోవ నిడి సమా
హితుఁడౌటఁ గస్తూరి బుచ్చి వరేల్పు

తే గీ రసముఁ గంధము ఘుటికయు ననెడి వీని
వలన ఫలసిద్ధి యనుఁడు సర్వము నుడువ
కౌతుక మెక్కుడయ్యె సత్కారముల నిని
యోగి పద్మంబు నమ్మహాయోగి గూర్చి 167

వ మహాత్మా! ధాత్రియందెవ్వండు మనుజుం డిక్కాంధ[1] ధరియింపఁగలఁ డతండు
మృత్యుజరల నొందక యమరత్వంబు బ్రాపింపనయ్యెడుఁ గానఁ బాద
రస ఘుటికా సంగ్రహంబు పూర్వంబునకు మహాయాసంబగుట దాని
విధము మొదటఁ బాదరసంబుగొని యుక్తంబుగు నౌషధీరసంబులచేతఁ
బ్రత్యేకముగా శోధించి యట దానికి రసపంచకంబును షట్త్రింశ రస
వర్గంబును నుత్తమంబగు ధృతి బీజంబునుం గావించి యుక్తంబులగు
రత్నంబులు గ్రాసముగా నొసంగి యంత నష్టాదశ సంస్కారములచేత
సాంగంబగుట దృఢవ్రతులగు [2] తపస్వులచేత దుర్లభమగు నీపారస
ఘుటిక నే నొందనగుట దీని స్పర్శంబువలన తక్షణంబ యనుత్త
మంబును గోటిలోహంబును నగు సువర్ణము గావింపఁగల దని పల్కి
యతం డాశ్చర్యంబుఁ దద్వచనంబు విని స్వయమాకుండగుచు నిజాంగము
నందుఁ దరుణార్క సన్నిభంబగు కంచుకము దర్శింపంజేసి సిద్ధుం
గూర్చి యిట్లనియె 168

1 మూ ధ 2 మూ తపస్సు

సీ. నలువొందు రసపాదసమువంటు పీఠుఁ గ
ట్టమచేర [1] యహంకృతి సలిపె నకట
యాయాన మని చెప్పె యమ్మునీంద్రుఁడు భక్తి
పొంటంతు తనదగుఁ బర [2] రణము
ముదిత గావించి సత్కృత్యులై యాదరం
బుగ దాని గొనఁగి సంపూర్ణమతిని
దాని ప్రభావం బమానంబుగాఁ బల్కఁ
బరికింప దీని సంస్పర్శమునకు

ఆ.వె. దక్షిణంబు భూమిధరమేని స్వర్ణవి
కారమౌను దీని ఘనుఁడు మనుజుఁ
డెవఁడు దాల్చు నాతఁ డెంపు వక్షయ సూక్ష్మ
యోగనంబుఁ జెందు నతిశయముగ 160

చ. వసుధ విచిత్ర సుందరత వర్ణము గాఁగం దెల్పరాంబున్
రసికతఁ బొల్చు యుత్తమత రంజిల విస్తరతం బొనంగఁగా
నొసఁగు సమస్తకార్యముల నూతన దివ్యములౌచుఁగల్గా సా
ధ్వస భవ సాగరంబు గడచం దనరార నయంబు పేరుకన్.

క. అని దాని ప్రభావము సొం
పున నుడివిన భక్తిపాత మునివరుఁ గని భ
క్తిని సాగిలి దండం బిడి
వినయాన్వితుఁడగుచు సిద్ధ విభుఁ డిష్టమతిన్ 161

తే.గీ. స్థిరముగా మించు పాదస్పృతిక గ్రహించు
కొని ముదంబునఁ బలుమారు మున్ని ప్రశంస
సల్పె చెంతట భక్తి మహాన్వితుఁడై ప్ర
దక్షిణముఁ జేసి పులినెక్కి త్వరిత గతిని 162

---

1 మిశ్రమునూనము 2 పరా యుగము

ఆ.వె. తత్పరీక్షఁ జేయఁదగు కోర్కి గలబుద్ధి
చేతఁ జిత్రకూట శిఖిఁ జేరి
[illegible] పదాంబు[illegible] [1]వృత్తికతే దాని
సంస్పృశించె సిద్ధజన విధంబు 163

ఆ.వె. అట్లు చిత్రకూట మన్నతంబుగ దివ్య
కనకరూప మగుటఁ గాంచనాద్రి
కరణి నొప్పు దానిఁ గాంచి విస్మయ మొంది
యమరు లరుగు [2]దెంచి రతుల మతిని 164

వ. అట్లు సమీచీనంబుగాఁ బరీక్షించి సిద్ధుం డాశ్చర్యమానసుండగుచు జగంబు నందలి నరుల విచారం బెఱింగి (2) యోగమాహాత్మ్యంబుచేత సమ్మహీధర బిలంబునందు దృఢంబుగా స్థాపనంబు గావించి యట వెండియు భక్తిసారుండై తదీయ పద పంకజంబులఁ గూర్చి దండంబు వెట్ట లేచి క్రమ్మఱ శిరంబు వంచి చేసి భక్తిప్రవణ హృదయుండగుచు యోగీంద్రుం గొనియాడి [3]భువనంబునం దనమునగు తత్పరత పరాగ మాహాత్మ్యంబుఁ బ్రశంసించుచు తత్స్పర్శంబువలన గిరిశృంగంబులు సువర్ణంబులగుట తప్పెరువుపడి విష్ణుండు నిక్కంబుగా లోకేశ్వరుండు తద్భక్తుల [4]పావనులు వారి పాదపరాగంబు పురుషులకు సకల ... హేతంబును భోగమోక్షైక సాధనంబును నగు పుణ్యంబగుట వారుపాద స్పర్శంబువలన నహల్య శాపవిముక్తయైన తెఱంగున భగవచ్చరణ రజస్సంస్పర్శంబువలన మహీధరంబు కాంచనంబయ్యెఁ జేయఁ బడియె నట్లగుట విశ్వంబున భగవద్భక్తుం డధికుండుగా వరయోపలయునని మున్ముందు ప్రదక్షిణంబు గావించి స్తుతియించి నమస్కరించి యంతఁ దదాజ్ఞఁ బడసి నిజనికేతనంబుగూర్చి చనిన పిమ్మట యోగీంద్రాగ

1 మూ. వృత్తవు   2 మూ. దెంతు
3 మూ. భువనం బునందసమునంబగు   4 మూ. పై

గవ్యాంబును మహోద్యుతియు నగు భక్తిపాదుండు డె గంబు ధరియించి చిరకాలంబు[1] గుహాంతరంబునం దధివసించి యున్న యట్టి యోగి పుంగవులగు కాసారభూత మహదాహ్వయులు తద్గుహా ప్రాంత సరణిం గూర్చి పోవుచు గుహానిర్గతంబును దయార్క ప్రభవంబును నగు తేజం బవలోకించి యందొ[2]క మహాయోగి యోగంబుగ్రైకొని యున్న వాఁడని తెలిసినవా రగుట వారలలోన భూతాఖ్య మహదాహ్వయులు గుహం జొచ్చి ప్రదక్షిణంబు గావించి యుత్తెచ్చువలనఁ జోయిరి సరోయోగి యొక్కరుండు గుహావాసియగు యోగీంద్రుం గాంచుకొని కిచ్చ గలవాఁ డగుట నంటఁ జొచ్చి మూలంబుగా నిలయందు నమస్కరించిన యోగ ధారకుండగు భార్గవుం డమ్మహాత్ముం గనుంగొని

తే గీ ధరణిపై మాటిమాటికి దండవత్తు
గాఁ బ్రణామంబు సేసి [3] యుత్కృమగ లేచు
డో సరోయోగి యట్లు నా సుగుణమతిని
దండము నొనర్చె పలుమా ఱుదాత్తమతిని 166

సీ. అరయ నకోశన్య సమాధిస్థు లౌట లో
మాంచిత గాత్రులై యలవు మతిని
వారూర్ధిఁ బ్రణమతి యందు నిర్భరు లౌచు
నలుహొంది విహ్వలానంద బాష్ప
నేత్రులై విస్తం నిపుణులై ప్రేమనం
సిక్తాత్ములై సుఖాసీనులైన
మనుల యథాక్రమంబుగఁ బూర్వవర్తన
మగు కుశలంబు సత్కాదరమున

1 మూ బున 2 మూ దొక
3 మూ యోత్కృ

ప్రాలంబాట విభ్రమమానుండును [1]స్ఫురత్కోటీర మకరకుండల ద్యోతి
రాననుండును గృపాకటాక్ష ప్రసారిత పుండరీకాయతేక్షణుండును రత్న
సింహాసనాసీనుండును శ్రీనికేతుండునై ప్రకాశించు శ్రీ వేంకటాచలా
ధీశ్వరుండె స్వహస్తంబున నమ్మునిని వాయకు నొత్తియించి కృపచేత
నుపలాలించుచు మధుర వాక్యముల నిట్లనియె 172

తే. గీ. అరయ నా యాజ్ఞచేసి యాదరసిల్లి
నమ్మరి పాండుర మృత్తిక నమ్మర భుజాల
కేసి దుర్లభగా నుండు శ్రీని దాని
సంగ్రహింపుము మునికుల సార్వభౌమ 173

క. అనయ మదా మాత్ర ధారణ
మున మామకి పదములగల్గు ఘనిలెవముల గం
దని భగవంతుడు పల్కిన
ముని వాఘుడు మేలుకొని నమున్నతమతియై 174

వ. దివ్యరూపంబులగు సుతులచేత శ్రీధరుం గొనియాడి యట దిగ్గియం దిగ్గి
యత్యంత మృదులయు శ్వేతయు ఘనయు [2]భావనయు నగు మృత్తిక
నమ్రధమంబుగాఁ గైకొని ప్రమ్మున కీరంబున కరుదెంచి తరువులాలంబునం
బాదుకొని పద్మాసనాసీనుం డగుచు యోగివర్యుండు శాస్త్రోక్తం బుగా
ద్వాదశాంగంబులయందుఁ గేశవాది ద్వాదశ నామంబులచేత సమీరితం
బుగా నూర్ధ్వపుండ్రంబు ధరియించి [3]యష్టాక్షర మంత్రంబు జపియిం
పుచుఁ గొన్ని మాసంబులం దధివసియించి పిమ్మటఁ గాంచీపురంబున
కేఁగుదెంచి యందలి ఫణిరాజ పర్యంకశాయియగు పురుషోత్తముం గాంచి
నమస్కరించి తద్భక్తిచేత స్తుతింజేసి యోగానందపరుండయ్యె నంత

1 మూ విస్ఫురత 2 మూ శశ 3 యష్టాం మంత్రంబులు

కం. అని యిట్లు పొగడి యప్పు
డ్డని వెడ చూర్కుం డిసించి మునినాయకుఁడేఁ
పున పీనితోడఁ దన కుల
జనులు తరింపుదురని మదిని స్మరించఁ దలఁపుచున్ 11

ఉ. ఎవ్వతర పంకజమ్ము నికాయము గల్గ సరంబుయందు నిం
పున ధరణీసురోత్తము సమున్నతి స్నాతుఁగఁ జేసి ప్రేమమై
యనఘుఁడు మౌనివర్యుఁ దను పొందఁగఁ బంకరుహాననస్థుగా
నానరిది సత్కృపారస మనూనతఁ గ్రమ్మ ననుగ్రహార్థుఁడై 12

తే.గీ. అందు హృత్కర్ణికా మధ్యమునందనయు
నిందిరా సహితు ముకుందు నీప నమ్య
తుని నిజపరము గురుని గొరినిదలంచి
ధరణి [1] సుర కిరమున నాక్క ఠరముఁ జేర్చి 13

వ. అగ్నిరుం దను త్రయంబు సుస్వరవర్ణార్థ సంయుక్తంబును మంత్రరాజంబును
నగు శ్రీమదష్టాక్షరమంత్రం బుపదేశంబు చేసి పిదప యోగం బొసంగి
నెమ్మ నార్మనముఁ గావించెఁగాన విష్ణుభక్తుల చార్పల్యంబు తపక్షణంబు
సఫలితంబు అాద్భుతం బభావంబు గాన నంత నా బ్రహ్మణుఁడు కృతకృత్యుం
డగుచుఁ దత్పదారవిందంబునకుఁ బ్రణమిల్లి సంతతంబు సేవఁజేయ
నిశ్చయింపుచున్నవాఁ డగుచుఁ దత్సాన్నిధ్యంబునం దధివసించె నట
భార్గవ యోగీంద్రుండు తత్సమీప గుహాంతరంబునందు పవలీకృతుం
డగుచు యోగనిష్ఠం గైకొనియున్న తత్సమయంబున నొక్క [2] వృద్ధాం
గన యితరులకు ననతిశోభంచేత భక్తిపాఠ మాహాత్మ్యం బారజ్ఞించి గుహా
ప్రాంతం బునకేఁగుదెంచి ప్రత్యహం బగ్గుహా మధ్యంబునందు గోమయమున

---

1 మూ సుత 2 మూ హృద్యాంగన

వర్ణింపఁ బంతఁదగ దని పలికి తత్క్షణంబ యంతఃపురంబుఁ బ్రవేశించె
నని మహాయోగి మాహాత్మ్యంబను శ్రీమంతంబును నగు భార్గవ పురాణంబు
నందలి యుత్తరఖండంబునందు సంవాదంబుఁజేసి సత్పరాయణుండగు
నారాయణుండు వరునకు నేఁదశాధ్యాయంబుఁ జెప్పె వెండియు నిట్లనియె 84

చ. మనుజుడు మహాతపోనిధి ప్రభాసిత చిత్తుఁడు గృష్ణయోగి ధ
ర్మనపతి వల్కె పల్కుచిని సౌమ్యము మీరఁగ రోషభాసితా
ననుఁడయి యాత్మదేశికు మనఃప్రతిభావ్యుఁడేని భక్తి నా
తని పదపంకజమ్ముల కుదారత మ్రొక్కి వచించె నిట్టులన్ 85

క. నిగమాంత విశారద యా
జగతిం దధముఁ దగుట సకలాచ్ఛాదక భ
క్తిగా వినిందు నిప్పు
డగు నిం కలమేని నిర్వహింపదు నియతిన్ 86

తే.గీ. దాని మూల దర్శనము మనపాపహేతు
కంబగుట నేను దేశాంతరంబు గూర్చి
యిప్పు డరిగెద నానతియిమ్ము మునికు
లోత్తమ మహానుభావ యనూన చరిత 87

క. మునివరుఁడు భక్తిసారుఁడు
మనమతి యవ్వచనముచిని కరుణానిధి వి
మ్న నెరసి సహింప నిమునము
ననుపుగ నే నీవువెంట నరుదెంతు నిలన్ 88

ఆ.వె. కృష్ణయోగి నాకుఁ బ్రియుఁడు తన్మూర్తి సం
తోషపెట్టి నీవు తోడి తెమ్ము
నాకుఁ జూడ కోర్కి దనరు నిండెఁ బెం
టన్న నతని వాక్య మాలకించి 45

చోళ మహీపాలు ప్రార్థనంబున నది కృష్ణ భక్తి సారులు
స్వధామంబు బ్రవేశించుట

తే.గీ. ధ్రువముగఁ బోయి మునికులతిలకుఁ గృష్ణ
యోగి పదములఁ బడి కరయుగము చేత
దృఢముగాఁ దత్పదాబ్జ యుదీర్ణ భక్తిఁ
బట్టుకొని యశ్రువులు రాల భవ్యమతిని 46

వ. దీనుం డగుచు గద్గద వాక్యుండైన నిట్లనియె 47

తే.గీ. మునిని శరణాగతిని యోటు మునిసురేంద్ర
వైరిబరిగ శరణాగత వత్సలురు భ
వత్సలులు జగమున భక్తులకుఁ గృ
పారసముఁ జేసి బ్రోతురు సంయమిని 48

వ. అపరాధ సహస్రంబు లెన్ని క్షమియింప వలయుఁగాన నెన్నుఁదెంచిన వాకు
నీవ శరణంబు పగుటఁ గ్రమ్మఱఁ గాంచీపురి కేతెమ్ము నన్ను బాలింపు
మని మఱిచిన క్షమానిధియఁ గృష్ణయోగి [1] నయుండం దగుచు మెఱి
గురుంజేరి భక్తిచే బ్రార్థించిన ధన్యవిత్తగు భక్తిసాయం దానంద కందళిత
హృదయాంతరంగుఁ డగుచు శిష్యదాసానుదాస మహీపతులతోఁ గూడ
వెండియుఁ బురోత్తమంబు బ్రవేశించె శేషపర్యంకశాయి యిందిరతోఁగూడ

---

1 వరా అపారసహస్ర,

శోభ భాసురుండును నాకర్ణ విస్తీర్ణ సముత్ఫుల్ల విశద కమల నయనుండును
సుందర దరహాస చంద్రికా పూరబింబా¹ధర సమన్వితుండును శరదిందు
సన్నిభ ముఖమండల ప్రకాశితుండును సుభూ²ంచితాసితాలకాసక్త
ఫాల ఫలకుండును చారుకోటీర హారకేయూర మంజుమంజీర కంకణాది
విభూషితుండును మహేంద్రేంద్ర సేనేంద్ర ప్రముఖ నిత్యసూరి కమలాసన
వాక సురేంద్రాది సురాప్సరోగణ వసిష్ఠ వ్యాస వాల్మీకి ముఖ్య భాగవ
తోత్తమ సనకాది యోగి సంసేవితుండును జగదీశ్వరుండును శ్రీకోటరజా
రమణ సంతాశచ్ఛత్రచామర శోభితుండును నగు హరి సభామధ్యమంబున
గాంచువారల కందఱకుఁ బొడగట్టినప్పుడు ద్విజోత్తములందఱుఁ బ్రకంపితా
ధీరధీతులును విస్మయాకులిత చిత్తులును నగుచు మాటిమాటికి దండంబు
పెట్టిన భక్తిసారుండు తద్భృత్య దేవతాగణంబుల సంస్తుతించి లక్ష్మీవ
కరుణ నొందఁ బ్రాంజలు లగుచు ద్విజులు మదపరాధము క్షమియింప
మని పల్కిన వాక్యం బాలకించిన నాడు నవిప్రపుంగవులు బ్రహ్మ
నిష్ఠా గరిష్ఠుండగు నాభార్గవ నందనుంగూర్చి ప్రణిపత్తిచేసి చరణంబులం
గూర్చి పలుమాఱు శరణంబు నొంది యిట్లనిరి 81

సీ. ³ఏము హీనమతుల మింపొంద దురభిమా
నులము గర్వితుల మనూన చరిత
యథానుభావ సమాహాత్మ్యంబు సమర్ప
రులము⁴ కామక్రోధ కలితమతుల
కాశయులము దుర్మదాంధుల ⁵మపరాధ
మత్యాభాక్కులము నమూర్ధ వృత్తు
లముగాన నీ మహిమ మెఱుంగలేకయె
శిశ్వరేశ్వర యుండివరేశపాల

1 మూ ధార 2 మ కోటీర మణి
3 మూ ఏమహీన 4 మూ లముసదా 5 మూ మహాప

కేతెంచి పరమంబుఁ దత్పాద తీర్థంబు గ్రోలి [1]తత్ప్రసాదంబువలన వద్య
తంబగు వార్త వృత్తాంతంబంతయు నెఱింగి మోదంబునఁ బ్రణామంబు
గావించిన యోగీంద్రుం దతనిఁ గౌఁగిలించుకొని యభీష్టంబగు వరంబొసంగి
యందన ప్రేమ నమ్మాపించి కణికృష్ణ సహితుండగుచు నాయోగి పరి
వ్రతుండై శ్రీరంగాది దివ్యక్షేత్రంబులం దనయంబు సంచరింపుచు యోగ
సమాధిచే నుండె వెవ్వఁడు కలుషా[2]పహంబగు నీ భక్తిసార చరిత్రంబు
వినుచుం బలుకుచున్ భక్తిం జేసి పఠియింపుచు నుండు నతండు పుత్రపౌత్ర
సంపత్తులచేత నుత్తమంబగు నాయువునొంది [4]యంతంబున యోగులకు
దుర్లభమగు ముక్తిం జెందునని మహాయోగిమాహాత్మ్యంబను శ్రీమంతంబను
నగు భార్గవ పురాణంబునందలి యుత్తరఖండంబు నందలి త్రయో
దశాధ్యాయంబు సంవాదరూపంబుగా భక్తపరాయణుండగు నారాయణుండు
నరునకుం జెప్పిన నమ్మహాఫలంబిట్టిదియె

క. నారాయణ మునివర నీ
[5]తైరవి ప్రమొక్కెదెద నో భగవానని
హారాధి భక్తిసారు న
పార మహత్త్వంబు వల్కితొ చిత్రముగాన్ 66

క. పరమశ్రేయః కాంక్ష
మరయంగఁ బవిత్ర [6]మనగు నమృతప్రద ము
త్కరమునగు యోగి[7]వర్యుని
చరితము విని నాకుఁ దృప్తి గాంచదు సేవా 67

---

1 మూ యతనితత్ప్ర 2 మూ వహం
3 మూ ద్రాం 4 ము నందలి
5 మూ తైరవి ప్రమొక్కెదరనో గల్పనని 6 మూ మనఁగ నమృ
7 మూ వరు

క. లలిఁ గ్రమ్మట భగవద్భ
క్తుల వైభవ మనువదింపు గురునాయక యం
చలముకొనెదు నానరులకుఁ
బలికె విభుం డవ్వయుండు భగవంతుఁ డొగిన్ ౮౮

సీ. [1]పరమహో నీ యీ శివరచరిత్రము గూర్చి
నీదేశ తెన్నగా నేను బ్రశ్న
చేయంగఁబడితి విశ్రేయస్సునకు భగ
వద్భక్త చరిత శ్రవణముతంటె
నితర సాధనము లే దిది సత్యమో యిప్పుఁ
గూర్చి వచింపెద గురుమునీశ
శ్రీగంగ భక్త దారిద్రంబు విను ద్రావ
షట్టి యనెడు నది ప్రాంతమందు

తే.గీ. హర్షమగు పాండ్యదేశంబు నందుఁ గల్గు
నట్టి సంపత్సమృద్ధిగా నలరుఁ బుండ
రీక నగరంబు సంతత శ్రీకరంబు
భక్తసందాయకము ముక్తిదాయకంబు ౮౯

వ. అందు ౯౦

శారి నాథనాయకా దంపతులు తపం బొనర్చుట

తే.గీ. ధరణిపైఁ గురురాజుచే ద్వాపరంబు
నందుఁ బాలింపఁబడి కురుకని తనర్చు
నందు వసియించు పురుషుండ వాడ్యుఁ డమృత
జలధివాకాసఖుండు రాక్షసహరుండు ౯1

---

1 మా. పరమంత్రైనయోగి ర్ కింబు

నిత్యంబు సమాధించేసి [1]యుత్తమంబగు మంత్రరాజంబు జపియింపుచుఁ
పరమంబగు తపంబున[2] నిట్లు సంతప్తుండగుచుఁ గుయతాధీశుఁడును భక్త
వత్సలుండును నగు పద్మాక్షుండు రమాసహితుండగుచు నెదుట నిల్చిన
నమ్మహామహుం గనుంగొని తత్క్షణంబున లేచి మాటిమాటికిం బ్రణమిల్లి
ప్రాంజలియగుచుఁ గారి పరమేశ్వరుంగూర్చి స్తుతిపూర్వకంబుగా నిట్లనియె

సీ. ఇందిరాధీశ గోవింద నీకుఁ బ్రణతి
వాత్సల్యముఖ గుణవార్ధి నీకు
పతి సహస్ర శీర్ష శతధృతి వందిత
నీకు నమస్కృతి నిర్మలాత్మ
విశ్వపతి మహేశ వినుత యాత్మేశ్వర
నీకు సాష్టాంగము లోకనాథ
హరి జగద్దేహవౌ ఎట్టి నీకు జోహారు
విశ్వరంభుఁడవైన విభుఁ గాలి

తే.గీ. నీకు నుతి యక్షరాయ సుశ్లోక నిగమ
రూపిణే శాశ్వతాయ నరూపకాయ
సుందరాయ పరేశాయ యనుచు నన్ను
దాయ యని నీకు మ్రొక్కెద దైవరాయ[3] 101

క. నారాయణ నీకు నమ
స్కారమ్ము ననంత శక్తి గల్గియు బ్రహ్మం
బై రంజిలు నీకై శ్రీ
ధ్యారఁ బ్రణామం బొనర్తు నంబుజనాభా 102

1 ము. యనంతము 2 ము. 3 మూ. దైవమానస 4 మూ.

సీ. అమల విభూతిద్వయాధినాయక విశ్వ
శేషివయిన నీకుఁ జేతువినతి
వనజాక్ష యోంకార వాచ్యుఁడవగు నీకు
మ్రొక్కిడియెద దైవముఖ్య వినుత
హరి స్వతంత్రుండవౌ వచ్యుత నీకు న
మో నమో యని భక్తిఁ బొగడువాఁడ
కరుణాపయోధి భక్తఫల ప్రదాయి ప్ర
సన్న కల్పక నీకుఁ బ్రణతిఁగాంతు

తే.గీ. భూమినీళాధి నాయక పుణ్యచరిత
నిత్య ముక్తైక భోగ్యాయ నిరుపమాయ
తే యని నమస్కృతి రచింతు దివ్యరూప
వైభవాకార సద్భావ వాసుదేవ 108

తే.గీ. వామనా భగవచ్ఛబ్ద వాచ్యుఁడవగు
నీకు మ్రొక్కెద సర్వాప్తనిగమరూప
యాత్మనాథుఁడ వగు నీకు ననుదినము న
మో నమోయని కొనియాడి మ్రొక్కువాఁడ 104

క. అని యిట్టులఁ బొగడెడు నా
తనిఁ గని భగవంతుఁ డఖిల తత్త్వుఁడు నిగమాం
త సుతుండు భూతభావనుఁ
డనఘుఁడు సంతోషకారి యగుచు నయమతిన్ 106

క. కరుణావలోకనంబులఁ
బరిపాలింపుడు పదింటఁ బరమస్వతంత్ర నీ
గిరిశృంగ నైరి సు
స్థిరమతి నీయాతపంబు చేరఁ గుమారా 103

## శఠకోపముని జననము

వ. ని కోర్కి యెట్టిదనగుడు నట్లనె యగుండగు కుమారు నొసంగెద నని పల్కి దేవుం డంతర్హితుండగుట సంభ్రాన్తమానసుండగు కారి సభా ర్యుండగుచుఁ గురుకంబేరి శ్రీమందిరంబునకు నేతెంచి రమా సమం గూర్చి ప్రణమిల్లి యట్లగమ్ములు నిజగృహంబు ప్రవేశించె నంత భగవత్ప్రియుండును మహాద్యుతియునగు సేనేశ్వరుండు భగవంతుతోఁ జెప్పి నాథనాయకి గర్భంబునం దావిర్భవించె నంతట సంవత్సరంబు పూర్ణంబగుడు సాధ్వియగు నాథనాయకి కల్యాదియందుఁ దొంబది రెండు దినంబులు సనుట [1]సుభగంబునగు వైశాఖ మాసంబునందలి భృగువాసరంబునందు శ్రేష్ఠంబగు విశాఖాసహిత కర్కటలగ్నంబునందు నుత్తమంబగు పుత్రుం గాంచె నపుడు భూవరాహుండును మాధవుండును భక్తపరాయణుండును నగు నారాయణుండు సూతికానికేతనంబున నేతెంచి మహాత్ముండగు నవ్వాలునకు విజ్ఞానం బుపదేశించి స్వధామంబున కరిగె[2] నంత భుజంగాధీశుండు సింధుకన్యాధవాజ్ఞంజేసి [3]కారి గృహాంతరంబునందు దివ్య మహీరుహాకృతి యగుచు నదివసించె నవ్వాలుండు శౌరికారుణ్య లబ్ధజ్ఞానామృతంబు గ్రోలుచు జననిస్తన్యంబు గ్రోలక యవలోకనంబు సేయక

1 మూ సుభగంబునగు 2 మూ నట్ల
3 మూ హరి

తే.గీ. అనుపము నలౌకికుని నీ వుదార మతిని
యిచ్చు నిర్వాణ సేవ గ్రహించి కొనుము
జడుఁడు జితుఁడేల యనుమను సార్థ వయను
లెని యాదంపతులఁ గాంచి యాదరించి 112

సీ. హరి యిట్లు పల్కి మీ యాత్మజాంచల మహా
యోగి మత్సేవఁ దుద్భవించె
లోక రక్షార్థ మలౌకిక స్థితితోడఁ
గన మర్త్యమాత్రుండు గాఁడు సుమ్ము
యటుగాన మీరు హర్షాత్ములై యాత్మజా
రక్షింపుఁ డన రమారమణుమాత్రిఁ
దపయు నపార్థకృతతనుని యా హరి మంది
రమునకే పోషింప రమణితోడ

తే.గీ. సతతము బాలార్క నిభుఁడు పర్యంకతల
యానుఁడు హరిపదాంబుజ ధ్యానమగ్న
మానసుండయ్యెఁ దద్దేవ మందిరంబు
గలయఁ జరియించుచును నొక్క కాలమునను 116

వ. అందుఁ జింతా రహిత మూలాధార కోటరంబు ప్రవేశించి బద్ధ పద్మాసనాసీనుండును నిమీలిత నయనుండునై హృత్పద్మంబున నిద్ధ పద్మరాగ పాద పద్మాలోకనంబు సేయుచు బాహ్యంబు నవలోకింపక యోగసమాధి నధివసించె నిట్టివిధంబున షోడశ వత్సర కాలం బమ్మహాత్ముండగు హరిసుతుండు హరిసమాలోకనాహ్లాద నిర్భరుండై యుండె నని మహాయోగి

క. వచ్చిన [1]హరిఁ గని కన్నులు
విచ్చి మహానందమునను వెసలేచి యతం
డచ్చోట మాటి మాటికి
మెచ్చిన భక్తిని దండము లిచ్చు నుతించెన్ 117

వ. అంత నతండు మౌనంబు విడిచి నిటలతట ఘటితాంజలియై యిట్లనియె
శ్రీసర్వేశ్వర కమలాకర కమలాలాలితంబులును నూపురోజ్జ్వలంబులును
రక్తారవింద సుందరంబులును పద్మరాగమణి ప్రభవంబులును వజ్రధ్వజాం
కుశ పంకజ కల్పవృక్షాది వాంఛితంబులును ఇంద్రమండలఖండాభ
నఖరాజి విరాజితంబులును సువృత్తాకార రుచిరాంగుళీ శోభితంబులును
సుపార్ష్ణి పార్శ్వలలితంబులును ప్రవాళాంకుర కోమలంబులును సంరక్త
నీల వర్ణపరివృతంబులును బ్రహ్మరుద్రేంద్ర మకుటమణి నీరాజితంబు
లును సర్వామరార్చిత కల్పపుష్పవిభాసితంబులును తులసీకోమల
దళ ప్రభాపటల భాసితంబులును లక్ష్మీవక్షోజ కాశ్మీరచందనాలం
కృతంబులును ననవరత భక్తివినత శంకరాలోక శంకరంబులును
ఇందిరా కపోల నయన వదనాధర వక్షోభిమర్శితంబులును ప్రపన్నార్తి
హరంబులును సమాధి మహిత మహాయోగిజన హృత్పద్మ స్థాపితంబులును
సమాక్రాంత లోకత్రయంబులును గంగాజనకంబులును సత్ప్రపన్న
జనాభీష్ట ప్రదంబులును భక్తజన కామధేను కల్పతరు చింతామణి సమా
నంబులును శరణ్యంబులును వరేణ్యంబులును ధన్యంబులును నగణ్యంబు
లును నిరాకారంబులును వదాన్యంబులును నగు భవచ్చరణంబులు
శరణంబుగాఁ జొచ్చెదనని వినుతించినఁ గరుణాబ్ధియగు నయ్యనంతుం డనంత
వేద శాస్త్రోదితం బమ్మౌనికి దివ్యాగ్రగణ్యమైన ప్రాపితాకృతిం బ్రసన్నుఁడై
నట్లుగాఁ గృపా కటాక్షంబున వీక్షించి యమ్మహామునివరుండు పరమ
పదంబు గూర్చి చనిన యనంతరంబున 118

---

1 మూ. హరిగన్నుల

## శఠకోపముని దివ్యప్రబంధంబులం జేసి హరియర్చావతార విగ్రహముల నాకర్షించుట

ఉ. ఆ మురదైత్యసంహరు కటాక్ష వశంబునఁ జేసి సర్వవి
ద్యామయమైన భారతి శుభాకృతి యాతని జిహ్వయందు ను
ద్ధామత నిల్వఁ దత్త్వమయి తన్ సుమనుల్ గొనియాడ నర్థిఁ బ్ర
జ్ఞా మహిత ప్రచారగతి నంతత నిర్మల వృత్తి నందటన్ 119

సీ. ఆరూఢి వేదమయంబులు దివ్యముల్
శ్రీ హరి భక్తి విజృంభితములు
సమ్మతానంత కల్యాణ గుణావళి
మణి పయోరాశులు మౌనివర్య
ములు పరతత్త్వార్థములు నిరవద్యముల్
బహువిధ చేతన పావనములు
హరిపాదభవయగు నా గంగయును బోలెఁ
గడు పవిత్రములు మోక్షప్రదములు

తే.గీ. దివ్యతరములౌ నగు ప్రబంధములు చేయ
వింత శఠకారిసుతకృత కృతులఁ గాంచ
నమరి యర్చావతార రూపమున సర్వ
సంస్థితాత్మక మూర్తు లచ్చటికి వచ్చె 120

## శఠకోపముని యర్చావతార విగ్రహముల విభవమ్ముం గనుట

మ. అటఁ గొందారయు కోటరాంతరమునం దాదాసముంగాంచు నా
ఘనచక్రం జేరి తదీయ సంస్తుత పృథక్ ప్రత్యక్ష మొప్పొంది యు
త్కటరీతిం దగు దివ్య సత్కృతులఁ జేరన్ భక్త సందర్శన
స్ఫుట సంహృష్టము లౌచుఁ దెందె రిల నమ్మూర్తుల్ స్వధామంబునన్

తే గీ వాని మధ్యంబునను శ్రీనివాసు శేష
శైలవాసు జగద్గురు శౌరి నహంత
రిప్రబంధమ్ముల నుతించి రహిఁ దనర్చు
హర్ష వికసిత మానసుఁడగుచు నపుడుఁ 122

తరకోపుండు చిందామహీరుహ కోయిరావాసుండగుట

తే గీ బారుతర తర్పరాఖ్య నిష్యంద మధుర
సామృతముఁ గ్రోలుచను సమాస్వాదమునను
దగ్గుణాస్వాద మత్తుఁడై తత్ స్థలంబు
నందు హర్కారి నందముఁ డధివసించె 123

సీ ఆ సమయమున సకలావహంబగు తామ్ర
పర్ణీ నది తీర భాగమునను
నమరు కోలగ్రామ మందు వర్తిల్లె మ
హీసురశ్రేష్ఠుండు భాసురుండు
హరిపదాంభోరుహ [1]ధ్యానస్థితాత్మ యు క్త
ముఁడు తద్విత శ్రేష్ఠ భూసురులకు
దేశికుండును విజితేంద్రియుఁడు[2] ను బర
తత్త్వార్థ విదుఁ డతి సాత్త్వికుండు

తే గీ వాడికేసరిదాముఁ డనార్యగుణుఁడు
సామవేద పరాయణుఁడౌ మహాత్ముఁ
డీ ప్రభావంబు గలవాని గృహిణియైన
నతి యనెడు పేర విలసిల్లు సాధ్వియందు 124

1 మూ ధ్యానో ద్యోతిత 2 యూ ప్రాజ్ఞుడు పర

## మధురకవి జననము

క. సేనేశ గణాధ్యక్షుం
డైన కుముదనాముండు హరి హితుఁడు భూ
నూన మగు చైత్రమునఁ జి
త్రా నక్షత్రంబునం దుదారత బొడమన్ 125

సీ. జన్మించె నతఁడు దా జన్మప్రభృతి లబ్ధ
వర భగవద్దాస్య వైభవుండు
విమల యోగమహత్త్వ విఖ్యాత పరమత
త్త్వార్థ నిర్ణీత యష్టాక్షరాఖ్య
మంత్రరాజ జప సమాసక్త హృదయుండు
హరిపదాంభోజ నిష్యంద మధుర
సాస్వాదనపరుఁ డగుచు రమాధీశ
మాధుర్య కవితా సమగ్ర రచన

తే.గీ. మధురకవ్యాఖ్యఁ దనరి యమ్మహాగణేంద్రుఁ
డతి కృపానిధి యతఁడు వేదార్థవేది
యఖిలవేద ప్రశస్తి యఖిల భోగ
ముల విరక్తుఁడు గురుభక్తి కలితుఁడగుచు 126

ఉ. అందు వసించు శేషశయనాంచిత శౌరిని హృత్పయోజమం
దందముగా భజించి మఱి యచ్చటనచ్చటఁ గల్గు విష్ణు స
న్మందిరముల్ సుతీర్థములు మాటికి సేవ యొనర్చుచున్ జగం
బుం దఖిలార్థి మేలొ యైన పవిత్రిఁ బరిభ్రమించుచున్ 127

క. యమునను బవిత్రతరతో
యమునను గృతదురితసంచయమునను నదుపా
యమునను గృతసుకృత నితా
యమునను గందాని సవినయమునను వచటన్ 127

క. మఱియు నవిద్యా బంధని
బరవిద్యా ప్రదయుఁ గృష్ణపద విన్యాస
స్ఫురిత ప్రాంతయు నగు నత
తర[1]యగు కాళిందిలో యథాన్యాయముగాన్ 129

క. స్నానంబొనర్చి తత్తీ
రానవదేశమున హరిపదాంభోజమున్
మానస యోగ సమాధిన్
ధ్యానింపుచు నియతి వాతఁ డందు వసించెన్ 130

ఉ. అంతటఁ గొన్ని నాళ్లరుగ నవ్వరు దక్షిణ దిక్కునందు దు
ర్వాంతముగాఁగ ధామనిధామ సహస్ర నిఘోష్యలంబు న
త్యంతము దివ్య మద్భుతము తప్పరకోపమునీంద్రు తేజ మ
క్లైంతయుఁ గాంచి విస్మయ సమేధిత మానసుఁ డౌచు మేరుకన్ 131

క. కనినిరి యెవ్వని రుచియో
వనజదళాక్షునకె కాని యందు నరులం
దనిశము హరిసదృశుం డగు
మునిశేఖరుఁ డందు నుండఁ జూలా నధికుఁడై 132

---

1 మూ మ

మధురకవి శఠకోప సందర్శనార్థం బయలుదెంచుట

సీ. అనుచుఁ జింతించి తదాలోకనముఁ జేసి
యతని పాదాబ్జంబు లాశ్రయింతు
[1]నని మనమున నిశ్చయ మొనర్చి తత్క్షణ
మునఁ దార్క్ష్య నిభ వేగమునఁ గవీంద్రుఁ
డా దిక్కునకు నవ్య మనస్కుఁడై పోవ
మార్గ సంస్థిత నదీమహీధరములు
పల్లెల వనంబు శైలాగ్ర చిత్రం బగు
తన్మహామహిమకు దారి యొసఁగెఁ

తే.గీ. గాన భాగవతుల తెవ్వరేని చేయ
కుందురె సహాయ మట్లౌట గురు మనీషి
యైన యమ్మధురకవీంద్రుఁ డతులభక్తి
ప్రీతిఁ గురుకాఖ్య నగరంబుఁ జేరవచ్చి 188

వ. అందలి బృందారకకోటిరంజనం బధివసించు మహాపురుషుండును బద్మా
సనాసీనుండును బద్మపత్రనేత్రుండును ప్రసన్నవదనకమలుం
డును దీర్ఘబాహాయుగళసమంచితుండును విశాలఫాలఫలకుండును
విస్తీర్ణ భ్రూయుగ శోభితుండును గంభీర నాసాభాసురుండును బింబోష్ఠ
ద్వయ విరాజితుండును సముజ్జ్వలాదర్శ సంకాశకపోల విలసితుండును
తిరస్కృత కుందకోరకదశనలసితుండును మహాహనుండును గూఢ
జత్రుండును కంబుకంధరుండును మందస్మితదంష్ట్రికా నిస్తంద్ర
వదనచంద్ర మండలుండును సముదగ్రకుండల స్కంధుండును విపుల
తర వక్షఃస్థలుండును పీనదున్నత కుక్షిస్థ నాభిగహ్వర భ్రాజమానుండును

1 మూ. మానసము

సమస్థిరోరు యుగ్మంబును బృహచ్ఛ్రోణికటితటంబును సంశోభిత జానుజంఘాద్వయంబును రోమపాళితలాంఛితంబును స్ఫురదరుణా రవిందచరణ సుందరంబును జ్ఞాన ముద్రాముద్రితంబును జటామండల మండితంబును కరుణాలవాలహృదయంబును బాలభానుప్రభాభాస మానంబును సమాధిసమాయుక్తంబును నగు నమ్మహానుభావుం గనుం గొని యానంద సమాకులేక్షణుం డగుచుఁ బ్రణమిల్లి యతని పదారవింద యుగళంబు నిజనేత్రాంబుకణంబుల మిక్కుటంబుగా సంప్రోక్షింపుచు బహువిధస్తోత్రంబుల స్తుతియింపుచుఁ గృతాంజలి పుటుండై యున్న యవసరంబున 184

తే.గీ. ఆతనిచే నిట్లు సంస్తుతుం డగుచు యోగి
ఘనకృపాదృష్టి వీక్షింపఁగా నతండు
తన్మహాజ్ఞానవంతుఁడై తత్ప్రభావ
మహిమము నెఱింగి వాక్య మిట్లనుచుఁ బల్కె 185

చ. గురుతర యోగివర్య ! గతకోప దయాబ్ధి మదీయ దేశికా
యురుతర వేదసారములు నుత్తమముల్ పథదంబులున్ భవ
ద్విరచిత సత్ప్రబంధములు విస్తృతి గాంచఁగ నాకుఁ జెప్పి పెం
పరయఁగఁ దెల్పుమీ పదపదార్థములందుఁ గల్గు భావముల్ 186

మ. అని ప్రార్థించిన వా పరాంకుశులు భవ్యప్రీతిచే నాతనిం
గని శిష్యోత్తమ నీవు కోరినది చక్కంగా మహాగోప్యమై
యెనయుం దానటులైన నే దెల్పెదను నీ కేకాగ్రచిత్తుండవై
వినుమా రీతి యథాక్రమంబయిన వథావిర్భూతిగాఁ దెల్పెదన్ 187

## శఠకోపముని మధురకవి ననుగ్రహించుట

సీ. అని యిట్లు పరతత్త్వ మనుచతుర్వ్యూహముల్
విను సనాతనములు విభవములును
నలర నంతర్యామి యతి పదార్చలును వి
రములు పర్యాయ విగ్రహము లగుట
నిల శ్రుతి స్మృతి పురాణేతిహాసాగమ
ములు నన్నిటను [1]నివి దెలుపుచుండు
నతిశయస్ఫూర్తిగా సన్మతత్కృత ప్రబం
ధము లట్లు ప్రతిపాదనము నొనర్చు

ఆ.వె. ననుచు నీ రహస్య మంతయు శఠకోప
మునివరుండు ప్రేమమున పవిత్ర
రముగ శిష్యుఁగూర్చి విమలతరోక్తిని
యాదరత ననుగ్రహంబు చేసె 138

తే.గీ. అట మధురకవి యనుపేర నమరు మౌని
యతని పదపంకజములకు నతి యొనర్చి
తద్దయు నమస్త్రములగు నర్థంబు లొంది
యా గురుని శ్రాశ్రయించె నేకాంతుఁ డగుచు 139

చ. సతతము భక్తి కీర్తనము సల్పుచు నా గురువర్యు నందు నా
యతమతిఁ జేర్చి తన్మతమునందు వసింపుచుఁ గాలమున్ సమా
ధ్యుత గతిగా నిమేషము నరిం గనుగొంచు స్వకర్మ భక్తుల
[1]న్నత మగు జ్ఞానమున్ మొద లనందగు పీఠిఁ దొలంగి విష్ణలోన్ 140

---

1 మూ. విది   2 మూ. వ్నతియగు

## భగవంతుండు ప్రసన్నుం డగుచు శరకోప మునికి వకుళమాలిక నొసంగుట

వ ఏకాంతమానసుం డగుచు నారాయణుండే పరమం బగు దైవంబును నతండే పరమగతియు నతండే పరమం బగు జ్ఞానంబును నతండే యుత్తమం బగు ధనంబును నతండే పరమ యగు విద్యయు నతండే పురాణుండును నతండే సర్వార్థంబును నని విశ్వాసంబువలన సంధింపుచు నతని యందాత్మభరంబు నునిచి యహర్నిశం బంద యధివసింప మహాయోగియగు నవ్వరాంకుశుం డతనిచేత శుశ్రూష సేయంబడిన వాఁడగుచు సంతోషంబుగా భగవంతుం డొసంగిన వకుళమాలికచేత భూషితుం డగుట యది మొదలుకొని లోకంబులయందు వకుళాభరణాహ్వయుం డగుచు దృఢయోగ సమాధిం జేసి శ్రీకాంఘ్రికమలధ్యాన సుధారసం బనవరతం బనుభవింపుచు నతిం బనులఁ గృతకృత్యులఁ గావింపుచుఁ దింతామహీరుహచ్ఛాయ యందుండె నిలయందుఁ దత్కృత దివ్యప్రబంధంబు లేనరులు పఠియింతురు వారు సుదుర్లభంబును సత్యంబును పరమంబును నగు పదంబుఁ బ్రాపింతురు ఓబుధ పావనంబగు నీ శరకోప చరితం బెవ్వఁడు భక్తిం జేసి వినుచుం బఠియింపుచు వ్రాయుచు శ్లాఘనంబు గావించెనేని వాఁడు పుత్రపౌత్ర సంపదలను నిరామయంబగు నాయువుఁ గాంచి యంతంబున దివ్యంబును బరంబును వైష్ణవంబును నగు నట్టి పదంబు నొందునని మహాయోగి మహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి పంచదశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పిన నతండు 141

మ సురలోకార్చిత పాద పద్మయుగ రక్షోనాయక ధ్వాంత భా
స్కర యోగి ప్రకరాత్మ నీరజదళాగ్రజ్యోతి వ్యాప్తాప్త సం
సరణాంభోనిధి తారణ ప్లవ రమా సర్వాంగసంభోగ ని
ర్భర గంగాజని కర్తృకాంఘ్రి ఘనవక్షా వస్థిత ప్రాభవా 142

క. సకలాగమాంత సంగా
వకుళాభరణాంతరంగ వాసశుభాంగా
యకుద్ధం కరుణాపాంగా
ప్రకటాసుర మదవిభంగ [2]పతగ తురంగా 143

మా॥ వరకముర విఫాలా నవ్యకస్తూరిఫాలా
సరసగుణ విశాలా దారుణావర్గభేలా
సురపుర వరశీలా సుందరీ చిత్తలోలా
విరచిత భక్తలీలా వేణుగోపాలబాలా 144

గద్య. [1]ఇది శ్రీరామ గోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణాంబు పాండిత్య ధురా నవరతావనీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ న్యసమర్థతాకృతాకృత పటహ దండ్ధణారావ విపరీత పతస్ర్కియా ధిల్లికాధీశ దుంధుభిధ్వాన కోలాహల హనూమద్ధ్వజాంక కనకదండీకృత హారకంకీకృత సందీపిత ప్రతాపకీర్తిప్రభావ కోశలవంశపయఃపారావార రాకాసుధాకర సౌందర్య జిత సుమ సాయక మహిపాలనాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబునందు భక్తిసాధనంగూర్చి శ్రీకృష్ణుండు భక్తిం జేసి శుశ్రూషగావింపుటయు శ్రీకృష్ణ నర కోశరా జపమతి గావింపుటయు శ్రీకృష్ణుండు గురుసమేతుం డగుచు సకలదైవతోద్దిష్టంబుగా దేశాంతరంబు సనుటయు సదో్ప్రశ మహిపాల ప్రార్థనంబునం జేసి శ్రీకృష్ణ భక్తిసాధుల సకలదేవతా సంఘంబుతో వెండియు స్వధామంబు ప్రవేశించుటయు భక్తి సాధుండు భగవత్ప్రార్థనంబు గావించుటయు విప్రుం డద్వరంబున భక్తి సాధు నిగ్రహంబు గావించుటయు విప్రుం డౌపంబును భగవద్దర్శనంబును

---

1 మూ ఇతి

భక్తిసారానుగ్రహంబున గారి నాథనాయకి తపంబున భగవదాజ్ఞం జేసి వారియందు విష్వక్సేనాంశజుండైన శఠకోపముని సముద్భవించుటయు భగవత్ప్రసాద ప్రభావంబునం జేసి పరాంకుశమునీంద్రుండు దివ్య ప్రబంధంబుం జేసి హరి యర్చావతార విగ్రహంబుల దాక్షిణింపుటయుఁ గ్రమ్మఱ వాని నిజధామమ్మునం దనుపుటయు శఠకోపుండు చింతామహీరుహ కోటరావాసుం డగుటయు మధురకవి జననంబును దపోవిఘ్నం బగు మధురకవి పరాంకుశ సందర్శనార్థం బరుగుదెంచుటయుఁ బరాంకుశుల మధురకవి కనుగ్రహం బొసంగుటయు భగవంతుండు ప్రసన్నుం డగుచుఁ బరాంకుశులకు వకుళమాలిక నొసంగుటయు శఠకోపమునీంద్రులు మధురకవి సహితులగుచు నిజనివాసంబున నుండుటయు ననెడు నేకకృత్యంబులుం గల తృతీయాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## చతుర్థాశ్వాసము

క. శ్రీధర రథాంగధర గం
గాధర నుత సాధువేణు ధరాధర ధా
శ్రీధర శ్రీ వాగిన ధా
శ్రీధర శరధిం సురపురి గోపాలా 1

వ. అవధరింపుము సకలగుణనికరప్రశ్లాఘురంధరుం డగు నయుండు నారా
యణున కిట్లనియె 2

తే.గీ. అనఘ నారాయణ మునీంద్ర యఖిలలోక
పూజిత మహాత్మ శరకోప మునివరేణ్యు
చరితమంతయు వాలిక సాదరముగ
వినగ నయ్యెను వవ్వం విస్తరింపు

చ. అతులము విష్ణుభక్తచరితామృతమున్ మధురంబు దివ్యమా
ధృతి భవదాస్యదుగ్ధ జలధిం జనియించిన దాని గౌతుక
స్థితి శ్రవణాంజలిం గొనియు దృప్తి నొసంగక యున్నవాడ నం
చిత దయతోడ నాకు మతి చెప్పగదే హరిభక్త సత్కథల్ 4

క అని నరుఁడు పల్క నారా
[1]యణ మౌనిఁ బ్రశంసచేసి యతనికి మఱి యా
ఖ్యాన మీ వాక్యము సత్యం
బనఘా తుష్టుండ నయితి నవ్యాఖ్యానమునన్ 6

సీ శ్రోతంబును శ్రోత చేతఃప్రియంబులు
ఘోర సంసార ఖేదఘ్నములు
మోక్షకాంక్ష ప్రాప్యములు పావనమ్ములు
కరము బ్రహ్మానంద కరము లైన
హరిభక్త చరితంబు లాలించి యెవ్వఁడు
తుష్టి నొందఁడు వలాదుండు దక్క
యోగనిష్ఠాపరు లర్థిఁ గాసారాది
మునివరుల్ హరిభక్త ముఖ్యజనుల

తే గీ సేవచేతను మును కుంభేశ్వరుండు
మనుజపతియయ్యె నట పరమంబు నైన
పదముఁ బ్రాపించె నమ్మహాభక్తు చరిత
మేను వచియింతు వినుమని యిట్టు లనియె 6

## కుంభేశ్వర ప్రాదుర్భావము

క కేరళ దేశంబులోఁ
బారిత సంపదం గోంపురిమన విదితం
బౌ రాజధాని వెలయున్
ధారుణిఁ ద్రైలోక్య విశ్రుతస్థితి యగుచున్ 7

1 మణ ప్రాసము 2 మూ ము

ద్వారపాలకుల భూవర్యుఁడు విడిపించి
యంతఃపురంబున కరిగి యందు
నా వైష్ణవులను సింహాసనాసీనులఁ
గావించి తత్పాదకమలములను

ఆ. వె. గనక పాత్రముల సుస్థితిఁ జేర్చి య
క్షోదకముల హస్తయుగము చేతఁ
గడిగి పావనంబు కల్మషాపహమును
బరమమైన తీర్థవారి గ్రోలి 12

వ. కళత్ర పుత్ర మిత్ర బంధు భృత్యులకు గ్రహింపఁ [1]దచ్ఛేషంబున శిరంబున మార్జనం బొనర్చి గంధ పుష్పాదులు దాల్చి వస్త్రాభరణ ధనాదుల సంతుష్టిం గావించి కులశేఖరుండు వారితోఁ గూడ నంతఃపురంబు వెడలి దేవసభాసమానంబగు నాస్థానంబుఁ బ్రవేశించి యలంకృతంబగు భద్రపీఠంబు నారధివసింప నంత తదీయముఖారవింద విష్ణుండ గోవింద కథామృత పానంబున నానంద భరితుండై యుండె నని మహాయోగి మాహాత్మ్యంబును గ్రమంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి షోడశాధ్యాయంబు భక్తపరాయణంబగు నారాయణుండు వరుసతోఁ జెప్పి వెండియు నిట్లనియె 13

క. ఈ విధి భూవిభుఁ డుండిన
చో వాని యమాత్యు లర్థ సూచకులు కళా
కోవిదులు వచ్చి సమయము
భావింపుచున్న వారి భావ మరయుచున్ 14

---

1 మూ. తచ్ఛే

తే.గీ. చెప్పు వంశీన మని యున్నఁ జెప్పఁ దగిన
మంత్రు లిట్టని రా రాజమౌళీంద్ర
నీవు సర్వజ్ఞుఁడవు మహనీయమతివి
నీవ రెండవ హరివి ధరావరేణ్య 15

సీ. అనిగంబు [5]సేయునట్టి మహామైత్ర
దార్చన మదిగా మహాత్ముఁ డగుచుఁ
దగు మమ్ముఁ జెంతుఁ గర్తవ్యంబు ముక్తి తు
పాయంబు ధర్మ మాన్యైన రాజ
ప్రజలఁ బ్రోచుచు శిష్టరక్షణంబును దుష్ట
శిక్షణంబు నెఱింగి చేయవలయుఁ
[1]చతురుపాయంబులు [2]శక్తిత్రయము [3]షడ్గు
ణంబులు [4]పంచాంగ నయము తెలిసి

తే.గీ. యరసి [5]సప్తాంగ రక్ష సమర్థుఁ డగుచు
యాగమ విత్క్రమ మెఱిఁగి [6]భోగాష్టకంబు
ననుభవించుచుఁ బోషించి యాశ్రితులను
వర్ణ ధర్మాళిఁ బాలింప వలయు జగతి 16

---

1 సామ దాన భేద దండములు
2 ఉత్సాహ ప్రభుత్వ మంత్రములు
3 సంధి విగ్రహ యాన ఆసనద్వైధీభావ ఆశ్రయములు
4 ఉపాయ సహాయ దేశకాల విభాగ ప్రతిక్రియా కార్యసిద్ధులు
5 స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గ బలములు
6 గృహ శయ్యా వస్త్రాభరణ స్త్రీ పుష్పగంధ తాంబూలములు

చ. ఏవవిధమైన భక్తియు మనస్థితిగాఁ గమలాక్షుఁడైన శ్రీ
ధవుని యెడం [1]గురింపుచు నుదారత వృద్ధుల నర్వ వేద శా
స్త్ర విదుల ధారుణీసురుల సాత్త్వికులన్ భయభక్తిఁ గొల్వఁగాఁ
దవిలి నమర్చఁ జేయు నృపపుంగవుఁ డార్య చరితశోభితా 17

తే.గీ. సత్త్వమయమున శుభములౌ సత్క్రతువులు
వినుచు మంత్రుల మంత్రకోవిదుల సూక్ష్మ
మతుల మన్నింపుచును దీక్ష సహిత దండ
మెఱిఁగి చేయంగవలయు మహీశునకును 18

క. మనుజుల పాలింపుచు వే
దృక్ను సత్యపు న్యాయ రీతిగాఁ బలారధనం
బును సార్థపంబుఁ జేయుచు
జన పాలుం డందు నధిక సౌఖ్యపరుండై 19

వ. తగు సమయంబున నధికతరంబగు ధర్మార్థకామములం బనుభవింపుచు బలం
బగు వరంబులగు [2]నదుపాదులం యందవీయకత్వంబు నందు
సప్రాస్తకంబు నెఱుంగుచు మూఁడు మూఁడగు పరస్పరానుబద్ధాత భావం
బుం జేసి తీర్థ స్వభావంబు లరయుచు రాజ్యశక్తి చతుర్విధంబగు రాజ
దోషంబుల వర్జింపుచు దశవిధ దుస్పత్రివర్గ తత్పరుండును
నవ్విధంబున వింశతివర్గతత్పరుండును నగుచుఁ గృత్యంబునుఁ బ్రకృతి
మండలంబును దైవంబును మానుషంబునుం ద్రివిధంబగు వ్యసనం
బ్రబోధించి వర్తింపుచు ధర్మంబైన భూపాలనంబు సేయుచు జిత
శత్రుండును జితేంద్రియుండునునై యివ్విధంబున నే రాజు నసుయించు
నతఁడు చతుస్సముద్రపరీతంబగు ధరాతలంబు నాకంబు నాఁబంధ
బంధుమం బోలి యనుభవించు నిట్లు హితకాంతుల మగు నస్మద్విజ్ఞాపనంబు
విని రాజధర్మంబులఁ బ్రవర్తింప నెల్లప్పుడుం దత్పరుండవై

---

1 కురియుఁపుమ ఉండపలెను    2 పురాణములు

యందరు మిథ్యాపగతులు హితంబును బ్రత్యక్ష సౌఖ్యప్రదంబు
నుత్తమంబును నగు రాజధర్మంబు బోధింప నెఱుంగరని చెప్పిన 20

చం. అన విని మంత్రివాక్యములు హాసముఖుండయి ధారుణీశుఁ డి
ట్లను నిల వైష్ణవోత్తములు యెవరేని హితోపదేశ మిం
పున నొనరింప వారు హితబోధనమున్ ఘటదుల్ విముక్తిదుల్
వను లనిపల్కి మంత్రులకుఁ గార్యము లేర్పరఁ జెప్పి యంతటన్ 21

మ. ధరణీనాయకవహో వైష్ణవులతోఁ దత్త్వార్థసంలగ్న హృ
త్సరసీజం బగుచున్ వసింప నచివుల్ తద్వైష్ణవ శ్రేణికిన్
నరనాథాగ్రణి యానతీద మనువందం జేయఁ బాపాత్ములై
యరయంజొచ్చిరి పెక్కుపాయములు విద్వేషణాసక్తులై 22

సీ. అంతట నొక్కనాఁ డవనీశ్వరుఁడు మహా
తేజుఁడు సుముఖుండు రాజరాజ
పరిరక్షకాంచవప్రీతుఁడు మహాభాగ
వరమహోరత్నాంఘ్రి పాళి తయుఁడు
దప్పుఁడు విస్తీర్ణ ఫాలభాగుండు వి
శాలవక్షుఁడు సుజన సుముఖు
డా యుగభుజుఁడు దీర్ఘాయత బాహుద్రుఁ
డబ్జగళుండు మహాభుజుండు

తే.గీ. సుభ్రువు సునాసికుఁడు బృహచ్ఛ్రుతి కలిత
లుఁడు బింబాధరుండును గంబుకంధ
రుండు గంభీరనాభిపుటుండు సుంద
హాస హరిరం రుచిరదంతాంచితుండు 23

తే. గీ. దివ్యమాల్యాంబరధరుండు దివ్యగంధ
ధానులేపియుఁ గేయూరహారమకుట
కంకణాంగద కుండలక రభూష
ణాంఘ్రిమంజీర భూషితుఁడై విభుండు 24

కం. అతుఁమణి స్తంభ సమం
చింతామణిమంటపము నందు సింహాసన సం
గతుఁడుమ నృపమండల సే
వితుఁడును నయవేది మంత్రివితతివృతుండై 25

కం. హితులు పురోహితులు కవి
ప్రతతియుఁ బౌరాణికులును బరివేష్టింపన్
క్షితికంనాథుఁడు తారా
న్వితుఁడగు చంద్రుఁడుఁ బోలె విలసిల్లె నటన్ 26

వ. అయ్యవసరంబున భాగవతశ్రేష్ఠులుం గృపానిధులును ననన్యదేవతాకై
విశిష్టులును జగత్పవిత్రులును సర్వేశ్వరైకకర్మనిరతాశయులును శ్రీమ
దష్టాక్షరీ మంత్రానుష్ఠాన నిష్ఠాగరిష్ఠులును ద్రావిడామ్నాయ బోధకులును
శమాదిగుణసంపన్నులును జీవాత్మ పరమాత్మలయందు శేషశేషిత్వ
తత్త్వజ్ఞులును తత్త్వత్రయ పరిజ్ఞాతలును స్థిరచిత్తులును దృఢవ్రతులును
నగు కొందఱు వైష్ణవ శేఖర నిరీక్షించి కులశేఖరుండు విస్మయంబునఁ
బ్రత్యుత్థానప్రణామస్తుతి పూజనంబుల యథాన్యాయంబున నొనర్చి వారిం
వలని గోష్ఠివలనఁ దత్త్వరహస్యంబు తెలియుంగుచు హరిగుణశ్రవణంబున
యామద్వయంబు పరమాహ్లాదనిర్భరుండై యుండి స్నానంబొనర్చి
కొలువు నిజభూషణంబుల సింహాసనంబునందు నిలిచి వెండియు హరికథా
సక్తచిత్తుండై యమ్మహాత్ములవలన నుత్తమంబగు గోవిందచరితామృతా
స్వాదంబుఁ జేయుచు సత్సల్లాపతుష్టహృదయుండై యుండి యంతవ వైష్ణ
వులకుఁ బ్రియమిల్లి మంగాని యనుజ్ఞాతుండై యమ్మహారాజ
శుద్ధాంతంబుఁ బ్రవేశించెనని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును

క జగతిం గూర్చి దివ్యము
లగుభూషణములు తదవనియందుం జే సం
బాగిం దెలిపిన వారల పలు
తగఁజూచి మతి ఎది నరేంద్రుఁ డతిమహితుండై 81

క పుర రక్షకులను మంత్రుల
నరపిని రావించి యది నొసంగుచు నభయం
బిరమైన నాదు సొమ్ములు
పొరిం దస్కరు లెవరు గొంపుఁబోయిరి పగటన్ 82

తే గీ ఒప్పుఁగా మీరు కావలియున్నచోట
దొంగతన మెం గలుగు నిందుల మరియ
భూషణంబుల వేగ నిప్పుడె యొసంగ
కున్నఁ బ్రాణాంతదండ మే నొగి నావత్తు 83

## కుంభీరుఁడు శపథము చేయుట

క అని యిట్లు నృపతి పలికిన
విని యందఱు గంపమొంది భీతిని దీనా
ననులై యభిభాషింపుట
కును శక్తులు గానిచో నతండితరులలన్ 84

సీ అంత మంత్రులు నిల్చి యధిపతిప్రోం గృ
తాంజలులై మ్రొక్కి యంద ఱనిరి
నృప భవదాజ్ఞచే నింత కాలము చోర
బాధ యొకప్పుడైనను సమస్త

ధాత్రీ తలంబున దనరదు గాన నీ
తండము భయగతులగుచు ధాత్రి
నందుచున్నారు చోరాన్వేషణం బగు
తర్క మిం దెట్టులఁ గలుపవచ్చు

తే.గీ. నిలువు రాజు లనేకులు గలరు రాజ
గృహములు గల వెపుడు నివారింపఁబడిన
ద్వారములు నయ్యు నిట్లు మీవంటి వారు
గలుగనేరరు పరికింపఁగా నిజముగ 85

తే.గీ. శ్వేత మృత్పాత్ర ధారణ స్థితిని జేసి
తావకీన నికేతనద్వారమునను
యరయు నిటువంటివారైన నరుగుదెంచు
రెంపి వారింపఁబడరు ధాత్రీశ వింత 86

క. కన నీ చిత్రం బెట్లుం
డిన ¹నుండని భూమిపాల ఎక్కుమగ గలం
వను మా మది వైష్ణవులం
దును సందేహంబు వొరము నూహస్థితిగన్ 87

క. వారలు గూరను శిష్యులు
వేరొకరు గ్రహింప రధిప వినుము మిత్రంగిన్
వారిఁబరి శోధించియు
మీరే గ్రహియింప వలయు మీమాంసమునన్ 88

---

1 మా నుండిని

మ. అని దుర్వాక్యము దుష్టచిత్తుఁ డతిపాపాయత్తుఁడౌ మంత్రి తా
డిన నాలించి నృపాలశేఖరుఁ డకుంఠితాత్మ చేతస్కుఁడై
చను కర్ణంబులఁ గేల మూసికొని విష్ణున్ సంస్మృతిం జేయుచున్
గన నెట్లో భరియింతు నీ మాటలు ప్రత్యక్షంబుగా నేనిటన్ 39

క. నిలువవలదు నా సన్నిధి
ఖలులారా పొండు మీరు కమలాక్షుని భ
క్తులయెడ నింద గలుగు వా
రలతో భాషింపరాదు రహి నెవ్వేళన్ 40

గీ. వారిఁ జూచినఁ బాపంబు వచ్చు ననుచు
నవనివిభుఁడు పరాఙ్ముఖుఁ డయ్యె నంతఁ
గుపితుఁడై యున్న యతనిఁ గన్గొనియు మంత్రు
లప్పు డిట్లని రవని సాష్టాంగ [1]మెఱఁగి 41

మ. తగు దండార్హుల నాతతాయిరతులన్ దండింపు మన్యున్ యథో
క్తగతిన్ భూవర యంచు మంత్రు లన నాతం [2]డిట్టినన్ వెడ నిం
తగ శ్రీవైష్ణవులందుఁ గల్గినను నిందం దాఁపి యా మీఁద మం
త్రిగణంబుం గడు తీక్ష్ణదండమున దండింతున్ ప్రసిద్ధంబుగాన్ 42

తే. గీ. అటులఁ గాకున్న వైష్ణవు లందు భక్తి
గలిగి నృపుఁ డపరాధము గలుగునట్టి
మంత్రులను దండనమొనర్చె మహిని యెంచుఁ
బాలనిందింపరే నన్ను సజ్జనులు 43

---

1 మూ. మెఱిగి 2 మూ. దిట్టుచున్

సీ అని మనంబున నిశ్చయమ్ముఁ జేసి నృపతి యి
ట్లని పల్కె నా మంత్రి జనముతోడ
వదని నే యనుమునుండు నప్పాతకము హరి
స్మరణచే నణఁగును శౌరినింద
చేసిన పాపంబు శ్రీ వైష్ణవస్తుతి
నణఁగ నణంగు వైష్ణవుల నింద
నెప్పాపము ఘటించు నప్పాప మేమిట
నైనఁ బోవదని మహర్షు లనిరి

తే గీ యట్లు కావున మీచేత నాచరింప
నైన మహనీయ విష్ణుభక్తాపరాధ
మునఁగలుగు నెందు మిమ్ము పావనులఁ జేయ
[1]తఱికి(డాలనే యె మహాదండమైన, 44

తే గీ అయిన వైష్ణవులందుఁ జౌర్యంబు లేమిఁ
బ్రకట మొనరించి దండింతుఁ బైన మిమ్ము
భువిఁ బ్రసిద్ధంబుగాఁగ నిపుడు యథార్థ
తైన మిమ్ము దండింపక నలరుకాఁ(డ 45

వ హరిభక్తియుక్తులును మహాత్ములును ధర్మసంపదాధారులును బరస్త్రీ పర
ధన పరాఙ్ముఖులును త్రిలోక పవిత్రచరిత్రులును గామార్థానపేక్షితులును
సర్వలోకమిత్రులును క్రోధ లోభాది త్యక్తులును జ్ఞాన వైరాగ్య
ప్రభావులును నగు నీ వైష్ణవులయందు దుష్టబుద్ధులగు మీ చేత నాకో

---

1 పా॥ తఱికి

హితంబగు చోరత్వం బేను పరిహరించువాఁడనై నిశ్చింతంబగు నంతరంగం బుతోఁ బ్రమాణం బొనర్చెద స్వామికార్యంబు భృత్యునకుఁ గర్తవ్యం బగుఁగదా యని పలికి సవిషంబును ఘోరంబునగు సర్పంబును స్వర్ణ ఘటికం జేర్చి ఘటాంతరంబునందు నిడి యప్పు డమ్మహీవల్లభుండు సంహృష్టహృదయుండగుచు [1]సుహృత్తులను రాజబంధువర్గంబులను బురో హితులను సమస్త పౌరజనంబులను రావించి యిట్లనియె 46

తే.గీ. అఖిల జనులార నాదు వాక్యంబు వినుఁడు
సత్య మేను వచించెద శౌరి భక్తు
లలర లోకంబులందు నొకప్పుడేని
చౌర్య కర్మంబుఁ జేయ రుత్సాహ లగుట 47

క. క్షమ సత్యము సత్యము స
త్యము సత్యంబిదియె సంశయము లేదని య
విమలాత్ముఁడు కులశేఖరుఁ
డమల మతిఁ జూచు వారి కందఱ కనుచున్ 48

వ. మహోన్నత ఫణా వ్యాప్తయుఁ గుంభాంతర్గత సంస్థితయునగు స్వర్ణ ఘట కరంబునంగొని తత్సర్పంబెత్తిన వాఁడయ్యె నిట్లమ్మహారాజు గావించు కర్మంబు నుద్వీక్షించి సకల విద్యాధరులాకసంబునం జనుదెంచి యమ్మహాత్ము నవలోకించి తన్మహాద్భుత కృత్యంబుఁ బ్రశంసింపుచుఁ బరమంబగు విస్మయంబు నొంది దుందుభులు మొరయింపుచుఁ బుష్ప వర్షంబులు గురియింప నప్సరోగణంబు నృత్యంబు సేసెనని మహాయోగి మాహా

---

1 పా. స

త్న్కంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి
యష్టాదశాధ్యాయంబు భక్త పరాయణుండగు నారాయణుండు నరునకుం
చెప్పి మఱియు నిట్లనియె 49

ఉ అంత సమస్తదేవ నికరార్చితుఁడున్ సకలేశ్వరుండు శ్రీ
కాంతుఁ డనాది పూరుషుఁడు గంధవహస్తుతుఁడాశ్రిత ప్రియ
స్వాంతుఁడు రంగభర్త కరుణాంబుధి శ్రీ రఘురామమూర్తితో
నెంతయు దృష్టిగోచరత నింపెసలారె నృపాలు వెంగటన్ 50

సీ భానుకోటిప్రభా భాసమానుని హరి
స్మృతమేచకాంగు ననంతవీర్యుఁ
గరుణాపయోధి రాకాచంద్ర మండల
నలిన విరాజితానను మహాత్ము
హస్తి హస్తాయత హస్తుఁ దటిత్ప్రభ
వసను వపార వైభవు ప్రఫుల్ల
సితపద్మ పత్ర విస్తీర్ణాంత లోచను
నర్ధ చంద్ర విశాల [1]ఫాల భాగు

తే గీ మదిత బాలేందురేఖా సమోర్ధ్వపుండ్ర
రమ్యమాణిక్య మకుటాంతర స్థ నీల
కర్ణకుండల మండిత ఘనకపోలు
([2]వికచ నీ రేజసంస్పర్ధి వివులనయను) 61

1 మూ ఫాలు
2 మూ లేదు

చ సకల జగచ్ఛరణ్యుని విశాల శరద్వికచాబ్జ పాదయు
గ్మకుని మణిస్ఫురన్మకుట కాంతి విరాజిత సర్వదిక్తటున్
ప్రకట శరాసనాగ్రయుత బాణకరున్ గలితాబ్జ హస్త పా
యకు నిజపృష్ఠభాగగత హాటక రత్న నిషంగయుగ్మునిన్ 65

సీ వైజయంతి దివ్యవనమాలికోజ్జ్వల
మణికంకణాది భూషణ భూషాంగుఁ
గాశ్మీరకస్తూరికాగంధ చర్చితుఁ
గందర్ప శతకోటి సుందరాంగు
శంపాలతాభంగి జగదాకృతియు జగ
న్మాత దయాలోకనముఁ జేసి
సకల భూతశ్రేణి సంరక్షణముఁ జేయ
జనకజతో నుండు సదయ హృదయు

ఆ వె వ్యగ్రమున్ము దాస్యము నొందుచు సమాహి
తుఁ డగుచున్న లక్ష్మణుఁడు సపర్య
ననుదినంబు సలుపఁ దనరు విభుని లోక
పాలకుని మహానుభావు నమలు 66

చ అమృత పయోధి ఫేన రుచిరాభ్ర మణిదండము చేత మించు పొ
ద్మమ మగు చామరంబున సమంచిత పూర్ణ సుధాంశు మండలో
పమ ధవళాతపత్రమున భాసిలు ధన్ము భరతాగ్రజేంద్ర వం
ద్యు మహిత చర్యు భక్తజనతోషకు నిస్తుల ముక్తిదాయకున్ 67

తే. గీ. అక్షయు ననంతు నవ్యక్తు నప్రమేయు
నఖిల జగదాకృతి పరేశు నాద్యు విశ్వ
సంభవ స్థితి లయ కారు సకలభర్తఁ
బరమఁ బురుషోత్తమునిఁ బరాత్పరుని విభుని 58

క. ఈ విధమున వెలుఁగొందెడు
నా వరదుని నవ్యయాత్ముఁ డగు రాఘవు నా
భూవరుఁడు గాంచి యా స
ద్భావుండై తిరుచేరఁ బ్రణమతిఁ జేసెన్ 59

తే. గీ. అతని సందర్శనమువల్ల నధిక సుఖ త
లాప్తియై పులకాంచితుఁడై ప్రహర్ష
బాష్ప చకితాక్షుఁడైన యప్పరమ భాగ
[1]వత వతంసుని రామభూవరుఁడు గాంచి 60

వ. తనకు దండ ప్రణామం బొనర్చిన మహామండలాఖండలు నెత్తికొని
కౌఁగిలించి కృపాకలన సహిత మధుర భణితి నిట్లనియె 61

### కులశేఖరుఁడు నారాయణుని స్తుతించుట

సీ. వైష్ణవోత్తంస భూవరశేఖరత్న క
ల్యాణగుణాఢ్య మహానుభావ
నాథ భక్తవరుఁడ నాకంటె నధికులు
గాఁగ నెంచితి వడిగాన నేనుఁ

---

1 మూ. వతాంశుని

దుష్టుఁడ నైతి సర్వజ్ఞుఁడవైన వరము
నేఁడు మెచ్చెదని మ్రొక్కితోడ
శ్రీ రాముఁ డనఘ వాన్నపతి చేతులు మోడ్చి
వినయంబు దోఁప నిట్లని నుతించె

తే.గీ. రామచంద్ర లోకాభిరామ కమల
నయన యోగీంద్రచిత్తాబ్జ నలినమిత్ర
శ్రీనిధి విశాలకీర్తి భాసిత దిగంత
విక్రమౌదార్య కారుణ్య విభవశాలి 62

తే.గీ. ఆది పాలన సంహారకాభిధేయ
బ్రహ్మ రుద్రేంద్ర ముఖ్య సుపర్వవినుత
[1]ప్రకట సుందరాంగ భాస్కరవంశ జలజ
భాస్కర మహాత్మ నీకు నమస్కరింతు 63

క. నరనుత దశరథ భూపా
శ్వర తనయా [2]కోసలాత్మజాగర్భభవా
వరతాటకాద్రి వజ్రా
దరము వినతి నీకుఁ గౌశికక్రతుపాలా 64

క. అహిభూష చాప హంతా
ద్యహ తాటక బలాఢ్య భూమిజనయ పాణి
గ్రహణోల్లాస సముజ్జ్వల
విహ మ్రొక్కెద నీకు భార్గవ శతమద హరా 65

క. జనకోక్తి గౌరవము వం
నను గురురాజ్యాభిషేచనము విడిచి నిషా
ద నృపతి యగుగుహుఁ డిచ్చే నుతిఁ
గను నీకు నమస్కరింతు ఖచరస్తోత్రా 66

1 మూ. జలజ 2 మూ. కోసలాగర్భ

క. చరణ కమల సంచార
స్ఫురితాఖిల గహన విజయ భూరి ఖరాద్యా
సుర సంహారణ్య నము
ద్ధర దావానల మనున్ వతుల్ సేతు మతిన్ 67

క. కుహనా కురంగ రూపుని
మహిత భుజా శౌర్యధుర్య మారీచుని దై
త్యు హరించిన నీ కోరికి
నహరహము, నుతించువారి నతిశయ భక్తిన్ 68

క. కని తిర్యగ్యోని జనిం
చిన పక్షి జటాయువునకుఁ జేకొని మోక్షం
బనువొంద నిచ్చిన దయా
వన రాశి నీకు మ్రొక్కువారఁ మహాత్మా 69

తే.గీ. శబరి యనెడి తపస్విని సారభక్తి
స్వాదు ఫలములు గాఁజూచి సంగ్రహించి
యొసఁగిన భుజించి కరుణ దయ్యనిదఁ బ్రోచి
నట్టి నీకు నమస్కార మాచరింతు 70

క. లీలా విలోకనంబున
[1]నోలిన్ వాలమ్ము వేసి యొక బ్రేటున నా
వాలిన్ నిర్మూలించిన
శ్రీలలితున కే నమస్కరించెద నీకున్ 71

---

1 మూ. లోలి

క. అగ్రజు నిగ్రహ మొనరిచి
సుగ్రీవు ననుగ్రహించి శుభకర రాజ్యా
నుగ్రహము సేసిన కృపా
విగ్రహునకు నీకు నేను వినతి యొనర్తున్ 72

సీ. ముద్రాంకిత కపీంద్ర ముద్రికాభరణైక
భద్రదాయక భక్త హృద్రతాక్ష
శరణార్థి పౌలస్త్య భరణాభయ ప్రద
కరుణాభరణ దీన శరణ చరణ
యాదకాంబుధి మంద్రాంత మధ్యనిబద్ధ
సేతు విఖ్యాతి సంజాత మహిమ
లంకాపురీ కృతాలంకార హరణ ని
శ్శంకారచిత సాహసాంక సమర

తే.గీ. సకల దనుజ దవానల శమన జలద
కుంభకర్ణాఖ్య మదకుంభి కుంభివైరి
ఖండనోద్దండ రిపుఘాతఖండన ప్ర
చండ నమస్కరింతు నీ కంజలి గొని 73

క. కుంఠిత దశకంఠ మహా
కంఠీరవ ఘోర కంఠ గళ ఖండన సో
త్కంఠ శరధా[1]కృతివ యగు
కంఠేకాల నుత నిను గావింతు నతుల్ 74

---

1 మ ప్రతి వసు

క. హరవిధి శక్రముఖామర
చిర విమల విభీషణాభిషేక ప్రీతం
భరితానంద నిగుంభన
మతిమతి నీ కొలుతు నే నమస్కృతిఁ జేతున్ 76

క. నామాంకితాయుధ భాసిత
భూమీసుతతోడ నెక్కి పుష్పకమున స
త్ప్రామోదస్థితి వెలసిన
శ్రీమంతున కే నమస్కరింతును నీకున్ 76

సీ. సాకేతపురవాస జనమానసాంభోజ
తరుణార్క సౌఖ్యప్రదాననిపుణ
యసమాన దివ్య సింహాసనారూఢత
నిరవొందు సర్వలోకేశ్వరేశ
భరతాది నిజ సహోదర ధరిత చ్ఛత్ర
చామరాదిక పరిచ్ఛద విశేష
తపన నందన వాయుతనయ[1] జాంబవదాది
రమణీయ సేవా విరాజమాన

తే.గీ. యఖిల రాజన్య నికరంబు లాశ్రయింపఁ
బరమ సామ్రాజ్య వైభవస్ఫురణ వెలసి
దేవతలు సన్నుతింపఁగఁ దేజరిల్లు
నీకు మ్రొక్కెదనయ్య లోకైకనాథ 77

1 మూ. సుగ్రీవాది

ఉత్సాహ వందనంబు నీకు రాజవర్య జానకీవరా
వందనంబు నీకు భక్తవర సంతతాదరా
వందనంబు నీకు లోకవందితా కృపాకరా
వందనంబు నీకు రామభద్ర దేవ శ్రీకరా 78

చ. శ్రుతులును దేవతల్ వెదకి చూడ నగమ్యుఁడవైన నీవు ప్ర
స్తుతము మనుష్యమాత్రుఁడను క్షుద్రుఁడనై తగువారు గోచర
స్థితిఁగనవైతి విప్పు డటుచేసి కృతార్థుఁడనైతి సత్కృపా
యతమతిఁ బ్రోవు నన్ను భరతాగ్రజ శ్రీ రఘువంశశేఖరా 79

క. అని పల్కి నృపతి యారా
మ నన్నుగ్రహమునను దివ్యమును వేదాంతా
ర్థ నిరూఢ సంగ్రహంబును
దనరఁ బ్రబంధంబు నపుడు దాఁ జేసె యోగిన్ 80

తే.గీ. దాని రామున కర్పించి తద్విదుండు
భక్తిని గృతాంజలి యగుచుఁ బరమ మూర్తి
యైన యద్దేవుఁ గూర్చి యుదార ఫణితిఁ
బలికె సంతోష భరితుఁడై భవ్యమతిని 81

క. కరుణాకర దేవా నను
వర మడుగు మటంచు నీవు వచియించుట నే
వర మేను గోరుదు సురే
శ్వర యంతయు మున్నె నా కొసంగుట చేతన్ 82

క. నీ యందలి సద్భక్తియుఁ
జాయక మీ భక్తులందుఁ బ్రబలిన భక్తిన్
ధీయుక్తి నా కొసంగుము
శ్రీయుత కరుణాలవాల శ్రీజనపాలా 83

తే.గీ. అవ్వరము దక్కఁగ నితరం బేమి గోర
నీ సర్వేశ్వర యటంచు నిట్లు నృపతి
ఎఱుకడో హరి సంతోష మానుఁడగుచు
నట్ల వరమిచ్చి నవ్వుచు ననియె మఱియు 84

తే.గీ. భ్రాంతి నీలాంశ జాతయౌ నీ తనూజ
నా కొసంగుము ధరణీనాథ నీకు
నేను జామాత నయ్యెద నీవు నాకు
మామ నగుమని యా రంగధాముఁ డనిన 85

క. జనపతి యా హరి వాక్యము
విని నే ధన్యుండనైతి వెస నా జన్మం
బును గులము పవిత్రంబై
తనరారె మహాత్మ యని ముదంబు దలిర్పన్ 86

### నీలాంశజాతయగు కులశేఖర తనయను నారాయణుఁడు వివాహమాడుట

వ. అని ధరణీశ్వరుండు పురమంతయు సాంద్రసుగంధ చర్చనం
బున మణితోరణంబులను ముత్తెపు ముగ్గుల రత్నదీప భా
జనములచే నలంకృత మొనంగఁగ మంగళతూర్య ముఖ్య ని
స్వనములు ఘోరగిల్లఁగ వివాహ విధుల్ సమకూర్చి యంతటన్ 87

సీ. సతికి మంగళంబుల స్నానంబు గావించి
    ధవళ దుకూల వస్త్రములు గట్టి
లలితకుఁ గస్తూరి తిలకంబు గావించి
    పవనవామోద గంధము లలంది
కరతటికి మణిహేమ తాటంక కంకణ
    కంఠహారాద్యలంకారము లిడి
కలికికిఁ గన్నులఁ గాటుక ఘటియించి
    చెలువంపుఁ బసుపున నలుఁగు పెట్టి

ఆ.వె. సకల సౌందర్యరసము సాక్షాత్కరించి
యా కుమారిక యయ్యె నా నింపుమీఱ
పరమ శోభనవతికి నా పద్మముఖికి
సలిల శృంగార వైభవ మొనరించి 88

క. ఆదరమున నా నరపతి
వేదోక్త కృతాగ్ని హవన విధు లొనరంగా
నా దేవిని వైవాహిక
వేదికపై మనిచి దివ్య విభవము లమరన్ 89

క. ఆ రాజు కన్య నిచ్చెను
వారికి విధిపూర్వకముగ వైభవ భృతికిన్
శ్రీరంగపతికి భవ సుర
సీరుహ భవ ముఖ సుకర్మ సేవావృతికిన్ 90

ఉ. అంతట రంగరత్న విభవాంచితలీల మనోహరాంగి య
త్యంత విలాససంపదల యందముగం దగు నట్టి ధారుణీ
కాంతుని పుత్రియై తగిన కన్యక ధన్యకలాపశాలి వ
[1]ల్లింతి వివాహమై శుభము లింపుగ నా రమణీ సమేతుఁడై 91

తే.గీ. ఆ నృపాలుండు మంగళార్ఘ్య సకల
భూరితర వస్తువు లొసంగి పూజసేయ
హరి ప్రవేశించి ప్రీతుఁడై సురలతోడఁ
బరమ మైనట్టి నిజ దివ్యభవనమునకు 92

సీ. అంత నా నృపమంత్రు లతి విస్మయావిష్ట
చేతస్కులై యా మహీతలేశు
సతు ప్రభావంబు దారసి భూవరా
పరులెల్లఁ గైకొని యల్ప యరగి
ముందట నిడి భయంబున ప్రణామము చేసి
తమ యపరాధ మంతయును దెల్పి
యట కరతార్థులై యతియంబు వేడిన
నారాజు వారల కందఱకును

తే.గీ. దయ నభయ మిచ్చి రక్షించి తనతనూజు
మనుఘు గుణవంతు బలవంతు వినయవంతు

---

1 మా. ల్లెంత

రాజ్యమున నుండి తాను నిరంతరంబు
వెలయ వైష్ణవసేవఁ గావింపుచుండె 63

కలశోదరుఁడు రామాయణకథా శ్రవణంబునం జేసి
దశకంఠునిపైఁ గోపంబు వెట్టి లంకకుఁ జనుట

వ. అనంతరం బమ్మహీకాంతుండు శ్రీమద్రామాయణ పారాయణుం డగుచు ననవరతంబు రామాయణ కథం గూర్చి మహాత్ముండగు రాఘవు సుఖ చర్యలయందు సుహృష్టుండును, దుఃఖ చర్యలయందు దుఃఖితుండును నగుచు రామునియందలి ప్రేమాతిరేకంబునఁ బరవశాంతఃకరణుం డగుచు నిర్విఘ్నంబున వసియించుచున్న రాజా నవలోకించి యటఁ గౌరాశి తుం డిమ్మహానుభావుం డీ సీతాపహరణంబు సహింపఁడని చింతింపుచు మాయాసీతం గొనిపోయెనని యుగ్గడింపుచు నా వైష్ణవుం డుండె నంత నొక్క నాఁ డవ్విప్రవర్యుండు గ్రామాంతరగతుం డగుట నతని పుత్రుం డనుత్తమంబుగ రామాయణంబుఁ జెప్పి నృపతి మనంబు గూర్చి దశకంధ్రు చేత నడువఁ బడని సీతాపహరణంబు నతనికి యథార్థంబుగ నెఱింగించిన [1]నారాజ శక్తి సంపూర్ణ హృదయుం డగుచు దాని విని ప్రత్యక్షంబు మాడ్కిఁ దెలిసి కాలరోష సమాకలితుం డగుచు మదీయజనని యగు జానకిన్ దుష్టాత్ముండెట్లు హరియించు నిప్పుడ యారక్కసు శిరంబుల కరవాల ధారం ద్రుంచి వైదేహిని పలికి ఖడ్గంబు గైకొని రవితురంగ సన్నిభంబగు తురంగరాజంబు నెక్కి లంకాభిముఖుఁడై పోవుచున్న యవసరంబున 64

1 నారాజ కుమారుండు

వ మహీపాలా నీ వియ్యుద్యమంబువలన నడుగవలదని చెప్పి యాత్రిత వత్సలాంతగు నన్వేషం బతని నిబ్బృతారాధుం గావించి యవ్విమానంబులోఁ గూడ నప్రాకృత జనాకీర్ణం[1]బగు వైకుంఠంబుఁ జేరె మహానుభావుండును హరిప్రియుండును నగు విక్కుల సోయ చరిత్రం బెవ్వ రనయంబు వినుచుం బఠియింపుచు లిఖియింపుచు నుండురాఁ వైహికాముష్మిక సుఖంబులను [2]బొందుదురని శ్రీమంతంబును నగు భార్గవపురాణోత్తర ఖండంబు నందలి యేకోన వింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుఁ జెప్పి వెండియు నిట్లనియె ౪౮

చ నర విను మేను జెప్పెద జనస్తుతమై తగి సర్వదేవతనో
త్కర పరిరక్షణాఢ్యమగు ధారుణిలో నవలిప్తయయ్యో సా
దరమతి లక్ష్మి భక్తజన దైన్యములన్ హరియింప నా రమా
చరితము నుత్తమం బఖిల పాప్రహరంబు వేడుకన్ ౪౯

సీ కల్యాణగుణపటి కంజాత సంజాత
కటుదానవారిక విభవ సమేత
సరసీరుహాక్ష వక్షస్స్థలాలంకార
కీర్తి ప్రచార విస్ఫూర్తి సార
త్రిజగతీమాత వర్ణిత వైభవఖ్యాత
నతకల్పవల్లి కాంతామతల్లి
సతతలోకేశ్వరి శాశ్వత మహితరి
భక్తమన పద్మ [3]భవపద్మ

1 మా యనువగు
2 మా లేదు
3 మా సద్మ

తే.గీ. మహిని సంసార బంధ నిర్మగ్ను లగుచు
గ్రుక్కుచుండెడి జనములఁ జూచి వారి
నందఱను నుద్ధరించుట కార్య మెంచి
యవతరించిన సిరికళ యాంకింపు 100

## పద్మినీకన్యకోత్పత్తి

సీ. ఝుంకార షట్పదాలంకార సావన
కేళింకార పరివార సంకులంబు
మల్లికా జాతిమతల్లికా మాధవి
వల్లికా సముదాయ వేల్లితంబు
మందార తరు సుమస్కా దారర మరంద
సందోహ నిస్తులానందవనంబు
కేకా శారికా కీరికా పాలికా
నేక నిస్వన మాలికాకరంబు

తే.గీ. మంజుతరకంబు సంతాప భంజనంబు
చైత్ర సంక్రాంతి సౌరభాంతరంబు
సమత దివ్యకరంబు క్రమాపగా త
టాంత లక్ష్మీకరంబు పద్మాకరంబు 101

వ. పెండియు నా సరోరుహాకరంబు సరోరుహాకర కారకం బగుట సమృతా
కరంబు దంబు విరచించుచు నిశాంచుపూర ప్రతిబింబితంబులగు
నంబురుహ మిత్రామిత్రబింబ ప్రముఖ గ్రహతారకా కదంబంబు నున్న

లోకంబున నాలోకంబు లోనంగి ఘుమంగ భువనంబునకు వెలుంగు లొసంగం
గమకించు తెలుంగు సంగీతకింప నిందీవరారవింద నిష్యంద మకరంద
బిందు కుండుంబులుంగు మిళింద బృందంబులు పనుమానసా ఘటించు
ంగు తటనికట విటపి పటలం బుల కటు నిటు జనకదీయ మేచక రుచి
భారచక్రంబు లంబుచర్చితయగు చందేపక విదుర్చు కచరుచి నిచయంబుల
బచరింప తైర్థ్యంబు రాజు నీరంపు చీకటి తరంగల తెరల తెలుగుల
సలిల కమల పాళి వెలికి ఘటియించు మెఱుంగు [1]లెతింగింప స్వకీయ
[2]పత్ర ప్రాకటకం బై కౌను కొకనదనికరంబులును విపరీత మధుకర
ప్రకరంబులై యళ్ళాకరంబుకికిం గళ్ళాగ్రదీపిత దీపికలు నొసంగు
మంగళారాత్రికల రొంపు సంపాదింప నింపొందుచు [3]నతి ఎము గగనంబు
మాద్రికా దరకతారకానికాయంబై వాసుదేవాగానంబు పగిది పతగరాజాహీన
ప్రవృత్తి ధుర్యంబై యంభోజసంభవ సభా భవనంబు భాతి భాషా ప్రశంస
హంసావతంస సంసరణంబై కందర్పహార మందిరంబు పోడిక్కుగ్రాంచ
భేదసంబారాంచితంబై చాచకీరాత సేవిత వితానంబులిం సనిలకుమార
[4]ప్రేరితంబై కుముదవన సరంభాది సంరంభయ్యాయ్య సంఫుల్లహల్ల
కహ్లార రాజీవ రాజీవిరాజితంబును ఘవృవరాగ పరంపరా పటవాస
వాసనా వాసితా గాంతరంబును కోయష్టిక టిట్టిభ కులకుక్కుట కారండవ
ముఖ సలిలాంతమ మండల ప్రశాంత మండలంబును వగు నమ్మడుంగు
నందు 102

---

1 మూ లెతింగింప
2 మూ ప
3 మూ యతి
4 మూ ప్రేరిత

తే. గీ. అమరి ఫాల్గుణ మాసంబునందు శోభ
నంబయిన యుత్తరర్షంబునను సమస్త
లోకసేవిత స్మరమాత శ్రీకరాంగి
పొడమె నొక దివ్య కాంచనాంశోభమునను 103

సీ. సుందరగాత్రి పూర్ణేందు నిభ వదన
జలరుహపత్ర విశాలనయన
ఘన చతుర్భుజ పీతకౌశేయ శోభిత
కరయుగ కలిత కోకనదయుగళ
విద్యుత్ప్రతాన భాసిత దీప్త సంకాశ
రమ్య లావణ్య హిరణ్య వర్ణ
హారిణి పృథుశ్రోణి హరిమధ్య బింబోష్ఠి
పద్మ పాదతల ప్రభాసమాన

తే. గీ. శ్రీయుత భ్రూలతాద్య చాంపేయనాస
నీలకుంచిత కుంతల నిమ్ననాభి
కంబు కంధర హార కంకణ కిరీట
కుండల లలాట భూషిత గుణ సమేత 104

తే. గీ. దివ్యచందన పరిలిప్త దివ్యపుష్ప
గంధ శోభిత సుకుమారి కమలపాణి

కార్యాలంకృతయును నాథుఁ గంటి పీఠి
యందు వెలుఁగొందుచున్న యయ్యవసరమున 105

క. నరసింహాసన ముఖులగు
సురలు తపోధనులు నగు ఋషులు గంధర్వా
ప్సరసలు గుంపులు గొని యు
త్వరమతులై వచ్చిరట ఉదారస్ఫురణన్ 106

తే.గీ. అపుడు సుమవర్షములు గురియంగఁజేయు
చును జయారావములు మొరయింపుచును ధరిత్రి
యందు సాష్టాంగ దండంబు లాచరించి
వివిధనుతుల నుతింపుచు వినయమంత 107

## బ్రహ్మేంద్రాదులు లక్ష్మిం గీర్తించుట

క. సురసంఘపూజ్యుఁడు జగద్ధా
త్రీరమణి నా లోకజనని దివ్యగుణమణిన్
వారిఁ గరపుటాంజలిం గొని
సరసం బగు భక్తిచేత సన్నుతిఁజేసెన్ 108

తే.గీ. సర్వలోకేశ్వరేశ్వరి సర్వలోక
జనని శ్రీదేవి దేవి జయము వెలయ
మోదమున నిశ్చలా భవా వేఁడుకొంటి
మ్రొక్కెదను నేను బహువారములను భక్తి 109

ఉ. నీవు సహస్రలోచనుఁడు నీవు సహస్ర శిరోధి యుక్తవున్
నీవు సహస్ర పాదవును నీవు సహస్ర కరాంచి తాతవున్
నీవు హిరణ్య వర్ణవును నీవె హిరణ్మయ వాది లక్ష్మి విన్
నీవె సమస్తమాత హరిణీ నినుఁగూర్చి నమస్కరించెదన్ 110

క. క్షమలోఁ జంద్రాహ్వయవై
రమణీయస్థిర సువర్ణ రచితస్రజవై
యమరి సకల సంపత్ప్రద
సుమహిమ గల నీ కొనర్తు శుభమతి వినతుల్ 111

క. ఇల నీ కటాక్ష వీక్షణ
ములచేఁ దగ నీ యనేక భువనంబులలోఁ గిన్
గలుగుచు వర్తింపుచు ను
జ్జ్వలతర సౌఖ్యంబు నొందు సమ్మదలీలన్ 112

మ. హరివక్షః స్థలవాస నీ దగు విలాసార్థంబు నీచేత నా
హరి సంప్రేరితుఁడౌచు నీ సకలలోకాలిన్ సృజించున్ స్థితిం
బరఁగ రక్షార్తినిఁ జేయు నిదయిన నేత్రోదంచిలస్పందిత
స్థిరలీలన్ గద లోకపావనదవుల్ దిర్జిత్పురాదిస్థితుల్ 113

సీ. అనఘ గంధద్వారయును దురాధర్షయు
నిత్యపుష్టకరీషిణియు నటంచు
సర్వ భూతేశ్వరి శారి నిల్యాన పా
యనియని నిన్నుపాసనము చేసి
యశంబు సర్వలోక విదితులును ధనం
బును పశ్వంగ గోవులును మదోత్క
టంపు మాతంగ సంఘములఁ గౌశేయ వ
స్త్రములును వివిధ రత్న వ్రజము

తే.గీ. భూమిని సనెక విభవంబు పుత్త్ర పౌత్త్ర
సంతతిని నిగమంబుల శాస్త్రములను
బుధ్యలోకాదులను [1]జ్ఞానమును సమృద్ధి
నొందుదురుగాదె నీ దయఁ జెంది జనని 114

తే.గీ. అఖిలలోక శరణ్య కల్యాణ సుగుణ
వారధి శరణంబు గాంతు రేజనులు నిన్ను
వారు గాంతురు పుణ్యము వైష్ణవంబు
నవ్యయంబును శాశ్వతంబైన పదము. 116

---

1 షూ. జ్ఞానములను

దళదరవింద సుందర విలోకనములు
ప్రీత జన దైన్య విచ్ఛిత్తిఁ జేయ
సముదీర్ఘ బాహా కాంచన కల్పలతికలు
ధన్య సంచయ వాంఛితం బొసంగ

తే.గీ. సరస సౌవర్ణ పంకజాంతరమునందు
నాలవాలంబున వినోదకేళి సల్పు
చును ప్రకాశించు శ్రీదేవి శోభనాంగి
గాంచి యారాజు విస్మయాక్రాంతుఁడగుచు 124

తే.గీ. రూపలావణ్య కాంతుల రూఢిమించు
నమ్మహాదేవి నెక్కుడా నరసి యంత
నధిక సంస్తుతులను గొనియాడి మ్రొక్కి
భక్తి తాత్పర్య హృదయ స్వభావుఁడగుచు 125

మ. కరు విశ్వాసమయింతు భూవిభుఁడు విధ్యుక్తంబుగా బద్మమం
దిర లక్ష్మి న్నళినీలోకదారమున వర్ణించుచుం గాంచి సుం
దరతం బొప్పగు నామెఁ గాంచన విమాన ప్రస్థితం జేసి మం
దిర సీమం గొనివచ్చె హర్షయుతుడై దివ్య ప్రభావాఢ్యుఁడై 126

క. పద్మమునఁ గలుగుటను వా
పద్మనిభేక్షణకు భూమిపాలుఁడు తగన్
పద్మిని యనుపేరిడె వా
త్సద్మంబున నిండుకొనిన పరమ ప్రీతిన్ 127

క. ఒప్పారెఁ గర్ణంబులు
దంచఁగ శ్రీరూపమునఁగఁదనరుట దృష్టా
కలితోక్తి వినువె యమ్మురా
కంసకుఁ బాపౌట విభవకర సంవృద్ధిన్ 182

శా. రాజీవద్వయ మింతి నేత్ర సమతన్ రాజిల్లి తోయస్థితి
ప్రాణం బూనినదో సదా యమకృత వ్యాప్తిన్ బయల్మిండి యం
బోజంబుల్ దళమెక్కి తాము సరికిం బోఁబోవ నాహాఁటకిన్
[1]దేహంబు వ్వెదఁబాయఁజొచ్చె నటు గాదే పంకజాతోద్ధతుల్ 183

క. సఖియ విలోకనములు [2]వం
మకరాంకుని చెక్కెములు సుమా తగి మిగులం
తకిలి కఠోరతలంబు
మకరములు బెంతు రేం మతి తాకున్నన్ 184

క. కలిత సమస్త సుగంధము
లలిమిఁగనఁ జెంప్రవసూన మీ వెలి వాసా
కలనం జుయుపొందినదో
నలరెఁ గటాక్షాలి వాలికాలి యరుగదన్ 185

క. హరి వాయ తాయ్మి మీ పం
కరుహానన రామునౌటి గారెక గదా

---

1 మూ. దేహంబు వెదఁబాయ 2 మూ. గం

కళ నేవంటి యయలుం
గలుగ వెంబడి రసముగా రాలు నాగిన్ 136

క రదములు మౌక్తికములుగా
రదనచ్ఛద మబ్జ రాగ రమ వహియించెన్
[1]మొదంరసులె యటుపైవం
బడయడి సరసుల వచింపఁ బని యేమిఁ కిన్ 137

చ దర వివరం బిసియని యుదారత బైలున కొత్తి యింతి కం
ధర యెువందుచోఁ గమం నాగము లప్పం పాలుఁ జేసి యా
శ్చర్యముగ బాహువుల్ దవరఁగా నరుణన్ గిరులన్ నిశాకర
స్ఫురణము నాలుకావముసుఁ గొందఁగ జాదుఁ గుచంబు లెయ్యెడన్ 138

మ వలిపాళిమంత నిమ్ననాభి యను పున్నాగ ప్రసూనంబునం
దలిసంధుంబులు ప్రాలి పైఁ గుచగురుద్భామోద సౌభాగ్యముం
దిలకింపం బడఁబాచు [2]కల్గం సహాతియాళి వాసుధ్రమం
బొలయం బాలగ దానిఁ గూర్చి చనువా నొప్పారు నూగారగన్ 139

తే గీ కలితకాంచన మణిమంటికాధవంబు
తెసఁగఁ రసనా విలాసంబు సొనసియున్న
భామినీ మధ్య గగన మేర్పడియెఁ బ్రకట
కల్గుణం యుత్తమగు నాకసం బనంగ 140

---

1 మూ మొదలరసులె యెటుర్రైవం
2 మూ కచ్ఛం

తే.గీ. నయనములు మీనములు రదనములు మౌక్తి
కములు క్రొమ్మించు తీగెలు సరిని నాఁగఁ
బాలిక సౌందర్య రస సుధా స్ఫూర్తి నెసఁగి
సరసిజేక్షణ నవ [1]వయస్సంపదఁ గాంచె 144

క. నాళీక నాభియగు నా
నాళీక దళాక్ష యౌవనంబున నిటు లా
నాళీక నవ సృష్టియొ
నాళీకాస్త్రుని ప్రభంజనా నెసఁగు రతిన్ 145

## పద్మినీకన్య రంగనాథుని భర్తగా వరించుట

క. ఆ మానిని లో మానని
ప్రేమాదరఁ ప్రసక్తి పెంపొంద మదిన్
వేమింటి రసతుఁ బతియని
కామించెన్ రంగనాథుఁ గమలానాథున్ 146

సీ. శ్రీరంగనిలయు నెంచి గణించినంతనే
మది బ్రీతి నర్తింప మపులఁ దెనుచు
ఎతఁడాయె యనుచు నేర్పడఁ జెప్పినంతనే
రోమ రేఖాంచితారూఢి నెసఁగుఁ
పద్మనాభుఁ డటంచు భాషించినంతనే
వీక్షణాళం [2]బీత పేర్కొఁజేయుఁ
పద్మాప్రియుఁ డటంచుఁ బల్కినయంతనే
యచ్యుతప్రియ నే నటంచుఁ దలఁచు

---

1 వ్రా. యవ 2 వ్రా. చే

తే. గీ. హరియటంచు వచించు యంతలోన
తాను ఇచ్చిన వనమ సత్కర్షఁ దాను
రంగపతి మోహలగ్నాంతరంగ యగుచు
దాలిచామది యటుల ప్రఖ్యాతి నెసఁగ 147

వ. మఱియును నయ్యంగనామణి రంగనాథ సమాకృష్టాంతరంగయై తదీయ
దర్శనస్పర్శనాలింగనానంగ నానావిధ లీలావధాన సువిధాన విభ్రమ
సంభావనా గుంఫన వివశస్వాంతయు స్వాంతభవ [1]స్వ సముద్దండ
దోర్దండ కుండలీకృత కోదండ నిర్గళ త్కాండ ప్రకాండ పరంపరా
విపాట్యమానధైర్య కంకట వికంకట హృత్పుటయును పుటపాక నిభాక
వియోగ వేదనాతిశయాతి పాక సమాపాదిత పాండిమాది వివిధ వైవర్ణ్య
లక్షితావయవ లక్షణయును క్షణమాత్ర చలీకృత శయనాసనాద్యవస్థానయు
నగుచు వర్తింపుచు నతని యనంతకల్యాణ గుణంబులు గీర్తింపుచుఁ
జెలికత్తెలతోఁ దత్కృతులు వచియింపుచుఁ దత్పరిచర్యలు రచియింపుచుఁ
దల్లీలా చరిత్రంబులు పఠియింపుచుఁ దదన్యాప్రవణంబుల ధరింపుచుఁ
ద్రూపంబులం దలంపుచు నతని భజియింపుచు నివ్విధంబున నిరంతర
తత్పరాయణయుఁ దదధీనానన్యధ్యాన విస్మారిత సర్వస్వయునై యుండి
యయ్యవసరంబున 148

సీ. ఉత్తరంగోత్తరం మదాత్తమౌ లసదుది
త్తము రంగనాథార్పితంబు గాఁగ
పద్యంబుఁ బల్కెను నందెడు తనజిహ్వ
శౌరి చర్యోక్తి లాస్యదముగాఁగ

---

1 మూ. స్వ 2 మూ. ర్ధ

సీ. సారసాస్య యటంచు సారె వేధింపకు
 సువంయగంధి యా కోమలాంగి
చక్రస్తని యటంచు సాహసింపఁగఁబోకు
 బాల చకోరాక్షి యా లతాంగి
యలరాహు రోమాళి యనుచు రోషింపకుఁ
 [1]దారకానన యా యుదారి మధ్య
తిమిరకుంతల యంచుఁ దివిరి బాధింపకుఁ
 చంద్రికాహాస నా చారు వదన

తే.గీ. యా సుధా మధురాధర కీ ప్రియాంగి
కీ కళారాశికిని మఱి యెఱుక గలిగి
యున్న నీ విట్లు గినియుట యుచితమౌనె
యమలగుణపాత్ర పద్మగాత్ర కుముద మిత్ర 161

మ. నిను సత్యంపు గుణంబువాఁడ వని సందీప్తంబుగా లోక మేఁ
పునఁ బల్కంగ మగ్రాగ్రదీప్తిఁ గొని యా పూఁబోఁడులం బ్రాపెఁగాఁ
బని యేమో మును తారవేటు మహా సంతర్భాల నేత్రానలం
బున రూపారిన వాని చెల్మి గనియుం బోఁ బాడి నీ కీ యెడన్ 162

ఉ. కఠినుండ వీ వని పల్కుదురు లోకులు నేఁడు తాపసి
వ్రాతము చిత్రముం గలఁప వచ్చుట సిద్ధగుణంబు గాదు ని

---

1 మూ. తారకానన
2 మూ. ద్రోఁగాచగా

క. సంతతము ప్రాణాంతక మై
యంతయుఁ బ్రియమైన వాడవై యెదలను దు
ర్దాంతపు విభ్రమముం గాని
కాంతం దయ పెట్టెదవు సుగంధ సమీరా 171

తే. గీ. మరుని తేరాడునా లేక మలయపర్వ
తమున గల సర్ప ఫూత్కార విషప
కీల (పర) మునో గాని నీతిమాలి
వెడియం నెపెదవు నీవు శీతపవన 170

ఆ. వె. ఆ సమీరు దూరి యట వేలు లా నారి
విరహతాపమూన వివశయై
కేలుమలు గూర్చి సేద యంతయుఁ దీర్చు
యుచితలం లరయుచున్న వేళ 173

మ. తనరం బద్మిని బాధఁ జెందె నను వార్తల్ చెప్పఁగా మిత్రతన్
దన తన్నన్మను మన్నుగా ననుప సద్భావంబునన్ దూత వ
చ్చిన చందంబున వేగుఁజుక్క గనిపించెన్ వెంటనే తానునుం
జనె నాఁ బద్మహితుండు దోఁచె నుదయాంచ[1]చ్ఛైలం శృంగంబునన్ 174

క. అంతటఁ దద్వృత్తాంతం
బంతఁ దెలిసి రంగభర్త యత్యంత దయా
స్వాంతంబున నెంతయు వా
కాంతామణి పైఁ బ్రేమ గడలుకొనంగన్ 175

---

1 ము. త్రై

## శ్రీరంగభర్త పాండ్యనగరమున కేతెంచి పద్మినిని బరిణయమగుట

సీ. జలజాసంభవునితో సకలదేవతలతో
సనకాదులగు దివ్య మునులతోడ
వరుస ననంత విష్వక్సేన ముఖ్యులై
తనరిన పరివార జనముతోడ
సమితానుభావులై యలరు కాసారాది
పరమ మహాయోగి వరులతోడ
గరుడుని నెక్కి రంగస్వామి సంతోష
భరితుఁడై నిపుణానగరముఁ గూర్చి

తే.గీ. ఎక్కెఁ బరిణయ మకుట మున్నాసి యగుచుఁ
జేరి సంతటఁ బాండ్య ధాత్రీరమణుఁడు
భక్తి దళుకొత్తఁగా జగత్కర్తఁ గూర్చి
యెదురుగా వచ్చి పదముల కెఱఁగి నంత 176

వ. అయ్యుర్వీశ్వరుండు దేవుని సర్వోపచారంబులన్ బూజించి బ్రహ్మపురోగ ములగు సురలును గాసారాది యోగీశ్వరులును దక్షిణ సమస్తపరివా త్రము దాయంబుల నరయున చెదుర్కొని యథోపచారంబులఁ గావించి యందు సుందరంబును సువర్ణమణి బంధురంబును నగు నొక్క దివ్యమంది రంబునన్ భగవన్నాథుండగు రంగనాథు నునిచి నిత్యంబు కస్తూరికా ఘనసార చందన ప్రముఖ నిఖిల పరిమళ మిళిత సలిల చర్చిత ప్రతోళికా ప్రతి నికేత నాంగణ ప్రయుక్త ముక్తాఫల రంగవల్లికా సంగతంబును వియచ్చరత్కర ప్రకర గరుత్పరంపరా సంపత్సంపాదక వారిస్మితి తోరణ నిబద్ధ ద్వార బంధంబును నుభయపార్శ్వ సంబంధ రంభా స్తంభ సంభార సంభావిత వేదికాప్రదేశంబును రాజమార్గ విరర్గళ సంచర ద్విలాసినీనికర కర రాజీవ విరాజిత రత్న నీరాజన భాజనరాజంబును సముత్తంభిత శాతకుంభ కుంభ సంభాసిత రమ్య హర్మ్య నిర్మిత పతాకాపతాకాయమానను సుధాధౌత సౌధ వీథికా వసత్పురవాసినీ ప్రసర

కరాంభఃపి కింజార ప్రోక్షిత శుభాక్షత ప్రసూన లాజాది సువస్తు విస్తారితంబులై మృదంగ భేరీ తూర్య పటహ కాహళ వీణావేణు పణవాది మంగళ వాద్యసంఘ సంజనిత ఘుమఘుమారావ దంతురిత దిగంతరంబు సంగా పురంధ్రీ సమలంకరించి తదనంతరంబ వరాంగనలకు మంగళోచిత విధు లొనరింప నప్పుడు 177

సీ. వానిత మంగళ స్నానంబు లొనరించి
చారుకౌశేయ వస్త్రములు గట్టి
చేటుగా మృగనాభి తిలకాదులు ఘటించి
సురభి లేపన సముత్కరము నుంచి
సుమమాలికాదులు సొంపు మీఱ ధరించి
గంధ పరాగ ఎద్ గంధ్యాఁ యాని
కనక కుండలహార కంకణాంగద కట
కాది భూషణము లలవరించి

తే.గీ. కలిత [1]చతురిమఁ బరిచారికా జనంబు
చేరి శృంగారమొనర్ప సిరులు దెసంగ
రంగ భర్త్రయుఁ బద్మిని రమణి యుతులు
మెచ్చ నిలిచిరి కల్యాణ వేదికందు 178

తే.గీ. అంత వేదికపై నగ్ని నావహించి
వేద ఘోషము[2]లును యథావిధి నెసంగ
హోమ మొనరించి మాంగల్య యుక్తముగను 179
బ్రాహ్మణాశీర్వచనము లపరింప

---

1 పా. చాతురిమ 2 ము లను

ఏసంచు నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ
పురాణోత్తర ఖండంబు నందలి వింశతితమాధ్యాయంబు భక్తపరాయ
ణుండగు నారాయణుండు నరునకుం జెప్పెను 183

మ ప్రవరారాంబక రాయకానుభవ లీలాభూత సీతాహృతి
ప్రవణప్రోద్ధ దశాస్య వేదకర రోషప్రాప్త సాధుత్వ మా
ర్గ విగాహాద్భుతకృత్య కోలముగ ఖ్యాపాంబ సాహాబ్ధ్యుతి
ప్రవణ ప్రాపిత మోక్షపైభవ సదాశక్త్రాదర ప్రాభవా 184

క సురుచిర పాండ్యకుమారీ
సరస మనోహర ధైర్య సంఘ విహారీ
కరుణా సుధాబ్ధి లహరీ
నిరుపమ భక్తానుసారి నిగమ విహారీ 185

భుజంగ ప్రయాతము
పరాత్ప్రకృతి వ్రాత సంభావనీలా
కరారామ కాంతార కాలాగ్ని కీలా
మహాత్రస్త దావత్రయ ప్రేష్య పాలా
మురారీ హరీ శౌరి గోపాలబాలా 186

గద్య: [1]ఇది శ్రీ రాజగోపాలపృష్ఠ కరుణాకటాక్ష వీక్షణాక్షు పాండిత్య ధురా
నవరతావనీ మండలాఖండ సామ్రాజ్య ధౌరేయ సత్కవిమర్దనాప్రద పటహ
ధణంధణారావ విపరీత పరత్రతియా ఢిల్లిసాధీశ దుందుభిధ్వాన కోలా

1 ము ఇతి

వాల హనుమద్ధ్వజాంక కనక దండీకృత హీరకంఠోత్కృత సందీపిత ప్రతాప కీర్తి ప్రభావ కోలాహల పయః పారావార రాకాసుధాకర సౌందర్యశ్రీల సుమనోమయూ విహారివాహ నాయక ప్రతీతంబైన శ్రీ మహా భార్గవ పురాణంబునందు కుంభోదర ప్రాదుర్భావంబును రాజ మంత్రులు వైష్ణవుల యెడఁ ఔర్వ్యంబు గల్పించుటయుఁ గుంభోదరు తపంబునఁ దన్మహీపతికి నారాయణుండు ప్రసన్నుండగుటయు భగవద్గుణాను కీర్తనంబున శ్రీ వివాహంబునఁ గుంభోదరుండు రామాయణ శ్రవణం బునం జేసి దశరథుండనఁ గోవెంబువెట్టి హింసించినపో మార్గమధ్యంబున వాసుదేవుండతనికిఁ బ్రసన్నుండై పుష్పకంబునఁ గుంభోదరు నిడికొని పరమపదంబు గూర్చి చనుటయుఁ బద్మిని కన్యకోత్పత్తియు బ్రహ్మేం ద్రాది సురాప్సరోగణంబులు లక్ష్మిం గీర్తించుటయుఁ బాండ్యరాజు శ్రీరంగంబున కరుగునెడ సరసీమధ్యంబున నందలి కమలాకరంబున రమాంశ జాతయగు కన్నియం గొని పుత్రీభావంబునఁ దన భార్యకొసం గుటయుఁ బద్మిని కన్యకా వర్ధనంబును శ్రీరంగ భర్త విరామహేంద్ర రాహారయోగి ప్రభృతిగణ సహితుండగుచుఁ బాండ్యనగరంబున కేతెంచి పద్మినీ కన్యకం బాణిగ్రహణంబు చేయుటయు ననెడు నేతత్కథలుం గల చతుర్థాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## పంచమాశ్వాసము

క. శ్రీకాంతానయనోత్పల
రాకా హిమధామ కోటిరవిసుకధామా
ప్రాకట వాగిన గిరి శా
కీకరుణాకర సురపురి గోపాలా 1

వ. ఆ సకలగుణనికరప్రశస్తాధురంధరుం డగు నయుండు వివిధ విబుధోపలాలన
పరాయణుండగు నారాయణుం గూర్చి యిట్లనియె 2

క. నారాయణ నిఖిల జగ
త్కారణ కారణ దయామృత పయోనిధి సం
సారాంబుధి తారణ ని
కై రచి సాష్టాంగ వినతిఁ గావింతు నినున్ 3

క. ని వలన నేను వింటిని
శ్రీ వైష్ణవ భక్తి రతుఁడు చిరపుణ్య యశో
శ్రీపతి యగు కులశేఖర
భూపాలకు చరిత సకలమును విదితముగాన్ 4

తే గీ అఖిల పాతక సముదాయ హరము నగుచు
మహిత కల్యాణ విభవ సంపాది యగుచు
దివ్యమైనట్టి పద్మినీదేవి కథయు
వింటి మునిలోక సంప్రీతి విస్తరిల్ల 5

ఉ ఏ యెడ నె విధంబునను నే సమయంబుల సంతతాద్భుత
శ్రీ యుతచర్యులై యవతరించిరి యోగివరేణ్యు లాదినా
రాయణ పాదపంకజ పరాయణులై భగవత్ప్రదాప్తి సం
ధాయకులై మహాత్మ్మ లిల దన్మహితాత్మ్యముఁ దెల్పవె తగన్ 6

## మునివాహన జననము

వ అను వరుం గూర్చి సమాదరంబుగా నారాయణ మౌని యిట్లనియె 7

క తమసా నదికిని దక్షిణ
మమును రమణీయమై భవాన్ప్రద మగు శ్రీ
రమునందు సర్వసంప
త్సమృద్ధిఁ దనరారి యఖిల జనమాన్యంబై 8

క మగరాం కేలిమిద్దెంల
బగరచ్పు దారువులఁ గనక పంకజ రాగా
ధ్య గృహ నివహముల నిచురా
నగరము చెన్నొందు నశ్రనగర నిభంబై 9

---

1 మూ మహాత్ము

ఆ వె. పరమ పావనంబు భవ్యావసనమును
దివ్య ధామనంబు సేవ్య మగుచు
నవ్య సౌరభంబు నవ్యయ పదమై
శ్వ్రీ దనరు నన్నదీతటమున 13

సీ. అందు కార్తిక మాసమందలి రోహిణీ
నక్షత్రయుక్తమై పెయ్యనుగాంచు
శుభదినంబందుల సురుచిర లీలతో
హృదయంబు నందు రమేశు దలచి
మొనసి శ్రీ వత్సాంకమున వైష్ణవాంభోధి
చంద్రమ స్ఫూర్తిచే సంభవించి
అన్న ప్రభృతి రంగశౌరి పాదాంబుజ
ధ్యాన యోగామృత[1]పాయి యగుచు

తే గీ. దనుదినంబును వర్ధమానాంగుడగుచు
వరుసతో రోదనాసన వర్తనంబు
చేసి సహజ విశేషుడై చెలగె నతడు
[2]సకల జగములు విస్మయం బందుచుండ 14

---

1 మూ. పాని
2 మూ. జపములు

తే.గీ. వెరస దేహాత్మలకును విభిన్నుఁడయును
శేషశాయికి నగుతన శేషతయును
నెఱిఁగి యధ్యాత్మ విషయాంతరైన మెంమి వాఁ
డుంద వైకుంఠ కృతి యక్కండు నగుచు 16

**మునివాఁడు కావేరీతటమున గానంబు చేయుట**

సీ. మొనసి రంగక్షేత్రమున భగవన్మూర్తి
గా మదిఁ దెలిసి యుద్ధామ రుచిఁ
జేసి యాతండు దర్క్షేత్రంబుఁ జేరక దీ
ప్యన్మంద వాటపీ వాటిఁగలుగు
నట్టి కావేరి యం దాహూతిగా నవ
గాహనం బొనరించి కౌతుకమునఁ
దన్నది దక్షిణ తటమున రమ్యప్ర
దేశంబు నందు వర్తిల్లి దాను

తే.గీ. కొలుచు శ్రీరంగమున కట్టెదురు నగుచు
మఱియు హృదయ పయోజాల మధ్యసీమ
భగవదంఘ్రి సరోజముల్ పాదుకొలిప
యుమదినంబును దర్శరుఁ డగుచు నంత 16

తే.గీ. క్షితివి ధ్యానంబుఁజేయుచుఁ గీర్తనంబు
సేయుచును భక్తిచే నమస్కృతులు చేయు
చును ననేకంబుగా మహాస్తుతులు చేయు
చును బ్రమోదయుతుండయి దనరి యతఁడు 17

తే.గీ. మతియును సమస్త జంతువుల్[1] మాదిసూటను
దన్మయములుగఁ జేష్టలు దక్కియుండె
నమ్మహాగాయకుండు చేయునట్టి దివ్య
పరమ భగవద్విషయగాన వైభవమున 24

ఉ. కృతయుగమందు ధ్యానమునఁ ద్రేతను యజ్ఞవిధానలీల సం
తతము సమర్చనా విధిని ద్వాపరమందు నరుండు గాంచు నా
యతమతితోడ నే ఫలము నా ఫలమున్ గనుచుండు నార్త సం
గతమగు భక్తిలోఁ గలియుగంబున శ్రీహరికీర్తనంబునన్ 25

మ. అని యా యర్థము సంస్మరించి మదిలో నా గాయకాగ్రేసరుం
డనుమోదంబున వల్లకిం గొనుచు దివ్యంబైన గానంబుచే
వనజాక్షునిఁ దారుచుం బొగడుచున్ వర్తించి యా రీతి న
త్యనురక్తిన్ హరినామకీర్తన పరుండై యుండె నశ్రాంతమున్ 26

## రంగభర్త మునివాహనుని గానమును లక్ష్మీదేవికిఁ దెలిపి యాతని గానమును బ్రశంసించుట

శా. ఆ రీతిన్ మధుర స్వరాంచితము దివ్యంబున్ మహాశ్చర్యదం
బారూఢ ప్రవణానురంజితమునౌ సద్గాన మాలించి యా
శ్రీరంగక్షితిభర్త హర్షపులకశ్రేణీ పరీతాంగుఁడున్
సారామోద భరార్ద్ర మానసమయానందుండునై యెంతయున్ 27

తే.గీ. తన సమీపంబునందు సవినయముగను
జేరి సరసవిలాస విశేషగుణను
జెలఁగు శ్రీదేవి మక్కువ వీక్షించి యిట్లు
లనియె నాశ్రితవత్సలుఁ డగుచు శౌరి 28

---

1 మూ. మానసులు

నీవు నిర్మలమూర్తి నిశ్చలస్థితిని ధా
నిలు యోగదృష్టి నీక్షించువాఁడు
భవదీయ దివ్య శోభనగాన పరములు
సొంపుగాఁ బాడుచు సొక్కువాఁడు
ఎంచి నీ యనంత కల్యాణ గుణములు
తివిరి యేవేళ నుతించువాఁడు

తే.గీ. నిరతగాథలు పాడఁ వినినవాఁడు
శమదమాదులచేత జెలంగువాఁడు
నీ కృపాదృష్టి పాత్రుఁడై నెఱయువాఁడు
నితఁడు సామాన్యుఁడె జగదీశ్వరేశ 93

తే.గీ. అధిప మీ ప్రియగాయకుండైన నితని
నటఁట బాహ్యప్రదేశమునందు నునుచు
టుచితమె మీ సమీపమందుండు పటులఁ
జేయఁగాఁ దగు మీ దయార్ద్ర దనర్ప 94

రంగభర్త లక్ష్మీదేవి పలుకులు విని మునివాహని
దోర్త్తర దీర్ఘబాహుఁడను సారంగముని నంపుట

క. అని యాగతి వినయోక్తుల
వనజాలయ విన్నవింప వనజాక్షుఁడు దా
విని సంతుష్టాంతరుఁడై
తన మనమున నిటుల జేయు తలంపున నంతన్ 95

తే.గీ. లోకసారంగ విఖ్యాతు లోకవిదితు
ననఘుఁ దీక్షాపరతఁ గాంచుమని మహాత్ముఁ
గాంచి యా రంగనాథుఁడు ప్రీతితోడ
నాతనికి మృదుమూర్తుండు నానతిచ్చె 96

సీ. అనఘు కావేరీ మహాతీర్థ సంస్థితుఁ
బరమ పవిత్రు మహాప్రీతి భూతు
యోగివర్యుని నిత్య యోగి సంసేవితు
గాయకోత్తము విఖ్యాత చరితుఁ
గరుణాపయోనిధి ఘనుని సన్మద్భక్తు
నిగమాంతవిజ్ఞాను నిర్మలాత్ము
[1]వినయవిముఖు మహావిర్భవ ప్రాభవు
భక్తివైరాగ్య బోధ ప్రచారు

తే.గీ. నామహాముని నీవు స్కంధాధిరూఢు
గాఁగఁ గావించుకొని నీవు గారవమునఁ
జేరఁ దోకొని రమ్ము యర్థాని వగుచుఁ
గరము నా కతిసంతోషకరము గాఁగ 97

## సారంగముని మునివాహనుఁ దన స్కంధమున నిడుకొని తెచ్చుటచే మునివాహనుఁడను పేరు కలుగుట

వ. అని యివ్విధంబున జగదీశ్వరుండగు భగవంతుండాజ్ఞాపింప నమ్మ
హాత్ముండు సంప్రవృత్తతనూరుహుండగుచు నేత్రాద్భవజలంబుల నించిరే నాను
బ్రహ్మేంద్ర బ్రహ్మాదులకేనిఁ గలుగుట దుర్లభంబు గాన నమ్మహాయోగి

1 మూ. వినయవము

భాగ్యంబు నత్యాశ్చర్యంబు గదా యని పొంగు పృథ్వింబుగా నెన్నికొని పల్కుమ న స్మృతి సమితంబున కతిరయంబునఁ బని విధ్యుక్తంబుగా నతనిం బూజించి వాక్పుచనంబు విన్నవించి నిజభువాశోహాలంబునందు భీతుం డగుచు సింగని పలుకు నగ్గాయకు బలాత్కారంబునంజేసి గ్రహించి స్కంధంబునం దిడుకొని సారంగమునిపుంగవుండు రంగభర్త సన్నిధిం గొనివచ్చిన 38

తే గీ అని మొదలుకొని మునివాహనుఁ డనెడుపేరఁ
దనరి గాయకుఁ డంత నుదాత్త భక్తి
రంగవిభుఁ గాంచి ప్రణమిల్లి రమ్యమతిని
హర్ష రోమాంచ కంచుకితాంగుఁ డగుచు 39

మునివాహనుఁడు హరిసకలావయవ మనన తత్పరుఁ డగుట

క కర బద్ధాంజలి పుటుఁడై
పరమానంద ప్రవాహ భరితాత్మకుఁడై
యురుభక్తి నతఁడు దామో
దరు సకలావయవ మనన తత్పరుఁ డగుచున్ 40

క వరుస మనో భృంగము దేఁ
బరమార్థ విశేషసాంద్ర పరిమళయుతమై
నిరతము మనోహరంబగు
హరి చరణాంబుజ మరంద మాస్వాదించెన్ 41

తే.గీ. వివిధ సద్రత్న ఖచితంబు విపులకటక
యుగళ మన్వేషణముఁ జేయ నొప్పుఁ బూడ్కి
యందు సురరాజమణి మాడ్కి నలరుచుండు
సంకదంబ్రనగంధిత భ్రమర మనఁగ 42

ఉ. పాయక వాయుపూర్వము విభాగం హూర్ణతమైన కాంతి జం
పా యుగళంబు సర్వంబక కారణమున్ స్ఫురియించి భక్తి పెం
పై యుబారు చిత్రము నిరంతర వైభవ సౌఖ్య రూప సం
ధాయక మౌచు సంతత ముదార సమాధిగ మందు నెక్కుడై 43

క. గరుడ స్కంధ విభూషణ
మురుతర మూర్త్యయంబు నొప్పుటయం దు
త్కరముగ నిల్పిన హృదయము
చిదానందామృతాంబునిధి సుఖియించున్ 44

తే.గీ. భవ్య పుటపాళ భర్మ విభ్రాజమాన
మగుచు భక్తితమోహరం బగుచుఁ గోటి
భాస్కరద్యుతి యైన యంబరము నందు
దృష్టి గావించ మించె నా ధీవరుండు 45

క. గురుతర కాంచీదామ
స్ఫురిత కటి తటమునందుఁ జ నిచిన వ్యా
ప్తిరద చిత్తము మూర్తింగాని
పరిపూర్ణ సుఖాప్తి నందుఁ బ్రాపించె నొగిన్ 46

తే.గీ. అద్భుతంబై నపరమగు నట్టి చరిత
మొగ్గడించెద నీకు సమున్నతముగ
నవని సహాహితాత్ముడ వగుచు వినుమ
హేమకూట నరాహ్వయ హోనపర్వ 64

మ. అతులాలాప శుకీ పికీ సముదయోద్యానచ్ఛటం బొల్పి సం
తతమున్ నిర్మల నీరమున్ గలిగి మత్తక్రౌంచ శ్రేణి శ్రద్ధా సమం
చితమై యొక్కెడ నొక్కఁ గ్రుంకిడినతో శీతాబ్జముం గావించుచున్
క్షితి హేమాహ్వగ మింపుఁ బద్మకుముద శ్రీగంధ విస్ఫూర్తిమై 65

చ. అమల పయోజగంధ సముపార్జిత మత్త మిళింద బృంద రా
వము లెంతయుఁ గృతి సన్నిధి వశస్థితిఁ జాడు సదా వనేందిరా
సముదయ కల్పవృంద మవఁ దారతరోన్నతి మించి స్వర్గ ది
గ్భ్రమము కొసంగుఁ గాంచు జనపాళిక నా నది సారనీరమై 66

క. రతి హరిదర్పణమున వి
స్ఫురణం బగు మేనఁ బొందు వృత తలనంగాఁ
బొరి నద్భుత సముదయముల
వరయన్ హేమాహ్వగా మహానది జగతిన్ 67

తే.గీ. అన్నదీ తీరమున తపోమూర్తిఁ గాంచు
దోషమండల మతులిత శోభనంబు
నిర్జరాది సమాశ్రయ యతుల సుఖము
దివ్యదేవోద్యానంబు ధన్యతరము 68

శా. ఆ రాజ్యంబున నందు మండన సమాఖ్యం బొల్చు గ్రామంబు భా
శ్రీ రత్నోజ్జ్వల భూషణంబు మణి సందీప్తప్రభా స్వర్ణ సౌ
ధారామ ప్రచయాభిరామము రతీశాత్మద్విదాపాత భా
వోరుస్త్రీరయు సర్వభాగ్య మహిమం బుత్కృష్ట తేజస్ఫురిన్ 59

సీ. ఆ పురంబున నుండు నవనీసురోత్తము
లందఱు హరిపరాయణులు నిగమ
పారంగతులు దివ్యభావులు సకలశా
స్త్రవిశారదులు సదా సత్యశీలు
రానందవార్ధి మగ్నాంతరంగులు సత్కో
ర్కరగుణుల్ సమలోష్ట కాంచనాశ్మ
మతులు సంతత శాంతియుతులు తృణీకృత
బ్రహ్మలోకాదిక భాగ్య రతులు

తే.గీ. సతత హరిచిహ్న చిహ్నితుల్ వితత యశులు
తపన తేజులు నిజవర్ణధర్మ నిరతు
లతిథి భాగవతార్చనాయత్త చిత్తు
లఖిల సమదర్శనులు వినయాభిరతులు 60

క. కలియుగ నందును వర్తిలు
కలి కల్మష నాశ నిపుణ గమలాధిపున్
లలితమతి భక్తి గొని ని
ర్మలురై భజియింతు రెపుడు సత్యస్ఫూర్తిన్ 61

తే. గీ. హరి సమర్పిత యత్నుఁడై యలవరించు
చును జితేంద్రియుండగుట నుత్సుకత మించి
ధర్మమున ముక్తి నిచ్చగాఁ దనరు వారి
లో గొలందఁడు మహాత్ముఁ డనూన గుణుఁడు 62

క. నిగమాంతజ్ఞాన పరుం
డగణిత గుణసంపదాఢ్యుఁ డమలాత్మకుఁడౌ
జగతీసురవర్యున కిం
పుగ పత్నియు ధర్మవతి పుణ్యమతిన్ 63

## విప్రనారాయణ జననము

తే. గీ. సాధ్వి యెలమి మార్గశీర్షమున జ్యేష్ఠ
యందు వృశ్చికలగ్నమున శుభమగు దివమునఁ
గాంచె వనమాలికాంశ సమంచితాత్ము
భవ్య గుణయుతుఁ దనయు సంభావ్య చరితు 64

తే. గీ. సూతకాంతమ్మునందు విఖ్యాతిఁ గాఁగ
నవని నారాయణుం డను నాహ్వయంబు
సుతున కొసరించె జనకుండు సుస్థిరముగ
నిర్మలానంద చిత్తుఁడై నియతి మించి 65

వ. అంత 66

క. పంచమ సంవత్సరమున
నంచిత మతియైన సుతున కత్యుత్సవమున్
మించగ నుపనయనము గా
వించెన్ జనకుండు విప్ర వితరము లెస్సన్ 67

## విప్రనారాయణుండు విరాగియగుట

క. నారాయణాభిధానం
బై రంజిలు నిమ్మహాత్ముం డఖిలాత్మకుండై
గౌరి యకారణ కరుణన్
గారవమున నధికభక్తి గం౼ం దగుచున్ ౬౮

సీ. ఘనమూలప్రౌ హేతుకంబు దుస్తర మగు
సంసారమందు నసారమైన
దృష్టి గావించి తాని పదార్థవింధంబు
విషము నిజముగాం బొంక సీమ
[1]మోహము దారేషణ పుత్రైషణ ధనేష
ణాదులౌ విషయంబు లన్నియు విడి
చిదచిదీశ్వర తత్త్వ నిశ్చిత్తు పంక్తాంశి
శౌరిం బారతంత్ర్య భక్తి గాంచి

తే.గీ. యంతరింద్రియ బాహ్యేంద్రియములం నెల్ల
గెలిచి వైరాగ్య బోధ సంసిద్ధిం దగుచు
నిత్య నిరుపాధిక సుభక్తి నియతి నుండె
పద్మాక్ష పరాయణుండు నారాయణుండు ౬౯

## విప్రనారాయణుండు శ్రీరంగమునకు వచ్చి రంగేశుని సేవించుచుండుట

తే.గీ. అంత నా భూమిసుర వర్యుం డతం భక్తి
భావవంతుం డగుచు దయాసార జలధి
యైన శ్రీరంగనాయకు నధికతేజ
క్షేత్రమున కేంగుదెంచి యభిమతిని 70

---

1 మూ మొనపి

మ. కనిరాప్ విప్రవరుండు కాంచనమణి ప్రాకార సద్గోపుర
స్వన దుద్యాసి పతాకికా నికర భాస్వన్మందిరోపేత స
హ్యనగోద్యాన నదీ పరీత విలస ప్రాసాద వైకుంఠ దీ
ప్ర విరాజిత ప్రతిభానుషంగ విభవాభంగంబు శ్రీరంగమున్ 71

తే.గీ. రంగభర్తను గాంచి యుత్తుంగ భక్తి
నహరహం బమ్మహాత్ము సమర్చ సేయు
చెప్పు భూరంబు లందు దయారసంబుఁ
గలిగి యాక్షేత్రమునను వర్తిలి యతండు 72

క. నిరతంబు భక్తి రంగే
శ్వర భక్తారాధనంబు సలుపుచు సత్కా
ర్యం బను దత్కైంకర్యముఁ
గలుపుచు నచ్యుతపదానుగత చిత్తుండై 73

విప్రనారాయణుఁడు భక్తాంఘ్రిరేణువను పేరందుట

క. భగవద్భక్త [1]గృహంబులఁ
దగు మధుకర వృత్తిఁ గొనుచు ధరణిస్థలి నా
నిగమసురవర్యుఁడు సొం
పగు మతి భక్తాంఘ్రిరేణు వను పేరొందెన్ 74

సీ. అల గోవింద భక్తాంఘ్రిరేణు సమాఖ్య
భాసిలునట్టి యా భూసురుండు
రమణీయముగను శ్రీరంగేశ్వరునకు స
మస్తకైంకర్యంబులందు నెట్టి

1 మూ. గృహంబున

యుక్తమై శ్రేష్ఠమై యింపొందఁ బెంపొందఁ
బంచమాంతరము విరాజించి హరికి
నిరవొందు మాలికా కరణమై యుక్తంబు
శ్రేష్ఠంబునని తనహృదయమందుఁ

తే.గీ. ఆలు నిశ్చయ మొనరించి సంతసించి
యయ్యుపాయముఁ జింతించి హరి గుణించి
వైవిధ్యంబు నలంగాఁ బెంచి పుష్ప
రించి [1]యచ్చోటు పెడల నెంచె యంత 76

క. అప్పటికి బర్హిమస్థలి
నచ్చుగ బ్రమథనాథ మహి ద్వీపంబున్
మచ్చుట యుబనది యచటకిఁ
తెచ్చిర సేవించి ప్రీతచిత్తం డగుచున్ 76

భక్తాంఘ్రి రేణువు తులసీమాలంచే రంగేశు నలంకరించుట

క. నానా వృక్షసమన్విత
మై నిరుపమ మగుచు రమ్యమైన వనంబున్
హాసీశ్వరుఁ డార్యముఁడ
దా నాలోకంబు చేసి ధర్మాత్మకమతిన్ 77

చ. నిరతము నా వనంబునకు నీరము నాటిగ గట్టు కర్మముల్
గలుపుచ దాని బెంచి సవిలాసత నందోక పర్ణశాల వి
స్ఫురణ రచించి గౌరిపదపూర్ణ మనంబున పెంచి యచ్చటన్
స్థిరతర భక్తి గైకొని మహా సమాధి సంపదాప్తియై 78

1 మూ. యచ్చోట

తే. గీ. ప్రొద్దుకడ మేలుకొని విప్రపుంగవుండు
మొనసి విధ్యుక్తముగ స్నానమును రచించి
మంత్రరాజస్మరణము నెమ్మనఁ జేసి
యవలఁ దులసీవనంబున కరుగుదెంచి 79

క. హరి వల్లభయగుఁ దులసిని
పరిపూర్ణ నిజాత్మ భక్తి భావింపుచు ని
ర్భరముగ సంస్తుతుంచే
నరయం గొనియాడి వినయమానసుండై 80

సీ. ఆయాధి బ్రహ్మేంద్రియమునకు హెచ్చిన
దాపత్రయాదికాలోప మణఁచు
నుత్తమాంగమున సమున్నతిఁ దాల్చినఁ
బంచమహాపాతకములఁ బాపు
బ్రహ్మ భాగమున భూషణముగా ధరియించ
మనుదినం బధిక భాగ్యంబు గలుగు
నింతిరేఁ పదారవింద తీర్థయుతంబు
గా గ్రహియింప మోక్షము నొసంగు

తే. గీ. దీనిఁ దన్నె వరేణి భక్తిని దలంచి
లేని వారలు కతుల సంతానభూతి
చేయఁగాలేదె యీ తులసీమతల్లి
యనుచుఁ గొనియాడి విప్రవరాయణుండు 81

ఆ.వె. ఏప్పదివ్య సౌరభంబు గొను మఱు
లంబు దులసికాదళ[1]ప్రతానము
సంగ్రహించి పావిత్ర్యమందు పట దళా
ద్యంతరంబులఁ జేర్చి యంచుమతిని 82

ఉ. చందన పారిజాత హరిచందన [2]నీప కదంబ కేతకీ
కుంద నమేరు నాగ తరు కోటుల పాటల కోవిదార మా
కంద కురంట కాంచనములు ఆది తరుపు పూలు గోసి మె
లంచగ మంత్రరాజము నిజాత్మఁ దలంచె ధరామరుం డిలన్ 83

తే.గీ. తులసికాపుష్ప సంయుతోత్తమ విశాల
మాలిక నొనర్చి దాని సమంచితముగఁ
జెన్నెయం దిడుకొని రంగపతు సమీప
మునకు నేతెంచె విప్రపుంగవుండు 84

సీ. ఎద పయోజమున వాసిల్లి శృంగమరీచిఁ
ఎన్నగునయ్యఁ బైకొన్నవాని
వాత్స కటాక్షామృతాళిఁ దాపత్రయా
శిఖాగ్ని నాయింపఁ జేయువాని
తలసుమ్ము పెన్నెల శ్రీ భూమినయన చ
కోరమ్ములకుఁ బ్రీతిఁ గూర్చువాని
హ్రాశిత హృన్మయూరానందమునకు నీ
లాంబుదంబగు శరీరంబువాని

1 మూ. ప్రతతంబు
2 మూ. నిద

క. దారుమలియుఁ నమ్మనివరుఁ
విరయఁగ ని లాంతరాత్ముఁడగు శౌరియెడన్
బరర్ సేఁసు చిట్టు
విరుపాధిక భవరాప్తి నియతిఁ దనరుటన్ ౯౮

## భక్తాంఘ్రిరేణువు వైరాగ్యమును గూర్చి లక్ష్మీనారాయణుల సంవాదము

సీ. అట భగవంతుఁడైనట్టి శ్రీరంగనా
యకుఁడు దర్భవటే నధికభక్తుఁ
గాంచి యమ్మని విరాగత్వ ప్రభృతి గుణ
మ్ముల ప్రియ కెఱిఁగింప బంధురదన
యా గుణంబుల విని యతి యంబుగు విస్మ
యమునొంది తనదు నాయకునిఁ గూర్చి
యీ దృఢం బైనట్టి యమ్మునీశ్వరునకు
భోగంబు లందున బుద్ధి పోదను

తే.గీ. లేదా యని ప్రశ్నఁ జేయు నా లేమ మోముఁ
జూచి చిఱునవ్వు దళుకొత్తి సూక్తిఁ జేసె
పలికె జగదీశ్వరుండు సుప్రభుండు
శ్రీయుతగుణుండు శౌరి నారాయణుండు ౯౯

చ. అనయము విప్రుఁ డెందును గుణాఢ్యుఁడు మత్ప్రియభక్తుఁ డైన యీ
యనఘుని తెంపుతోఁ విషయయందు మనోరథము లే
దనుపగ నెను వీని విషయాభిరతాత్మకుఁ జేయువాఁడనై
పను దళుకొత్తఁగాఁ దగదు నారగుణాయ నయంబుగాన్ 100

వ. అందు 109

సీ. ఆరూఢతర నిర్మలాంతఃకరణమున
శ్రీధర ధ్యానంబు సేయువాని
సరసమౌ వాక్కున సరసిజాక్షుని నామ
సంకీర్తనంబులు సలుపువాని
భక్తి తత్పరమైన భావంబు గొని కాయ
మునను నచ్యుత సేవ గలుపువాని
హరి మాలికా తిరువార్షంబు దన కర్ణ
ములు నిత్యము నొనర్చు చలయువాని

తే.గీ. పద్ధతి నితాంతనైక భాగవత వ
ర్యపదారాధనాసక్తత నుండువాని
విప్రకులవర్యుఁ బరమపవిత్రచర్యు
వాక్య నారాయణాఖ్యు నయ్యతివ గాంచె 110

## దేవదేవి తనయగ్రజతోఁ బందెము వైచుట

ఆ.వె. భగినిఁ గూర్చి యిట్లు పలికె విలాసిని
యగుచుఁ బంకజాక్షి యన్మదీయ
రూపరేఖఁ జూచి రాధిగా నెవరేని
మోహపడరె హృదయములు గరంగ 111

ఉ. ఈ ముని రాజశేఖరుఁ డహీనతపోనిధి సంస్థితాత్ముఁ డు
ద్దామగుణుం డకాముకుఁ డుదారకుఁ డింద్రియ నిగ్రహంబునందు వి
ద్యామహితాత్ముఁ డార్యజనతానుత పద్ధ చరిత్రశాలి య
క్కి మహిళావరాంఘ్రి సరసీజ మరంద మిళింద మున్నతిన్ 112

ఉ అప్పుడు రంగభర్త కరుణాంబుధి దేవకిభావమంద మా
కప్పురగంధి పుష్పమునఁ గన్పడి యో చెలి యంతలోనె నీ
యిప్పుడ యీ ప్రతిజ్ఞ ఫలియింపఁగఁ గల్గును సంశయంబు లే
దెప్పుడు యత్న నిందు వసియింపుము ప్రీతి వహించి చెప్పినన్ 126

క అంతమున మేలుకొని య
య్యింతియు నానాత్రి శౌరి హిత సూక్తులకున్
సంతసిలుచుఁ గైకొని కుం
భాంతరమున దాఁచియున్న యాభరణంబుల్ 127

క మిసమిసమను సొగసులు గల
యనర్ఘ్యమగు పతకము సుమమాలంబడు మిసమిస్
బిసరుహలోచన యవయవ
విసరంబునకు భూషణములు వెస నమరించెన్ 128

సీ కంతుని బాణసంగతి మీఱు పన్నుల
    కరకరల బెనుచిత్రములు గలుప
శరదిందుచంద్రికా సన్నిభమందహా
    సంబు ప్రాణేశుకు మోదంబు గూర్పఁ
బాదంబు మెట్టిన పర్యంకపుఁ దావిగా
    నకరదంబంబు లెక్కొనఁ దొరఁగ
[1]మధురతఁ దిల్కెడు పాటల కాలికా
    సమితికి వింతగాఁ జదువుఁ జెప్పఁ

---

1 మూ. మధురంబు

తే.గీ. అంత దైవవశమున నుదాత్తుఁడగుచు
నిదురమేల్కాంచి వాకిట నిలిచి సాంద్ర
కందరంబులఁ జీఁకటి గ్రమ్మికొనఁగ
నఖిల దిక్కులు బరికించు యవనిసురుఁడు 183

ఉ. అంతట వానచేఁ దడిసి యార్తి గడంగుచు వర్షశాలికా
ప్రాంత ధరాతలంబునను రంభలు రావిమహీజ మూల మ
త్యంతము తావుకొన్న కమలాయతలోచనఁ గాంచి [1]తాపిత
స్వాంతముఁ జేసె లోకులకుఁ బయ్యెదఁ దోఁకొని వచ్చె నేడుగన్ 184

దేవదేవికి ధర్మాంబ్రమిరేఖవు పలుఁదగుట

సీ. అట ము! ఎదబున కరుగుదెంచిన యప్పు
డానిపీరత్నంబు మాని చేరి
చలి నెపంబున మునిచంద్రు పాదంబుల
పట్టినే యొక యింత పట్టుఁజేసి
యంసిలా రనుచుఁ దదంఘ్రులు దన కౌర
నిడుకొని యొత్తుచుఁగదు నివురుచు
బ్రాహ్మణోత్తము నాదు పయ్యెద దడిసిన
దని ఆడియకరము నందుఁజేర్చి

తే.గీ. హావభావాభినయమందు హాసరుచులు
గులుకఁ జిలిబిలి బిల్లుల పలుకుఁ దేనెఁ
చిలుక సొగసులు దొలఁక నా కిలికి విప్ర
పుంగవుని మానసంబు గరంగఁ జేయ 185

---

1 మూ. తాపిత

ధన మిప్పుడు జాల కిట మా
తినయను గింబార రతి నుదారరుచి వెలుగన్
జనదు పయిఁడిమ్ము లేకు
వ్ర నిపుడు వేగమె నికేలనం వెదల మొగిన్, 141

క. అని యిట్లాడిన దాగ్రహ
మును వెదలి ద్విజాండు చింతవారమిన మునితా
ఁబను దాహ్య వేదికాంతర
మున నధివసియించె దైన్యమున నా రాత్రిన్. 142

సీ. ఆ సమయంబున నఖిల లోకాధ్యక్షుఁ
డును భక్తవత్సలుండును దయాళుఁ
డును నగు రంగేశుఁ డనుమోదమున జగ
జ్జనని యో కవ ప్రియసతినిఁ జూచి
నవ్వెన నక్తతి నాథుని హసనంబుఁ
గాంచి యిట్లనియె నా కమల పాణి
స్వామి యూరకయ హాసముఁ జేయఁ బనియేమి
వివరింపు మనిన నా విభుఁడు పల్కె.

తే.గీ. సాంద్ర విజ్ఞాన పరుఁడు జితేంద్రియుండు
భవ్య వైరాగ్య పరుఁడు మద్భక్తుఁడైన
యిట్టి విప్రాంఘ్రిరేణుఁడ యొదవ సర్వ
దీయమాయా వశంగత స్థితిఁ గలంగె 143

క. నెలఁతాతి కాంచి యపుడుం
వలఁగొని మోహమున దాని వాకిలి దైటన్
దలఁచిన చేటిక మిడన్
నెలకొని యున్నాఁడు నేడు నిరతగంధీ 144

క. ఆతనిఁ గనుంగొని నవ్వితి
నతిలా యపుడేను నిన్ను నమ్ముని గను మం
చితమతి నని వాంఛూక్తులఁ
ఇతి చెప్పిన విని ప్రమోద భరితాంతరయై 146

తే.గీ. వారకాంతా గృహాంగణ వాటి యందు
గాలి విరహార్తి దీనుఁడై యున్నవాని
మునివరునిఁ గాంచి యా భగవ్వనిని గరుణఁ
బ్రాంజలి యొనర్చి హరిఁగూర్చి పలికె నిటుల 148

సీ. తనయుండు భవదీయమైన సత్కర్మంబుఁ
జేయు చుండెడి ధర్మశీల దనయు
విజితేంద్రియు మునీంద్రు పితరాగుని ఘను
నేకాంత భక్తి దాస్యైక భోగి
కావు పాదపద్మసుధారసాస్వాద
దాయత్త చిత్తుఁడై యలరు నిట్టి
మానురోత్తమమౌని కామునకుఁ జేయ నేరికిఁ
బంకరుహాక్ష కృపాపయోధి

ఆ వె. భక్తవరద మున్ను బల్కి యుంటివి నాకు
వాక్యమునను విప్రవర్య నిటుల
జేసితివి దయంబు జేకను నా విధి
కర్హుఁ డగుచు నిమ్మహామునీందు 147

క. ఏ మాయా వరధిఁ గడవ
నే మహితాత్ములగు యోగు లెవరు దగుదు రీ
రామరసకాండము లిత
కామాదుల నైక శక్తి గలిగిన వారే 148

ఉ. తావక పాదనావఁ గొని తథ్యముగా భవదాశ్రితుల్ సదా
భావిత మైన మాయ యను వార్ధిఁ దరింతురు గాన సర్వర
క్షావహ నీదు భక్తు వరకల్పకు నీ మునివర్యుఁ బ్రేమచేఁ
బ్రోవుము దేవదేవ సురపూజిత విగ్రహ కల్మషాపహా 149

క. అని పలికెడు రమయం దా
వనజ దళాక్షుండు లోకభర్త ప్రియముఁ జే
సి నిరుపమోక్తి వచించెన్
ఘనతర సంతోష వార్ధి గడలు కొనంగన్ 150

శ్రీరంగవిభుఁడు నారాయణమునికొఱకు దేవదేవికి రత్నదర్శనం బిచ్చుట

ఆ వె. అకట నేను జేయునట్టి దంతయును వి
లాసమునకుఁ గాఁ దలంప వలయు
మహిమ మదేకభోగ్య మద్భక్తుఁడగు నిమ్మ
హాత్ముఁ బొంద దగము నవ్వుదేవి 151

క. అనుదినము నీకొసర్చిన
ఘనతులసీ కుసుమ మాలికా కైంకర్యం
బున నే సంతుష్టుఁడ నై
తిని సత్యంబుగాఁగ ధీరవరేణ్యా! 167

ఆ.వె. నీ కభీష్ట మెద్ది నేఁడు తద్వరమును
వేఁడు మిత్తు నీకు విప్రవర!
యనిన రంగపురాధీశు వాక్యంబు
విని నితాంత హర్షమున నతఁడు 168

భక్తాంఘ్రిరేణువు ప్రాబోధకీ గీతములతో వారిని స్తుతించుట

తే.గీ. శ్రీవధూనాథ భక్తాంఘ్రిరేణు వనెడు
పేరు సత్యంబు సేయుము ప్రేమ నాకు
నిడియె పరమగు వరమగు నింతకన్న
నన్యమును వేఁడ నేనని యాతఁ డనిన 169

సీ. ఆ దేవుఁ డౌఁగాక యని తదీప్సిత వరం
బొసఁగిన యంత నయ్యోగివరుఁడు
భక్తాంఘ్రిరేణుండు పరితుష్ట చిత్తుఁడై
లోకామృతపదంబునై యతిశయమునఁ
దెలుఁగుఁ[1] బ్రాబోధకీ శ్రీమాలికను పేరఁ
దనరు దివ్యప్రబంధము లనుపమ
వేదాన్వయ ప్రతిపాదకంబులు గాఁగఁ
గడు మనోహరములుగా నొనర్చి

---

1 తిరుప్పళ్ళి యెళుచ్చి, తిరుమాలై

పంచచామరము

రమా ముఖాంబుజాత మిత్ర రామణీయ విగ్రహా
శమాది షట్క సంపదార్య సారమానసాంతరా
యమేయ ధామ దివ్యనామ మాత్రతామసద్రుమా
క్షమా సఖీ విపద్విదారి సర్వరక్షకా హరీ 174

గద్య. [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష లబ్ధ పాండిత్య ధురీణ నవరత్నావళీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ స్వసమగ్రతాత్పర పటహ ధణంధణారవ విస్ఫురిత పతనక్రియా ఝల్లరికాభేరీ దుందుభి ధ్వాన కోలాహల హాహాహూహూమద్ద్వారాంత కనకదండికాప్రకర హార కల కృతసంవీక్షిత ప్రతాప కీర్తి ప్రతాప కోసలపం పయఃపారావార రాకాసుధాకర సౌందర్య జిత కుసుమ సాయక మహీపాలనాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబు నందు మునివరు లనంటుచు పరంజు కావేరి లందంబునందు మనోహ రంబుగా గానంబు సేయుచుండగ లక్ష్మీదాక్షిణ్యమునందేసు రంగధర్త ముఖిరాజు రచ్చించి సాయుజ్యం బొసంగుటయు భక్తాంఘ్రిరేణు నామ్నుం డను మహాత్ముని గాత్ర్రాగ్యంబును లక్ష్మీనారాయణ సంవాదంబును నారాయణానుమతంబునం జేసి వేశ్యకులంబునందు దేవదేవి యుద్భ వించుటయు దేవదేవి నారాయణమునితో రమించుటయు శ్రీ రంగవిభుండు నారాయణమునికొఱకు దేవదేవికి రత్నపతకం బిచ్చుటయు ముని నిందాపహరణంబును హరిస్తోత్రంబును నన్నది పంచమాశ్వాసము సంపూర్ణము

---

1 మూ ఇతి

క. అని నరుఁడు పల్కు వాక్యము
విని ధర్మపరాయణుండు వివిధ నిగమ సం
జనితార్థుఁడు నారాయణుఁ
డనఘుండు వచించె నిస్తులానందుండై 4

తే.గీ. విష్ణు నందు[1]వి వ్యస్తమౌ వృత్తిగల్గి
సకల లోకంబులందుఁ బ్రఖ్యాతిఁ గాంచె
విష్ణుచిత్తుం డనెడు పేర విమల మతిని
నిఖిల ధర్మంబు లెంచు నిర్ణేత యగుచు 5

క. హరిసమ్యక్స్థిరుండును
ధరణీసురుఁ డఖిల శాస్త్రతతు లాగమముల్
పురహరునివలన నేర్చెన్
హరి మాహాత్మ్యము దక్కఁ దూష్యమందున్ 6

క. హరి కరుణఁ జేసి యతులం
బరుదగు నైశ్వర్య మందు ననువందుచుఁ దాఁ
బరమ పదముఁ బ్రాపించెన్
స్థిరతరమతి నంత్యమందు శ్రీపతిపదముఁ దాగెన్ 7

క. వినుము నర యొక్క చిత్రం
బును గలిగిన దాని వగుచుఁ బుణ్యం బగు ని
మ్మునివర్యు విష్ణుచిత్తుని
ననుపమ సూక్తిని వచింతు నాహ్లాదముగన్ 8

---

1 మూల

## విష్ణుచిత్తుఁడు గరుడాంశుఁడై జన్మించుట

క. అపారరహము హైమ హర్మ్యము ని
వహములు సహకారవన నివాసి తతులా
వాహములు మహానందై
మహియం దలరారు పాండ్యమండలమందున్ 9

మ. అరవిందోత్పల పుంజ మందిర మిళిందానంద పద్మాకరో
త్కరమై యాపరణాంత్య శృంగములఁ బ్రఖ్యాతంబుగా బ్రాలి వి
స్ఫురణాంగాంచు సమస్తతార నిచయంబుల్ రేలు తద్వప్ర ర
[1]త్నరుచుల్ గా జగతీస్థలిం దవరు నీ ధన్వీపురం బున్నెడన్ 10

సీ. ఏ వీటిగిల్లా నహిన రత్నాంచిత
సౌధంబు లంగనకు స్థానమయ్యె
నే యూరగల గభీరాయత [2]ఖేయంబు
పాతాళ సతికి నోపదమ య్యె
నె ప్రోలు హేలాంబున్నెందు నింతులు తెలుపెంబు
లచ్చరకాంతల పెచ్చు లుడిపె
నె పురిఁ బ్రాపించు గోపురపాళులు
గోపురి తేపగు దాప లయ్యె

తే.గీ. ధర్మసౌధ వృతా పరిభ్రామమాన
బంధుర వతాకికా సముత్పద్యమాన
పవన చలిత ఘనాఘన భావ్యమాన
దిస్తు లౌన్నత్య ధరము ధన్వీపురంబు 11

---

1 మూ త్క 2 మూ ఖ్రే

క దివ్యంబై సకలంబున
స్తవ్యంబై భవ్యమగుచు స్వర్గాపమునా
భావ్యంబై వైష్ణవ గణ
సేవ్యంబై ధర్మపురము చెలు వొందు మహిన్ 12

క ఆ పురమున దీపించున్
శ్రీపతి వటపత్రశాయి శ్రీరమణ మూర్తి
ప్రాపకుఁడు నృంలోక
వ్యాపకుఁ డఖిలామరర్షి వరసేవితుఁడై 13

సీ వేద వేదాంగ సంవిద్యానసాంగులు
ధ్యాన పారాయణ తత్పరులును
స్నాన సంధ్యాద్యనుష్ఠాన నిష్ఠా గరి
ష్ఠ ప్రతిష్ఠా ఖ్యాతి సంయుతులును
సకల స్మృతీతిహాస పురాణ శాస్త్రోప
నయ కావ్యార్థ విచక్షణులును
సమలోష్ఠ కాంచనాస్మమతి ప్రసక్తి పై
రాగ్య వార్ధైక విరాజితులను

తే గీ అహరహము యజ్ఞశీలురై[1] యతిలి రాగ
పర సమర్చ నౌపచర్యలఁ బరగుచుండు
రందు శతసంఖ్యలాగను సహస్రసంఖ్య
లగను హరిభక్తులగు ద్విజులు [2]దగుచుమంట 14

---

1 మూ రే 2 మూ దగుదురందు

క. వారల కగ్రేసరుఁడై
యారూఢిన్ యోగవిద్య నరసినవాఁడై
ధీరుఁ డఖిలాత్త యజ్ఞుఁడు
పూరిత మతి నొక్కఁ డలరు మునినాథాఖ్యన్ 16

సీ. హరియందు సన్న్యస్త మగు మానసము గల్గు
నా మహామహుని భార్యాలలామ
చక్కందనము నందు సకలలోకములందుఁ
గల కాంతల హసించు కంజనయన
పతిపాద భక్తి పెంపార నాచరింపుచు
స్థిరవృత్తిఁ గన్న పతివ్రతార్య
నయవినయాది గుణ వ్రజంబులకు నా
ధారమౌ హృదయంబు దనరుసాధ్వి

తే.గీ. తనదు కలనైన నమ్మోదితరకథాను
లాపములు వినుటను దప్పులంగ వీని
యుత్తమ కులాంగనామణి యుచిత వచన
రచన నిరవొందు మత్తమరాళగమన 18

క. ఇలయం దామానిని యం
దలరంగా వ్యక్షమాన మందరి స్వాతిన్
లలిత శుభలగ్న దినమునఁ
గలయఁగ గర్భాంకురుండు గలిగెఁ దనయుఁడై 17

## విష్ణుచిత్తుఁడు స్వామికిఁ బుష్పమాలికా కైంకర్యము సేయుట

ఆ.వె. ఆతఁడు విష్ణుచిత్తుఁడను నామము వహించి
జనము భట్టనాథుఁడని వచింప
సతతంబు విష్ణునందుఁ జిత్తము నిల్పి
యెపుడు నిరతవృత్తి నెసఁగుచుండు 18

సీ. పరిమళం బఖిల దిగ్భాగంబులఁ బర్వఁగా
దివ్యంబులైన ధూపములచేత
సుజన సంచయ తమస్స్తోమంబు దొలఁగింపఁ
బ్రబలిన యష్టి దీపములచేత
నురుతర శాల్యన్న సూపాజ్య భక్ష్యాది
షడ్రస నైవేద్య సమితిచేత
హరికిఁ జిత్తంబునం దానంద మొనర్ప
నమరిన వృత్తగీతములచేత

తే.గీ. సుప్రదక్షిణ వందన స్తుతులచేత
భవన మార్జన ¹సౌధ లేపములచేత
సవ్యకరదీపికారోపణములచేత
విష్ణు నారాధనము సేయు విప్రవరుఁడు 19

వ. వెండియు నతండు సార్థకంబులగు తీర్థయాత్రల వికసితంబులగు కం
రంబులను వికచా²పాదితంబులగు తులసీ వనమాలికాదులను దద్వృత్తి
సముపార్జిత ప్రకారంబులగు చతుర్విధాద్యలంకారంబులను హరిం దృష్టిఁ
జేసి యంతటం గుసుమపరిపూరిత మహీరుహంబులను దుస్స్రుమంబు

1 మూ. శోధ 2 మూ. పా

మ. సరసత్వంబున యోగివర్యుఁడు యథేచ్ఛాలాభసంతుష్టుఁడై
హరి పాదాబ్జ మరందపాన మధుపాయత్తాత్ముఁడై యందు న
త్తరి దీయం దగు పాండ్యరాజ మధురాస్థానంబుఁ బాలింపుచున్
ధర వర్తిల్లెను గీర్తిసంపదల దధ్యక్షుండు నై వేడుకన్ 23

## పాండ్యధరావరు వర్ణనము

సీ. ధర్మ విఖ్యాతుండు [1]తత్త్వవిజ్ఞానుండు
తత్త్వజ్ఞ సేవన తత్పరుండు
ప్రాలేయగిరి సీమ పర్యంత కీర్తి సాం
ద్రా వ్యాపకస్ఫూర్తిఁ దనరువాఁడు
సంతత షడ్గుణైశ్వర్య సంపన్న ప్ర
భావ మహత్త్వ విభ్రాజితుండు
సకల భూత దయారస ప్రాభవ స్ఫూర్తి
నిబిడటాక్షమున గణింప నెఱుఁడు

తే.గీ. గరిమఁ గల్గైన బలికిఁ బొంకని ఘనుండు
దుస్తరారి వితానంబు ద్రుంచు పేరఁ
దఖిలలోక ప్రసిద్ధ విద్యాచణుండు
రాజమాత్రుండె పాండ్యధరావరుండు 24

తే.గీ. శిరిసిఁ దత్త్వ సుమ కాంక్షఁ జేసి తత్త్వ
విదులఁ బాలింపుచును బృథివీ వరుండు
దనరు నప్పుడు తీర్థ యాత్రాపరుండు
భూసురాగ్రణి యొక్కఁడు ముఖ్యతముఁడు 25

---

1 మూ. తత్వవిజ్ఞానుండు

## పాండ్యధరావరునకు వారక యాత్రిక విప్రుని వలనుంతోఁ దత్త్వ చింతకలుగుట

తే.గీ. అమ్మహాత్ముండు తత్పురి కరిగి యతిథి
పూజనం బగు వా రాజముఖ్యుఁ గాంచె
నృపతియును వానిఁ బురస్కరించి పూజ
ఁ నలు గావించె నిస్తులానందుఁ డగుచు 26

క. అనఘా నా కెఱుఁగఁజెప్పు మవనీస్థలి ని
న్నును దత్త్వజ్ఞునిగా నా
త్రికవ పేర్కొని పల్కె దయ సుధీ జను లక్షిన్ 27

క. అనఘుండ భావిమ వాక్యము
విని విప్రుఁడు నిప్రయార్థ విముఖాంతరాలో
చనుఁజేసి పండితులా
నెవని మహాత్ముఁడన వనిమె నింపు దలిర్పన్ 28

ఉ. అనయము రాత్రియై పగటి యందును వృష్టి దినాళి వృష్టితో
నెనిమిది మాసములే పయసు నింపగువేఁ బరా ద[1]ర్థమై
తనుఁడు పదార్థ సంగ్రహము సత్పరుఁడరిని యుక్తి సిద్ధికై
యునవసంపద యర్థ హాసంగ నావశ్యదగున్ వివేకిన్ 29

క. అని ద్విజుఁ డాడిన విని య
జ్ఞుఁపాలుం డెంతో యాప సల్పి ప్రియముగన్
ఎనిది పురోహితుని బలిచి
యనియె నతనిఁ గూర్చి యాధరామరు సూక్తిన్ 30

---

1 మూ దరా

తే.గీ. నేను యత్నంబుఁ జేసెద నిపుణమతిఁ బ
రార్థ మైన దైహిక సుఖంబు వ్యర్థమగుట
సాధనం బొనరించెద శాశ్వత మగు
బ్రహ్మపదము బ్రహ్మాది దుర్లభము శుభము 81

క. ఇహపరహిత కాముఁడనై
మహిఁ దనరిన యట్టి నిపుణ మహిమ గురుఁడ వో
మహితాత్మ పలుకుము కథా
వహితము పాయంబు నేరుపరి సదయముగాన్ 82

క. అని యిట్లు పలుకు భూమీ
పుని వాక్యము విని ద్విజుండు సుగుణాంచితుఁ డిం
పునఁ బ్రతి వాక్యము నుడివెను
మనమున సంతోష మంది మహిత ప్రౌఢిన్ 83

తే.గీ. అవనిపాలక యా సమయంబునందు
నీకు నీ బుద్ధి యుదితమై నెగడుఁ గాన
నిందు ననియెదు పురుషుల కెట్టి మఱియుఁ
గారణము నేరదు విజ్ఞానమున దలంప 84

సీ. నిగమాంత విజ్ఞాన నిపుణులందే సుహా
సనముఁ జేయఁబడిన ఘనుని విభునిఁ
బరుని దైవతము నుపాసించి దుర్లభ
[1]యగు ముక్తిఁ జెందు నీ వన్న యనఘ

1 మా. యముక్తి

దా మహాత్మునిఁ గూర్చి యాగాల మఱియుఁ గృ
తాంజలి యగుచు సాష్టాంగ వినతి
గావించి పల్కె నో కరుణాపయోనిధీ
వేదాంత వేత్తలే విమలుఁ గూర్చి

తే గీ ధ్యాన మొనరింతు రఖిలాగమాంతవేద్యుఁ
[1](డాది మధ్యాంతరహితుం డనంతుఁ డెవ్వ)
డే మహాముఁడు పరాపరేశ్వరుఁడు పు
రాణ పురుషోత్త ముఁ డెవండు రమ్య చరిత 85

తే గీ సరవి నెవ్వాని భ్రూ విలాసమునఁజేసి
సరసిజ భవాండ భాండులు దిరుగుచుండు
డెవ్వఁ డెవ్వాఁడు సకల సుధీనుతుండు
సంతతాహ్లాదయుతుఁడు ప్రజ్ఞాన ఘనుఁడు 86

క సంసిద్ధవ రుద్రార్కమ
సరసిజభవ శక్రవహ్ని సమయ సమీరా
ద్యమర నిర్జరంబు లెవ్వని యాఁ
గర మెవ్వని యాజ్ఞ వశగులుగా వర్తింపన్ 87

తే గీ ఎవఁడు పరతత్త్వ మనుపేర నెసఁగువాఁడు
నిత్యుఁ డీశ్వరుఁ డెవ్వాఁడు నిగమపారుఁ
డెవనిఁ దెంచి ఋషులు పాప మెనయకుండు
రమ్మహాత్మునిఁ బల్కె నిశ్చయముఁ జేసి 88

---

1 మూ ఈ పాదము లేదు

పాండ్యధరావరుఁడు తత్త్వనిశ్చయమునకై శుల్కంబు గట్టుట

క. అని విని పలుమా టాలో
చనఁ జేసి ద్విజాళిఁ బిల్చి సంపదగంటాఁ
దనయుండు విష్ణుదేవుం
డనుమానించుట నిందు సంశయము లేదనుచున్ 39

సీ. అమ్మహాత్ముఁడు పరంబైన తత్త్వంబు నా
త్మాధిపుఁ డఖిల లోకాధినాథుఁ
డందురు గాత్రికరంబగు పదంబని కొంద
ఱట్లు దత్పుత్రపౌత్రాది జనము
నది నిమిత్తముఁ జేసి యవనిస్థలము గల్గు
మహావేదవేదాంత పారగులను
రావించి తత్సమస్తావనీసురులచే
నెద్ది సత్యత నిశ్చయింపఁబడును

తే.గీ. నట్టి తత్త్వంబు నీవు సమార్జయించి
భక్తిఁ గైకొని సాధింపు పరమ పదము
ననిన మతిమంతుఁ డగు విభుఁ డధిక శుభము
నలరెడు పురోహితుని వాక్య మాలకించి 40

చ. అంత వసంత సంభ్రమగు యట్ట ధవం బనువొందు పుష్కలా
ర్కంమలి యైన యా నృపతి పర్యాయదు సుమ్మత తోడఁ బసం
డుం గంయంగఁ గట్టి పరితోషకుఁడై జగతీతలం బనన్
గల నిగమార్థ కోవిదనికాయములన్ గుతయించి యద్దితోన్ 41

యోగివర్యునిఁ గాంచి యోగి విలాసార్థమై
కృపచేత నా జగదీశుఁ డనియెఁ
చాంద్యభూపాల సభకుఁ బోయి బ్రాహ్మణ
పుంగవుం[1]డా నీవు పూర్ణ మతిని

తే.గీ. రచిని మహాప్రియ[2]ముగ మత్పరత్వ తత్త్వ
మును బ్రకాశింపఁ జేసి ప్రమోదమునను
పల్కుమ గ్రహింపు మనుచు విష్ణుచిత్తు నెల్లు
నయతరోక్తిని రంగనాథుఁ డనఁగ 46

క. కరముఁ బ్రమదయుక్తియై భూ
సురుఁడు కరంబులు మోడ్చి సురనుతుఁడౌ యా
హరికొంతు విన్నవించెను
గురుతరముగ తనకు మదిని కోర్కి యనంగాన్ 48

సీ. స్వామి శ్రీప్రాసాద సమ్మార్జనమొ కాక
యభిషేకజల ఘటాద్యాహరణమొ
మధుర సౌరభవనమాలికా కరణమో
సౌవర్ణ పల్యంకికావరణమొ
గరుడభూషిత పతాకాపరిగ్రహణమో
ధర్మ రత్నచ్ఛత్రాతపత్రభృతియొ
దివ్యమంగళ కరదీపికారోపమో
లత సితవ్యజనాది ధారణంబొ

1 మా లేదు 2 మా మత్పరత్వంబు

సీ. సురుచిర దివ్యకేయూరాలిత దీర్ఘ
బాహా సమున్నతోజ్జ్వల కిరీటు
నారూఢ హృష్టపుష్టాంగ కోమలుఁ బృథు
వక్షు విశాలాక్షు వరగుణాఢ్యుఁ
బూర్ణచంద్రాస్యు సుదీర్ఘఘనస్మితు
సుదరద నిరస్తు త్రికోర్కక్షుంద్రు
కంబు శతాంత భుజాయుగ్మ సుకపోలుఁ
గమలాక్షు వనమాలికావృత

తే.గీ. కంధరుని [1]సత్యగుణి శరణాగతావ
నమంతి నియమాది గుణాధియుక్తు
హృదయ పద్మస్థ భగవదంఘ్రిత నమర్చ
నాశయు జితేంద్రియునిఁ గాంచి యప్పుడుండు 65

వ. అంత సమాహితుండై దా
సంతసమున లేచి యాద్యశ్రేష్ఠుని ర
త్నాంతరిత పీఠిఁ జేరిచి
యెంతయు సాష్టాంగ మెరఁగి యుంపదలిర్పన్ 66

తే.గీ. పరమ హర్షితుఁ డగుచు సప్రాఙ్క్షుఁడు
శ్రుతి యథావిధి వరలిఁ బూజింప నదటి
నిగమ నిగమాంగకోవిదుల్ విపులమతులు
భూమిసురు లంద జనహితఁ బొంది రంత 67

---

1 మూ. సత్యదుని

క. అనాది బరబ్రహ్మము
నారాయణుఁ డవ్యయుండ నంతుఁడు భవ్యా
కారుఁడు తత్త్వము పరమో
దారుఁడు దేవాదిదేవుఁ డమృత ప్రదుఁడౌ 62

తే.గీ. ఇతని నామంబు సంతతం బెవ్వ రైనఁ
దనరి జీవితములతోఁ బ్రధానము నగు
హేతు వంతటఁ బ్రహ్మ[1]స్మృతై యేఁపు మీఱ
యంతటను నిండి యుండు నారాయణుండు 63

తే.గీ. అతఁడె విశ్వంభరుఁడు బతి యాత్మ విభుఁడు
సర్వశేషియుఁ బరమాత్మ సర్వగతుఁడు
సర్వ నేత్రుండు సర్వజ్ఞుఁ డవ్యయుండు
సర్వగుఁడు సర్వవిభవుండు సర్వమయుఁడు 64

సీ. ఆత్మ విభుండు విలక్షణుం డాద్యంత
రహితుండు శాశ్వతుఁ డహీనయుండు
పురుషోత్తముఁడు గుణపూర్ణుఁ డనంతుఁ డా
తఁడు పరమంబగుఁ దత్త్వ మరయ
సత్యంబు సత్యంబు సంశయంబును లేదు
నారాయణునికంటె వేఱు గాంచ
పరమగు దైవం బభావంబు భావంబు
విశ్వంభరాధీశ విప్రవర్య

1 మూ స్మృతై

ఆ. వె. యిఱియ యిడియఁ జూడ నెంచి సర్వంబు నే
ర్యంబు గాఁగ నే నుదారసూక్తిఁ
బలికినాఁడ నమమఁ బరమ వ్రతుం డిట్టి
పాటి గుఱించి మఱుపు నవసరమున 65

## పాండ్యరాజు సభలోఁ గట్టిన శుల్కము తెగిపడుట

క. లలితమతి విష్ణుచిత్తుఁడు
పలికినదో పతిరయంబునఁ బరఁగి సువర్ణ
స్థితం శుల్కము దెగిపడుటయు
నంత పుష్పాల వృష్టి గురిసె నాకమునుండి పయిన్ 66

చ. దివి సురదుందుభుల్ మొరసె దివ్యసతుల్ నటియించి రప్పటిన్
భువిని సమస్త మానవులు భూషణఁ జేసిరి సర్వదేవతా
నివహము కన్న శ్రీధరుఁడు నీరజనాభుఁడు లోకపాలకుం
డవిరళము త్రి యెక్కుఁడని యానతిఁ బల్కె సుదాత్త ధరిన్ 67

## పాండ్యరాజు విష్ణుచిత్తుని సన్మానించుట

తే. గీ. అప్పు డారాజు నిస్తులాహ్లాద నిర్భ
రుం డగుచుఁ దత్పరత పంక్తిరథములందు
నాకగతి భక్తిఁజేసి సాష్టాంగ [1]మెరఁగి
యతిశయస్తోత్రములఁ గొనియాడి మఱియు 68

వ. మహోజ్జ్వలంబులగు భూషణ వస్త్ర గంధ పుష్పమాలికాదులచేత మునీశ్వరు
సంతృప్తుంగావించి యౌపవాహ్యంబగు మహానాగంబునం దధిరోహణంబుఁ
జేయించి సమున్నతంగ మంగళతూర్య ఘోష సహితంబుగాఁ బరివారంగ
బలంబులతోఁగూడఁ బరిపర్యటనం బొనరింపునప్పుడు సర్వేశ్వరుండును

1 మూ ఒగి

కోటికందర్పసుందరుండును మహానుభావుండునగు శ్రీవిష్ణుదేవుండు లక్ష్మీ సహితుండగుచుఁ బ్రయాణమునందగు పతగేంద్రు నారోహించి పద్మభవ భవేంద్రాది సురముని పరి¹వృతుండగుచుఁ దక్షణంబున గజస్కంధాధి రూఢుండగు నమ్మునిఁ గనుంగొనుట కిచ్చగింపుచు మహాభాగవతాగ్రభా గంబు నందలి యంతరిక్షంబునందుఁ బ్రాదుర్భవించిన నద్దేవుం గాంచి భక్తి సుహృష్ట హృదయుండగుచుఁ దదీయసౌందర్యామృతంబు గ్రోలి తన్మంబా కృతచేతస్కుండగుచు నీరజాపతి వైభవ సౌందర్యాభర్వ వేషంబులకు దృష్టిదోషంబయ్యెడునని చింతింపుచుఁ దన్నీరాసార్థంబుగా నతనికి మంగళాశాసనంబుఁ జేయుచోఁ బుద్యుక్తవంతు డగుచు గజగండంబు నందుఁ దాళంబు గావించి యానంద సంభృతుండగుచు సామగానస్వరంబు నం జేసి యిట్లనియె 69

### విష్ణుచిత్తుఁ డొనరించిన మంగళాశాసనము

సీ. మంగళం బచ్యుత మధుకైటభ విదారి
  మంగళం బీశ్వర మదన జనక
మంగళం బంతరాత్మక లోకనాయక
  మంగళంబు రమానుషంగ పక్ష
మంగళం బ్రాకృతోత్తుంగ మూర్తిప్రద
  మంగళం బజ భవామరనుతాంగ
మంగళంబు సుపర్వమందార సమరూప
  మంగళం బఖిలాంతరంగ నిలయ

తే. మంగళంబు మహాపాపభంగ చరిత
మంగళంబు సువర్ణపతంగ గమన
మంగళంబు దయారసాపాంగ విభవ
మంగళము దైత్యనాశ పతంగవాహ 70

1 ము. ప్ర  2 మూ. హ

ఆ.వె. అనుచు నిట్టు పలుక నధికసంతుష్టుఁడై
కరుణచేత నతనిఁ గాంచి శౌరి
యాత్మ పద్మ కర్ణికాగ్ర స్థలంబున
వాసిఁ జేసె భక్తవత్సలుండు 76

విష్ణుచిత్తుఁడు మహావైభవముతో ధన్వీపురముఁ జేరుట

తే.గీ. అంత బహువస్తువుఁ జేసి యధిపుచేతఁ
బూజితుండయి యమ్ముని పుంగవుండు
తదనుమతిఁ గొని వేడ్కచే ధన్వీపురముఁ
జేరెఁ బరివృతుఁ డగుచు సుదారలీల. 77

క. పురజను లందఱు భూమీ
సుర వైభవ మాలకించి సుస్థిర మతులై
పురవర మమలంకృతి గణపి
హరి నాతని సేవఁ జేయఁ బరి వెడలి రొగిన్ 78

క. ఆ పురజన పూజితుఁడై
యాపృథ్వీసురుఁడు గజ సమారూఢ గతిన్
దీపింపఁ జొచ్చె నిజపుర
మేపున భగవద్దయానమేత హృదయుఁడై 79

తే.గీ. శార్ఙ్గ ధన్వుని పటుమంత్రకాయి మంది
రముఁ బ్రవేశించి యమ్మునిరాయఁ డమ్మ
యునిఁ బరంధాము సద్భుత మర్త్యరేతుఁ
గూర్చి ప్రణమిల్లి తనమది గోర్కె బలర 80

వ. అంత నయ్యిందిరానాథునకు భట్టనాథుండు తదాసీతంబగు ధనంబును
బ్రాకస్తంబగు హస్తిశ్రద్ధంబును సమర్పించి యథాప్రకారంబునఁ
దత్త్వంకర్మ ప్రకుండునుం దదారాధనా పరుండునునై యుండెనని మహా
యోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవపురాణో త్తర
ఖండంబు నందలి పంచవింశాధ్యాయంబు భక్తసరాయణంబగు నారాయ
ణుండు నరునకు నెఱింగించె నెండియు నిట్లనియె ౮౧

తే.గీ. ఇట్లు తైంకర్య నిరతుఁడై యెసఁగు విష్ణు
చిత్తుఁడు హరి ప్రియుండు భాసత యశుండు
ననుదినం బింద్రియ కృతార్థతను బెంగి
ధాత్రిఁ గృత కృత్యుఁడగుచు సుదార కీర్తి. ౮౨

తే.గీ. కంఠితానాయతానన్యగామి కర్మ
మనను చింతించి యాత్మీయమునగు గరణ
మూలఁ గృతార్థతఁ జేయఁగాఁ దలఁచి యమ్మ
హాత్మ పంకేరుహాధ్యాను డగుచు నుండి ౮౩

### విష్ణుచిత్తునకుఁ దులసీవనంబున భూదేవి గదాస్వరూపంబునఁ గన్యకయై కాన్పించుట

చ. స్థిరమతి నాత్మవాంఛ దులసీవన సేవకు నేఁగి యందు ని
ర్భరతర భక్తియున్ రుచివిభాసిత విస్ఫురణంబుతో గదా
పరుణమువన్ ఘటింపు దనిలార్చ మతిన్ హృదయాబ్జపీఠికాం
తరమున శౌరి మూర్తి నివకస్థితిఁ గాంచుచు నర్థిలిన్ భువిన్ ౮౪

తే.గీ. సాల మూలంబులం దతఁ దాలవాల
ములు రచింపుచు రాజాపమును న్యకీయ
పుత్రకుని మాడ్కిఁగైకొని పోషణంబు
సల్పు చుండు వసియించె నంతనమున ౮౫

## విష్ణుచిత్తుఁ డా కన్యను గృహంబునకుఁ గొని చని భార్యా సహితుఁడై పోషించుట

తే.గీ. ఈ కుమారిక గుణశాలి నీవు కరుణఁ
పోషణము చేయు మనఘ సంపూర్ణ మగుచు
దివ్యమగు పరమస్థాన మవ్వయంబుఁ
జెంద గలుగు నిఖిల సంసిద్ధి గలిగి ౯౭

క. అని యిట్లాడిన వాక్యము
విని సంతోషంబుఁ జెంది విప్రేంద్రుం డా
త్మ నికాంతముఁ జేరి ముదం
బున సుభయగు పుత్రిఁ దనదు పొలఁతి కొసంగెన్. ౯౮

తే.గీ. అంత నా సతి వృత్తాంత మవనిసురుడు
పల్కడో నప్పయోజాస్య పద్మ పగిదిఁ
దనరు పద్మాక్షి యగునట్టి తనయ పోష
ణంబు గావించెఁ బరమ హర్షంబు చెంది ౯౯

తే.గీ. శిశుని గోదాభిధానంబుఁ జేసెఁ దండ్రి
యప్పయోజాస్య కతులితాహ్లాద చిత్తుఁ
డగుచు నాలేమ సంవర్ధితాంగ యగుట
రూపలావణ్యగుణ్యానురూఢి మించె ౧౦౦

## గోదాదేవీసౌందర్య వర్ణనము

క. విమలరుచి శీత వానన
కమలము చనుఁ జక్కవలు ప్రకాశించె మహో
ద్యమమయ్యెఁ గుంతలాళులు
రమణికి యౌవన మనియెడు రవి యుదయింపన్ ౧౦౧

ఉ సంతత మింద్రనీలమణి జగ్గున తెగ్గ వహింపఁ జాలు ని
య్యంతి సుకై శికంబు వదనేందుని బిబిలఁ బైకిఁ బ్రాఁకునా
[1]సంతమసంగఁ బనం దగి సంచిత భృంగ గరుద్ద్యుతి చ్ఛటా
క్రాంత మహోదయం గలిగి కంధర బృంద విధన్ హసింపుచున్. 10౫

ఉ కన్నులు కల్హరేకులు ముఖంబు సుధాకరబింబ ముఖ్యలో
చన్నులు చక్రవాకములు చంపకసూనము నాస యింపుగా
నన్నువఁ గౌను మిన్నగుట సంతత మీ యుపమాన వస్తువుల్
మున్ను తపంబు సేయు ఫలమంగద ముద్దియ నాశ్రయించుటన్ 10౬

క కందమ్ములు దమ్ముం గా
నందం బెరఁబాపు భువన నయతరలీలన్
జెందియు గిరి భాస[2]య్యెను
నిందు నిభాస్యను సమాశ్రయించిన కతనన్ 10౭

సీ లావణ్య వాహినిఁ దనరు నభ్రమంబనఁ
గనుపట్టు గళము మధ్యమ్ము మించ
శృంగార సరస భాసింద రాజీవమ్ము
లనఁగ లోచనములు సంభ్రమ[3]ంపర
సార సౌందర్య పుష్కరిణియందలి సార
సమునన గతులు హస్తంబు లరర
నసమ విలాసజలాశయంబునఁ జొల్చు
వక్రంబున నాభి చన్ను లెసఁగఁ

---

1 మూ సంతసమం 2 మూ భావయ్యెను
3 మూ సాఁచన

సీ. అస్యంబు మిన్నందివచ్చి నేర్పరినన
నారతం దాఁవుగా నుద్ధిఁజేయు
యంపు యిర్వది [1]ధీరాలివై నను జెట్టి
యప్పం పొంపుగా నంచరించు[2]
రాత్రి౦బవళ్ళ స్ఫూర్తి వెంటడి నర
[3]నులనైన నటి విరసుం నానర్చు[4]
గుచయుగ మే యెద నవంతా ప్తి వహించు
[5]వారికైనను తాం పలి రచించు

తే. గీ. నఖతతులు జయలెక్కి యున్నతిఁ గదంగు
వారికేని తిరస్కృతి నాదరించు
దా వయోవాత్త మదనతంత్రాధిదేవ
తయ యనగ దీప్తిఁ జెందె సౌందర్య మొంది 110

గోదాదేవి రంగనాథ లగ్న చిత్తయై వవర్త్య లానర్చుట

క. తిలకిత తిలక రేఖా
దాయ్యాశ్రీ దనర్చి ధన్విపురమునం
దారూఢతర విలాసో
దారత దాముక్తమాల్యదాసతి వెంపెన్ 111

ఉ. యౌవనమంత్రై జలరుహాయతలోచన గానమాధురీ
రావముఁ జేసి భక్తి ననురాగముఁ గై కొని దేవదేవు ల
క్ష్మీవరు సంస్మరించి తన చిత్తమునం దధినాథుగాఁగ ని
ర్భావక్తైై కృతించె సరసస్థితిఁ దోడి చెలుల్ దిసింపగన్ 112

1 ము ధర 2 మూ పు 3 మూ నుస్తైన నరటి
4 మూ ర్చు 5 ము వారికైనను 6 మూ పు

ఉ. వెన్నెల కాఁకకున్ మరుని వేదనకున్ మలయంపు గాడ్పుకున్
గన్నియ చిత్తమందుఁ జలికంపముఁ గందురు రంగనాయకున్
జన్నగఁబాయి కీర్తన మహా సుధామృత మాధురీ ఝరిం
జెన్నెరు గానముం గొని సుశిక్షిత నల్పె నుదంచితోన్నతిన్ 113

క. ఆటలఁ బాటల మాటల
నేటులఁ జరిపాటిఁ జేసి నెఱజాణతనం
బోఁడి గొనియాడుచును దన
తోడి సఖుల కరణి మహిమ దొరకొని పలుకున్ 114

తే.గీ. అమిత సౌఖ్యైక ముఖ్య గుణాఢ్యయగుచు
[2]యౌవ నారంభ విగ్రహమైన యామె
నిరత మారూఢ తర మధురముల లిన
[3]హరి గుణము లెన్ను జనుని కరణి ధరణి 115

మ. సరసీజాక్షునియందు లీనతరమౌ స్వాంతంబు రంజిల్ల యా
యరవిందాయతనేత్ర పక్ష పరిపూర్ణాభిఖ్యయై తద్గానో
త్కరమున్ గానము చేయుచున్ హృదయ పద్మంబందుఁ దన్మూర్తి నా
స్థిరవృత్తిన్ దిపియింపుచున్ సతత ముత్తుం బ్రభావాఢ్యయై 116

---

1 మూ. మానం 2 మూ. యవ్వ 3 మూ. హరి కథగుణ

క. ఆరామ చంద్రికతో వన
మారూఢిం జేరి పుష్పలతి సంఖ్యలుగాఁ
గూరిమిఁ [1]గాని నిరతంబు ము
రారినిఁ బూజించు విప్రులాయత మతియై 117

క. నానా విధంబులౌ వా
సూనంబులచేత గౌరి శుభకారిణి ని
త్యానందవిధిని భక్తిని
దానక్రమమతిన్ సపర్య వంచించు నాగిన్ 118

సీ. [2]తన తండ్రి సద్భక్తిఁ దలకొని దతిరాణ
గయన పూజార్థమై సంతసమున
మానితంగు పుష్పమాలిక లొనరించ
వాని గోదాహ్వయ వసుజపాళి
యింద్రనీలంబ్రాయ తెవ యగు నిజకై
తంబున ధరియించి మురిపెంచి
సుకరమైన వసీన ముకురమ్ముపం దాత్మ
రేఖ విలోకించి హృదయ ముదిత

తే.గీ. తోషితాయత్తమై భక్తితోనె మగుడఁ
బెట్టియం బెచ్చి విష్ణుప్రియమునఁ జేసి
రంగనేతని యవతార రత్నములు న
భక్తిఁ బాటలు పాడు పవిత్రవదముగ 119

1 మూ. గానిరతంబు
2 మూ. తమ

చ అనయముఁ జక్రపాణికొఱకై యనఘుం డొనరించు మాలికల్
మునుకొని తా ధరించుకొని మోదముఁ జెందుచు మందిరాంతరం
బునఁ జరియింపుచున్ ముకురంబుం బరికింపుచు నవ్వుచున్ మనం
బునఁ గమలేశు సంస్మరణమున్ రచియించు వఁడస్వ వేడుకన్ 120

చ తరమతిఁ గవ్వరామతి ముదంబునఁ దాల్చిన పుష్పమాలికా
తతిఁగొని చక్రపాణికి నుదారత నర్పణ చేయు భక్తిసం
చిత గరిమ భట్టనాథుఁడు పరిష్కృత విష్ణుపదాంబుజాత సం
గతిఁగాను చిత్రముం గలిగి కౌతుకవృత్తి నొసంగు నెయ్యెడన్ 121

క మాలిక దాల్చిన యీ సుత
మాలిక లా ద్విజుఁ డొసంగ హానిర తరుణా
కాలికి గుణశీలి వన
మాలికిఁ బ్రియ మయ్యె వనియు మహితస్ఫూర్తిన్ 122

క పరము సుత సేయు కృత్యం
బెఱుఁగక సద్భక్తిచే మహిసుర వరుఁడా
హరికిఁ బరిభుక్త మాలిక
నరయ నొసఁగఁ గొన్ని దినము లరిగిన పిదపన్ 123

రంగనాథుఁడు గోదాదేవి పరిభుక్త పుష్పమాలికనా గోరుట

చ సరసిజగంధి యొక్క దివసంబున నిర్మల పుష్పమాలికో
త్కరము ధరింపనర్థితఁ దక్షిణముండగు భట్టనాథుఁడా
దరమున వచ్చి కాంచి వితతస్థితిఁ జింత యొనర్చి తల్లి యా
తెఱఁగు నొనర్చి తేమిటికి దేవునియందలి భక్తి గల్గఁగన్ 124

క. తరుణి పరిభుక్తములగు
సరములు హరి దాల్చుకొని విచక్షణుఁ డగు భూ
సురుఁడి గనుంగొని యా సతి
ధరణి [1]ధరణ్యంశ గాఁగఁ దలఁపుము మదిలోన్ 128

తే.గీ. ఏను వెండ్లాడు నందాక నీ వయస్య
యస్మదీయ గృహంబు[2] (న) నుండని మ్ము
టంచు సంతోష లోచనుఁ డాత్మ నొసఁగ
నమ్మహాత్ముండు తోషితస్వాంతుఁ డగుచు 129

క. [3]అనయము దేవేశుం గని
మాని వరుఁ డాతనికి బ్రమ్రొక్కి సౌధము తోడన్
దనయను దోఁకొని తనగృహ
మునకుఁ జనియె నఖిలలోకము గొనియాడన్ 130

## గోదాదేవి తన తండ్రిని యర్చావతార స్వరూపంబు లడుగుట

క. ఒక నాఁడా గోదాసతి
ప్రకటిత భక్తిని జనకుం బద తత్పరయై
సుకర మతిఁ దత్కథాశ్రవ
ణ కుతూహల యగుచు నుండి వినయతర లీలన్ 131

తే.గీ. ఆ జనకు మునినాయకు నమిత భక్తిఁ
జేరి ప్రణమిల్లి సంతోష చిత్త యగుచు
నంత నాముక్తమాల్యద యతనిఁ బలుక
పల్కు నిట్లు మృదూక్తిని భవ్యమతిని 132

1 మా. ధరణ్యంశ గాఁదల 2 మా. ఇనుండ
3 ఏ. మా. అందేవేశుండాదిన పూర్వపద్యము నందలి వాక్యముతో నన్వయించు లేదు

సీ. దివిజవంద్యుండును దేవదేవుండునౌ
వరవిందనేత్రు వర్యావతార
ములు భువనంబునఁ గల యసంఖ్యంబులు
గా మానవులకుఁ బ్రఖ్యాతి గాఁగ
సర్వాధికము లౌట సకలంబు గులకంబు
వలన ముక్తిదమూర్తి పొలుచు దాని
యందుఁ బ్రసిద్ధంబులై కర్తసౌఖ్యంబు
లొసఁగు [1]వాణిలో వనూన వృత్తి

తే.గీ. శ్రవణ మాత్రంబుచేతనే సకల జనులు
ముక్తిఁ బొందుదు రటులిహాపోదులగుచు
దాని వఠియింప నమఁ గూర్చి భవ్యమతిఁ
బనక హరిభక్తి దాయక సోధురింత 183

క. అని యిట్లు ప్రశ్న సేసెను
వనితామణి నా కుమారి వినిచింది ముదం
బున మృదు ఫణితి వదించెన్
జనకుఁడు బహువాక్యములఁ బ్రశంస సలుపుచున్ 184

వ. లోకంబునందు గుహ్యతమంబగు నీ [2]యర్థ్య వ్యూహంబు సూక్తమగుట
శ్రవణంబు వలన ముక్తి దాయకంబగు దాని పఠియించెద మాకర్ణింపు
మని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణో
త్తర భాగంబునందలి షడ్వింశాధ్యాయంబు భక్త పరాయణంబగు వారా
యందు నరునకుం జెప్పి వెండియు నిట్లనియె 185

---

1 మూ. వాసులో
2 వ్రా. యర్థ్య.

## విష్ణుచిత్తుఁడు గోదాదేవికి పరమ క్షేత్ర విష్ణునామ తన్మాహాత్మ్యంబులఁ దెలియఁ జెప్పుట

క. శ్రీ వైకుంఠ మహాపురి
యావాసుఁడు వాసుదేవుఁ డవ్యయుఁ డార్యా
శ్రీ విభవుఁడు నిత్యావం
ద్యావి[1]ర్భావుండు దనరు నతిశయలీలన్ 136

మ. లలితాష్టాక్షర మంత్రరాజ మనుసంజ్ఞ ప్రఖ్యాతోదయుల్
వినఁ ద్వేద రదంత పారగుల సంవిత్పార నిష్ఠా గరి
ష్ఠుల సారూప్య నిరూఢమాన మహిమస్ఫూర్తుల్ సదా నిత్యము
క్తులు సేవింపఁగ నందు నచ్యుతుఁడు వైకుంఠుం డకుంఠస్థితిన్ 137

క. ఆమోదలోకమునఁ బర
మామోదముఁ జెందు శౌరి [2](యతిలం) గుణమణి
ధాముఁడు శ్రీ సంకర్షణ
నాముఁడు వినుతి మునిజనస్తుతుఁ డగుచున్

క. ఘన శ్రీప్రమోదలోకం
బునఁ బ్రద్యుమ్నుండు నిత్యపూర్ణుండు మహిం
పున భక్తవత్సలుఁడు స
న్ముని సేవితుఁ డచ్యుతుఁడు సముజ్జ్వల మతియై 139

తే. గీ. సరసిజాక్షుని సామోద పరమలోక
మందు న([3]చ్యుతుఁ డ)ని రుద్ధుఁ డగుచునుండు
నారదాదుఁ దరులీలాప్తోర [4]భక్తిఁ
దనరఁ బాపుఁ డనిల జీవనుఁడు నగుచు 140

---

1 మా. భావ్యుండు  2 మా. (యతిలం) లేదు
3 మా. లేదు  4 మా. భవ్య

తే.గీ. అఖిలలోక శిరోమణి యైనయట్టి
సత్యలోకంబు నందుల నంతరంబు
నలరు నానందమయ పరార్థ్యంగు సుభక్తు
లనుసరింప మహావిష్ణు వధివసించు 141

మ. అరయన్ భాస్కర మండలాంతరమునం దావాసియై ద్వాదశా
క్షరమంత్రంబుల సన్నుతింప సురలోకవ్యూహంబు లక్ష్మీయుతుం
డరవిందాక్షుఁడు భక్తరక్షకుఁడు సత్యస్వాంతుఁ డొప్పారు భా
సుర సౌవర్ణ కిరీటకుండల కటీ సూత్రాద్యలంకారియై 142

క. [1]అమృతాంబుధి నడుమ భుజం
గమపతి పెంపుపఱుపునఁ గంజదళాక్షుం
డమరున్ భాసించుఁడు హరి
యమరవరుఁడు శేషశాయి యవ్యయుఁ డజుఁడున్ 143

తే.గీ. ఇల యనంతాది నిత్యముక్తులగు సూరు
లధికతరభక్తి సేవింప నందుఁ దనరు
విష్ణుఁడు నూతనుండు పక్షిస్థుఁ డ[2]ఖిలం
భూషణాలంకరిష్ణుం డశేషగుణుఁడు 144

సీ. బ్రహ్మాది నిర్జర ప్రవర ప్రభావుండు
నారద సనక సనంద వాద్య

---

1 పా అమృతంబునిధి 2 పా రఖిం

మౌనిసన్నుతుఁడు శ్రీమంతుండు శాంతుండు
సంతత నిగమాంత సంచరుండు
సకలుండు నిర్గుణుం డగణిత మహిమయుఁ
డసురమర్దనుఁడు జనార్దనుండు
కాంచనకంకణాంగద హారకేయూర
రత్నకోటీర విరాజమానుఁ

తే.గీ. డప్రమేయుం డనంతుం డపారగుండు
శార్ఙ్గధన్వుండు భువనరక్షణుండు
భక్తపాలుండు తారకబ్రహ్మసంజ్ఞఁ
దధివసించు శ్వేతద్వీపమందు నెపుడు 146

సీ. పావనంబైనట్టి బదరికాశ్రమ సీమ
నధివసియించు నరాగ్రజుండు
సనకాది మునిరాజ సంసేవ్యమానుండు
నారదప్రభృతి సన్నుత మహుండు
సంతత నిర్జర సంస్తూయమానుండు
యోగవర్య మతుం డనూన గుణుఁడు
పేర్చి శ్రిత జ్ఞానవహార్థ బోధకుఁ డని
వార్యతేజుఁడు భక్తవత్సలుండు

తే.గీ. స్వనుతకీర్తి చిదచిద్విశిష్టమూర్తి
గురుతర ప్రాభవుఁడు తత్త్వకోవిదుండు
సకల విద్యా వినోది తత్కృప విశేష
యమిత లీలాచణుండు నారాయణుండు 148

క. పరమక్షేత్రంబై వి
స్ఫురణంబగు నైమిశమున ముక్తిదుఁ దగుదున్
హరి దగు సల్లక్షితువునఁ
హరి శౌనక ముఖ్య పరమముని పూజితుఁడై 147

తే.గీ. క్షితి మహాపుణ్యమగు హరి క్షేత్రసీమ
దూధి పీఠ సాంగ్రామ దూపియగుచుఁ
వెలఁగు దార్వ్యాభిషేకంబు సేవనంబు
జనమునకుఁ బరమపదం బొసంగు నెపుడు 148

క. మహి మతికర్షికయందుం
రహి గండ[1]మూధికసంజ్ఞ రంజిలు హరి దా
మహిత స్ఫూర్తిం గైకొని
యహరహము ధర్మకోటి కభయప్రదుఁడై 149

ఉ. అందు పయోధ్య యందుఁ మహా మహుఁడై యనుజన్మయుక్తుఁడై
వందిత మూర్తియైన పృథివీసుతతోడ సమస్తలోక సం
నందిత విచారపద్ధతిఁ బ్రకాశితుఁడై భవమోక్షకారియై
యుం బరమాత్ముఁ డౌ ఘనయశోధనుఁడు రాముఁ డుదారకీర్తియై 150

తే.గీ. ధన్యమతి దాతఁడు నక్కట్ ప్రపన్న జనుల
రక్షణ మొనర్చు దీక్షగాఁ బ్రబలువాఁడు
శ్రీకరుఁడు రఘురాముఁ డస్తోక మూర్తి
స్మరణమున ముక్తి ఫలం బొసంగువాఁడు 151

---

1 మూ. ధ్యూచిక

క. అం మధురయందు వర్తిం
లంకాధిపుఁడు రాంకృష్ణ సంజ్ఞఁ దలిం ది
వ్యులు గొలువఁగఁ బరమేశుఁడు
మాధవముఁడుఁ [1]ప్రపన్నమైన వత్సలుఁడై 152

తే.గీ. మాయయం దలరారు రమాసమేతుఁ
డగుచు నరుల రక్షింపఁ దగుచు దేవుఁ
డచ్యుతుండు గృహారూఢి యగుచు భక్త
వత్సలుండు మధుఘ్నుండు వనజనయన 153

క. క్షమయందలి శాలి కే
శ్రమునందు ఫణీంద్రశాయి రంగము విధి రు
ద్రముఖ సురార్చితుఁ డగు చ
ద్ధృతర స్థిర భక్తి జనసురాంఘ్రికమలుఁడై 154

తే.గీ. అమ్మహాత్ముఁడు దాక్షిణ్యమైన యట్టి
తారకబ్రహ్మ మంత్రం ముదార సూక్తి
నంతతము మానవుల కొసంగుచుండు
ఘనతర స్ఫూర్తి లోకోపకారి యగుచు 155

క. కరుణామూర్తి యనంత
స్ఫూర్తుఁ డవనీనాథుఁ డాశ్రితాఘహరుండు శ్రీ
కరుఁడు సదా మునిసేవితుఁ
డురుతర పద మందిరుడు మహోన్నతుఁ డలరున్ 156

1 మూ. ప్రసన్న

తే.గీ. ద్వారవతియందు హరియు నవ్యయుఁడు పరుఁడు
యాదవేంద్రుండు లోకరక్షా పరుండు
సర్వలోక శరణ్యుండు సకలభక్త
వందితుఁడు శరణాగత వత్సలుండు 157

క. సంప్రవణమున యదుపతి
సుందర విగ్రహుఁడు భక్తసులభుఁడు గోపీ
బృందముతో విహరించు ము
కుందుఁడు కృష్ణుండు గోపగోయుతుఁ డెపుడున్ 158

తే.గీ. ధర మనోహరమైన బృందావనమున
నంద సూనుండు దనరు నానందమగను
నలుఁ దచ్చిత్తులను దత్పరాయణులు మ
హాత్ములగు భక్తవరులు సమర్చ సేయ 159

క. అనుదినము గాళియహ్రద
మున గోవిందుండు దనరు ముని హృద్ధ్యేయుం
డనుపమ మూర్తి మహామహుఁ
డనవద్యుం డప్రమేయుఁ డవ్యయుఁ డగుచున్ 160

క. గోవర్ధనగిరి వరముగ
ధారింపగ గోపవేషధరుఁడై హరి ం
[illegible]వరుఁడు తనదు సేవను
సేవకులం దావర్చు నరక సింధువు గడవన్ 161

చ. ఇలనతఁడవ్వనమందు స్మరియించిన మర్త్యులొనర్చు పాపముం
బొలియఁగఁజేయు నచ్యుతుఁడు భూరికృపారసమూర్తి భక్తవ
త్సలుఁడు భగవన్న సంస్తుతుఁడు సర్వశరీరుఁ బ్రోచు నంతతో
జ్జ్వలుఁడు మహర్షి సేవితుఁడు సత్యవిహారుఁడు ముక్తిదాయియై 162

క. హరి నారాయణ నిర్జర
గురుతర శోభయమాన గోమంత మహీ
ధరమున భగవంతుఁడు హరి
సరసుఁ డిలయనుఁడు మురారి శౌరి దనర్చున్ 188

తే.గీ. ఇల మహాపుణ్యము వరంబు కలుషహరము
నగు హరిద్వారమందుఁ బ్రఖ్యాతి నందు
సంతతంబు జగత్పతి సకలభక్త
జనము లర్థి నుపాసింప నంతసమున 164

సీ. అలరు సితాసితంబగు మహానదీ
ప్రవహంబు లిచ్చటఁ గలసియుండఁ
బరమ పావనమునై [1]వరఁగునట్టి ప్రయాగ
మందును మాధవాద్యఖిల సురలు
వినయంబు సేవింపఁ దనరు మాధవుఁడు లో
కములకుఁ [2]దన దర్శనము వలనను
బరమపదం బిచ్చుఁ బరమాత్మ యంతఁ బ
విత్రంబయిన గయాక్షేత్ర మందు

1 మూ. ధరగు 2 మూ. దనదు దర్శనమువలన

క. వితత జనానంద సమం
చిత నందిగ్రామ సిమ్నగత నత్రితిన్
గతియైన రాజనప్పుఁడు
సతతము బహుభక్త మౌని సముపాసితుఁడై 168

ఆ.వె. విశ్వభావనుఁడు విశ్వ కాంతియు విశ్వ
రూపుఁడైన శౌరి రూఢి గాంచి
భక్త సేవితంబు భాసురంబునగుఁ బ్ర
భాస తీర్థమందుఁ బరగుచుండు 169

క. శ్రీకర పుణ్య సరోవర
మై కమనీయంబు నగుచు నవహార్షయమౌ
శ్రీ కూర్మంబను పల్లి
శ్రీ కూర్మాకృతి ధరుండు శ్రీధరుఁ దక్షిన్ 170

సీ. దైవర్షి యక్ష గంధర్వ కిన్నర సమూ
ధ్యానలాభింతోటి పావనంబు
నగుచు పల్లిల్లు నీలాచల క్షేత్రంబు
నందుఁ బూజ్యుండు మహామహింపు
భాసిల్లు నా బలభద్ర సుభద్రల
తోఁ గూడి నిత్య సంతోషి యగుచుఁ
బురుషోత్తముఁడు దయాంభోధి శ్రీమంతుఁడు
పతిత పావనుఁడు సభద్రదాయి

తే.గీ. భవ్యమతి సేవచేతను స్వప్రసాద
మునకుఁ బాత్రతగను జనమ్ములకు ముక్తి
నొసఁగుచు నపార కీర్తి సమున్నతాత్ముఁ
డగుచు నిస్తుల మహిమ నపాయి యగుచు. 171

తే.గీ. సింహ శార్దూల సంగతాఖిల పుణ్య
తీర్థ పరిశోభితంబుగాఁ దేజరిల్లు
సింహగిరి యందు శ్రీ నరసింహమూర్తి
యమర నమర నికాయంబు లభినుతింప. 172

క. ఆతఁ డఖిలాత్మకుఁడు నం
తతము నిఖిలలోక కర్త దైవత పరిష
న్నుత పదుఁడు శ్రీకరుం డం
చితమోక్ష ప్రదుఁడు నారసింహత మింపున్ 173

తే.గీ. ధారుణిని దివ్యగంధ మనోరమంబు
నైన తులసీ వనంబునం దలరుచుండు
గది నమాఖ్యుండు పంకజేక్షణుఁడు శౌరి
యవ్యయాత్ముండు భగవంతుఁ డచ్యుతుండు 174

క. క్షితిని మహా పుణ్యంబగుఁ
గృత శౌచమునందు నిందిరేశుఁడు హరి దై
వతనుతుఁడు పాపహరుఁడన
న్నృతుఁడగు లోకంబునందు ప్రకటన దలచేన్ 175

చ. అనవరతంబు [1]స్తోత్రగిరి యందు వసించు నృసింహమూర్తి పెం
పొనరు మనంబు గైకొని గుడోదక పానము సేయుచున్ ముదం
బునను సమస్త మర్త్యులకు భుక్తియు ముక్తియు నిచ్చుచున్ దన
ర్చును బుధవంద్యమాన పరిపూర్ణదయాంబుధి యగ్గలుఁడై యలన్

తే.గీ. పారమాత్మ్య మహాక్షేత్ర వాసియగుచు
భక్త జనముల కెల్ల శుభం బొసంగు
నఖిల లోకైక కర్త రమాధినాథుఁ
డమరవంద్యుఁడు సాక్షినారాయణుండు 177

క. శ్రీ గోదావరి తటమున
శ్రీ గాంచిన ధర్మపురిని స్థిరతరలీలన్
యోగానంద నృసింహుం
డాగమవేద్యుండు దనరు నాశ్రితభరితై 178

తే.గీ. దివ్యమగు కృష్ణవేణీ నదీ తటమున
వరలు శ్రీకాకుళంబున నంధ్రనాయ
కుండు దనుఁగొల్చు వారలకును ముదమున
భుక్తిముక్తుల గూర్చు సంపూర్ణమతిని 179

ఆ.వె. గాయదాద్రి సంజ్ఞ గల్గినవోలంబు
మున హిరణ్యకశిపుఁ బొరియఁ జేసి
నట్టి శ్రీ నృసింహుఁ డత్యుగ్రతర రూపుఁ
డమరుఁ బరమపావనాహ్వయుండు 180

---

1 మంగళగిరి

సీ. అమర చిత్తచకోర సముదయమ్మునకుఁ జం
ద్రమము గూర్చు మఱిచంద్రమండలంబు
కరుణారస మరందఝర కారణమ్ముగఁ
దనరారు నేత్రపద్మద్వయంబు
భక్తచయాశాంత పరిపూర్తి సల్పు న
నల్పంబులగు బాహుకల్పలతలు
భరత సౌమిత్రి భాసుర విలోచనలకు
భాగ్యతర సంపదంఘ్రి యుగము

తే.గీ. సమరు లోకైక కర్త త్రైలోక్యనాథ
రావణ శిరోధిహర్త సీతావధూ మ
నోంబుజాకర భాస్కరు[1]ండును దనర్పు
రాజవందితుఁ డుదయాద్రి రాఘవుండు 181

చ. జాతకవాది వీక్షకులు సన్నుతిఁ జేయఁ దనర్పు పాదముల్
గలిగి పవిత్ర నీరము చెలంగిన భీమరథీనదీ తటి
న్నెలకొని పుండరీకుని వినిర్మలుఁ జేసిన పాండురంగ వి
ఠ్ఠపతి సత్యమూర్తి ప్రకటప్రతిభాకృతిఁ బొల్చు నిచ్చలున్ 182

సీ. అపరంతర భగదజావహ మహోద్భూత క
దంబ కుసుంగ భూషాంబరంబు
భక్తి మకరంద పత్రికాక్రమ [2]దూర్వ ప్ర
సారితగారుత్మ తోరణంబు

---

1 మూ. యడు
2 ము. దోర్వ

వ. అని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణో
త్తర ఖండంబు నందలి సప్తవింశాధ్యాయంబు భక్తపరాయణుండగు
నారాయణుండు నరునకుం జెప్పె వెండియు నిట్లనియె 187

క. వసుధాతలిని కరుణా రస
మున కాస్పదమైన హృదయమున్ గల్గి యతీ
ధనుడైన భట్టనాథుడు
తనయను వినయను గుణంబు తానెనె మతియున్ 188

క. తనయా యాదవశైలం
బున కీశ్వరుడైన యష్టి పురుషోత్తముడం
డును నారాయణుడను నం
ఘ్రి నలి సంతతము భక్తసముపాసితుడై 189

క. ఘటికాచలంబాని నృహరి
ఘటికా మాత్రంబు సేవ గైకొని భక్తో
త్కట మతులగు మానవులకు
పటిమ నొసగు ముక్తి భక్తవత్సలు డగుచున్ 190

సీ. పుణ్యంబు నతిరమ్యమును నగు వేగవ
తీ మహా నిర్ఝరీ [1]తీరమందు
వెలయు యతీంద్ర సేవితమగు శ్రీహస్తి
ధరణీ ధర శిఖరాంతరమునందు

---

1 మూ. రతము

భగవంతుఁ డచ్యుతుండు భక్తమందారుండు
ధన్యుండు శ్రిత వర దాయకుండు
కరుణాసముద్రుండు కంజాత నేత్రుండు
దివ్య స్వరూపుండు దేవరాజు

తే.గీ. సకల లోకేశ్వరుఁడు ప్రణతార్తి హరుఁడు
వార్ధిజా సహితుఁడు భక్తవత్సలుండు
వరదుఁడు వరేణ్యుఁ డవ్యయుఁ డతి విశేష
యతుల మోక్షప్రదుండు నారాయణుండు 101

తే.గీ. దివ్యమగు వప్పురమునందుఁ దేజరిల్లుఁ
గమలలోచనుఁ డవ్యయుఁ డమరనుతుఁడు
భక్త పరిపాలకుండు యథోక్తకారి
హరి ఫణీంద్ర శయానుఁ డనంతమూర్తి 102

వ. అట్టి పరమేశ పురాశ్రయుండును చారుపదావలియు నృసింహుండును
త్రివిక్రముండును ప్రవాళవర్ణుండగు దీపప్రకాశస్వామియు వెండియు
నష్టభుజసంస్థితుండును నాగు పేర లందుఁ దనరుచు రతి యొప్పినయ 103

క. ప్రస్తుతమగు శ్రీగృధ్ర స
రస్తీరమునందు విజయ రాఘవుఁ డుండున్
నిస్తులతర విగ్రహుఁడు స
మస్త జనార్చిత పదాబ్జుఁడగుచు నిరతమున్ 104

సీ. భువిని మహాపుణ్యమును గాలిహోత్రాశ్ర
మాంతరంబుగ నలరారి విమ్ము
లైన పీఠరత్న మందలి హృత్తాప
నాశన కాసార సన్నిధిని
రహిఁ దనర్చును వీరరాఘవస్వామి లో
కైక శరణ్యుఁ డస్తోక మూర్తి
యఖిల లక్షణలక్షితాత్ముండు సంతత
దైవత వినుతాంఘ్రి తామరసుఁడు

తే.గీ. భక్తమందారుఁ డాశ్రితవత్సలుండు
ధర్మ సంధాయకుఁడు ముక్తిదాయకుండు
విపులకాముండు సుందర విగ్రహుండు
సారస దళాక్షుఁ డార్తరక్షా చణుండు 195

క. స్తోత్రాద్రియం దంతు వ
ఖ్యాత స్థితిఁ దంగరయనుఁ దను పేర జగ
న్నేత యగు వాసుదేవుఁడు
భూతలమున నతిఁ భక్త పోషకుఁ డగుచున్ 196

క. ఘనతరమైన గణ్య స్థల
మునను గతాత్రిష్ను సంఖ్యఁ బొలుపొందు సదా
మునివు సంపూజితుఁడై
యనుపమ కరుణామృతాబ్ధి యగుచు హరియుఁ గాన్ 197

క. ధరణిఁ బవిత్రంబగు బలి
పురమందు మహాబలుండు పొలుచు సమస్తా
మరపూజిత విగ్రహుఁడై
శరణ జనప్రచయ ముక్తి సంధాయకుఁడై 198

తే.గీ. భక్తిసార మహాక్షేత్ర వాసియగు జ
నార్దనుండు జగత్పతి యచ్యుతుండు
సజ్జన నుతుండు దేవతా చక్రవర్తి
యాశ్రిత పరాయణుండు నారాయణుండు 199

క. చంద్ర క్షేత్రంబునను మ
హేంద్ర ప్రముఖామరులు రహిం బూజింపన్
సాంద్రదయుఁడు నిఖిల ని
స్తంద్ర కలుషహారి దైవతప్రభుఁ డలరున్ 200

క. వ్యాపిత మూర్తి మహాత్ముఁడు
గోపపురమునందుఁ దనరు గోపపతి సుర
ప్రాపకుఁడు ముక్తిదాయకుఁ
డాపద్విచ్ఛేదకుఁడు కృపాంబుధి యగుచున్ 201

క. శ్రీమంతంబై సద్భు
క్తామోదంబై మహత్త్వమై పెంపెసఁగు నా
శ్రీముష్ణంబున శౌరి మ
హామహుఁడు వరాహరూపమై విలసిల్లున్ 202

క. విమలతరంబగు మహిమా
ఢ్య మహా స్థానంబునందు నలరారు మహో
ద్యమ మూర్తి పద్మలోచనుఁ
డమర ముని ప్రముఖ వందితాంఘ్రి యుగళుఁడై 203

సీ. ఆ వని కవేరకన్యా మహనీయ మ
ధ్యద్వీపమున సముదార మగుచు
శ్రీరంగ మనుపేరఁ జెన్నొందు క్షేత్రంబు
క్షేత్రోత్తమంబు లక్ష్మీకరంబు
పరమ పావనము భాసురపుణ్య మహిమలో
కైక మంగళము నస్తోక మగుట
నందు పత్రిలఁ బ్రణవాకారమును రత్న
మయమును గల్మషక్షయము నధిక

తే.గీ. రమ్యమును వేద శృంగార [1]రాజితంబు
నవ్యయము నున్నతంబును నగు విమాన
మధ్యమున దనరెడు భుజంగమ వరాంగ
తల్పమధ్యమునందు సుఖాప్తి యగుచు 204

క. శోభిత చంద్రవదుఁడు హరి
శ్రీమంతుం డఖిలోక చింతామణి శ్రీ
భూమి నీళా సహితుం
డై మహిత సుఖాప్తిఁ జెందు నతిశయలీలన్ 205

1 పూ. విరాజి

తే.గీ. భవ్యతరమగు నాసిక నగర మందు
నధివసించు నధోక్షజుం డచ్యుతుండు
సుర్పురావర్తకి క్షేత్ర మొందు శౌరి
విశ్వమయుండు మహాత్ముండు శాశ్వతుండు 216

తే.గీ. దివ్యతరమగు మణికోటి తీర్థమునఁ ద
నర్చును మహాప్రభుండు సనాతనుండు
విశ్రుతంబుగఁ దృష్టాఖ్య వెలయు పురిని
నందు శౌరి మహాకృష్ణుఁ డనెడు పేర 217

క. విమలంబగు విష్ణు స్థా
నమునందుఁ దనర్చు నయ్యనంతుఁడు హరి వి
శ్వమయుండు భక్తవరదుఁ డు
కమలాసన వినుత పాదకమల యుగంబై 218

క. అనుపమమగు విష్ణుపదం
బున వర్తిలు నచ్యుతుండు పురుహూతసుతుం
డనఘుఁడు లక్ష్మీనారా
యణుఁడన విఖ్యాతి గాంచి యతులిత లీలన్ 219

క. నలువగు శ్వేత ద్వీపమున
నలరారును శాంతమూర్తి యని ఋషులను వి
ఖ్యాతి హరి సురప్రియుఁడుగాఁ
బలుకంబడ నగ్నిహోత్ర పద్ధతి సేమన్ 220

క. ఘనమగు భర్గస్థానం
బన భార్గవ సంజ్ఞఁ దగుచుఁ బుణ్యాత్మకులౌ
జనులు భజియింపఁ దనరును
వనజాక్షుఁడు శౌరి భక్తవత్సలు మహిమై 221

తే.గీ. స్థిరను వైకుంఠమును మహాక్షేత్రసీమ
బాధులందే మాధవుఁడు హరి పూజ్యుఁ డగుచు
నుండు గరిమంబునగు పురుషోత్తమమున
శ్రీకరుఁడు భక్తసఖుఁడు భాసిల్లు నెపుడు 222

తే.గీ. చక్రతీర్థమునందు సుర్యాహ్వయంబఁ
దనరును జనార్దనుండు సుదర్శనాఖ్యఁ
దగుచు భక్తజనంబుల కురకరువు
పగిది కైవల్య దాయకై జగతియందు 223

చ. విమలము కల్మషాపహము విశ్రుత పుణ్యమునైన కుంభకో
ణమునఁ దనర్చు పద్మ పతిఁ దారకుఁ డాద్యుఁడు చక్రపాణి పా
పమున ధరాతలంబున సమస్త శరీరుల కెల్ల మోక్ష ము
వ్యముక ఘటింపుచున్ భవనుతస్వపదాంబుజాతుఁడౌచు నిచ్చలున్ 224

క. భూరి శుభంబై యలరెడు
శౌరి స్థానమున శార్ఙ్గి పొందుపొందు దయా
న్వితుఁడు ప్రభు పద్మాక్షుఁడు
పాతక హరుఁడుండు భక్తపాలకుఁ డగుచున్ 225

క. సుజన స్తవనీయంబై
వృజినహరంబైన యాకపిక్షేత్రము నం
దజనుతుఁడు గజార్తిఘ్నుఁడు
త్రిజగన్నాయకుఁడు దనరు దివిజస్తుతుఁడై 226

తే.గీ. చిత్రకూటంబనను వాసించు శౌరి
వెలయు ననవరతంబు గోవింద సంజ్ఞఁ
దగుచు భక్తయోగిధ్యేయుఁడగుచు నటం
జంతు ముక్తిప్రదు[1]ండౌచు సంతసమున 227

తే.గీ. వెలయు నుత్తమ యను క్షేత్రమున వసించు
నుత్తమాహ్వయుఁడై పురుషోత్తముఁడు మ
హానుభావుండు విష్ణుం డనంతశయనుఁ
డవ్యయుఁడు ముక్తిదాయకుఁ డచ్యుతుండు 228

క. ఖ్యాతి విచిత్ర శిఖరమగు
శ్వేతాచలసీమయందుఁ జెన్నొందు శుభా
న్వితుండు పద్మలోచనుఁ
డాతత శుభదాయి పోషితామరతతియై 229

సీ. పాద స్థలమునందుఁ బరఁగు హృషీకేశుఁ
డేయెడఁ గైవల్యదాయి యగుచు
భక్తులచేఁ బరబ్రహ్మమనుచుఁ గొని
యాడంగఁ బడియె సుధాకరుల

---

1 మూ. దగుచు

గురుతరంబగు కృష్ణకోటియందలి మధు
వైరిభక్తుని గొప్పరులచేతఁ
భావింపఁబడు నందపురమునఁ దగు మహా
నందుండు వైభవానందమూర్తి

తే గీ బ్రహ్మముఖ్యార్చితుండుఁగాఁ బ్రబలుచుండు
వృద్ధపురియందు విలసిల్లు విష్ణుదేవుఁ
డచ్యుతుఁడు భగవంతుఁ డింపారఁ దావ
షా్ర[1](మా)ఖ్యుఁ డగుచుఁ గరుణాబ్ధి యగుచు 330

తే గీ భవుఁగ నుత్తమ సంగమ గ్రామసీమ
నలర నారాయణుఁడు సంగమాభిధానుఁ
డగుచు భక్తులచేఁ గొనియాడఁబడియెఁ
దత్త్వబోధనిరతమందారుఁ డగుచు 331

క క్షమ నుత్తమ శరణాగ్రా
మమునందలి యచ్యుతుఁడు రమానాథుఁడు నై
యమరేంద్ర సేవితుఁడు హరి
రమణీయాంగుండుఁ దగు శరణ్యాఖ్యుండై 332

క పౌరి సిద్ధసేవితంబై
స్థిరసంపద గల్గినట్టి సింహక్షేత్ర
స్థిరయందు మహాసింహుఁడు
పరఁగు సుజనవంద్యమాన పదపంకజుఁడై 333

---

1 మూ లేదు

క. ఒనరఁగ మణిమంటపమున
మునుఁడై మల్లాది సంజ్ఞ గలవాఁడై య
చ్యుతనాముఁడు రంతిదా న
జ్ఞాన మూర్తియుఁ దగుచు సంభూతప విభుఁడై 284

క. నిమిదాఖ్య మహాస్థలమున
నిమిదారాధిధాన వియతిని హరి దు
ష్టజన విదారి యుదారుఁడు
ప్రభలుఁ దవంతుండు భక్తపాలకుఁ డగుచున్ 285

తే.గీ. శ్రీవి ధామస్కృ ధర్మదక్షేత్రమందు
నలరు జగదీశ్వరుండు మురాంతకుండు
నట మనోహర మోహరంబైన దేవుఁ
డమరు శ్రీహరి కామేపహార్యయుండు 286

తే.గీ. శ్రేష్ఠమగు మధురాపురి క్షేత్రమందు
సుందరుండు మహాత్ముండు సుజన వినతుఁ
డచ్యుతుండు జనార్దనుఁ డాదిదేవుఁ
డమరు జన రక్షకుండు నారాయణుండు 287

క. గణ్యుండై సుఖదుండై
పుణ్యంబగు వృషభగిరిసఁ బొలుచు సుకృత నై
పుణ్య స్థితి గల స్వామి య
రణ్యుఁడు భక్తులకు [1]ప్రతిగిరా వర్ణ్యుండై 288

---

1 మూ. ప్రతిగిరా వర్ణ్యుండై

క. పంచ పవిత్రము శ్రీమ
ద్వర గుణ సుక్షేత్ర సీమఁ బరఁగుసు హరిశ్రీ
కర గుణుఁడు నాథ సంజ్ఞుఁడు
పరమాత్ముఁడు నిత్య భక్త పరిసేవ్యుండై 239

క. కురు కాఖ్యం దనరు మహా
పురియందు రమాసఖుండు పొలుపొందు సదా
దురితాటవి పవన సఖుఁడు
పరిపోషిత శరమఖుండు భక్త సుముఖుఁడై 240

క. శ్రేష్ఠ తరంబై తగు నా
గోష్ఠీపురమందు వెలయు గురుజ్ఞాన మతుఁడై
గోష్ఠిపతి ముని హృదయా
ధిష్ఠితుఁడు సుపర్వ గణ నుతి పద్మాండై 241

సీ. అవనియందు పావనంబగు ధర్మపురియనంబు
నందు రామవుఁడు శ్రయాముఁ దనరు
ధన్వి మంగళకర స్థలాన్వితుఁడగు శౌరి
పద్మ నేత్రుఁడు జగత్పతి దనర్చు
నమర కీర్తిమంతంబు నగు శ్రమర స్థలి
ప్రభుఁడు జలాధ్యుండు పరిఢవిల్లు
నల లోకమంగళంబగు కురంగమునందుఁ
బూర్ణేందు వదనుండు పూర్ణుఁ డొప్పు

తే. గీ. రహిఁ దలిర్చునందు సర్వజ్ఞుఁ డొక్క-
రుండు సర్వగుఁడగు విష్ణుఁ డుండు మతియు
ధాత్రిని బవిత్రమైన శుభద నదిగొంచు
నచ్యుతుఁడు గీర్తనీయుఁడై యతిశయిల్లు 242

చ. చిరతర భద్రదాయక మహేశ మహోచ్చ విభాసనంబునన్
ఎరనుత మా నవంతరయనంబునఁ బెంపగుఁ బద్మనాభుఁ డిం
పరయ నిహంబునం బరము బాత్రతకాది గొనంగుచుండు సు
స్థిరుఁడయి సంతతంబును విధిప్రముఖానుత వంద్యమానుఁడై 243

సీ. ఈ ప్రకారంబున నివి మొదలుగాఁ గల్గు
దేశదేశంబులఁ దేజరిల్లి
యున్న గ్రామ గ్రామములఁ బ్రతిమందిరం
బును సర్వాలయంబులను విగ్ర
హములందు సర్వేశుఁ డగు హరి వసియించి
తనదు పూజామాత్రమునను సకల
జంతు సంతతికిని సంతోషయుక్తుఁడై
ధన్యతఁ బరమ పదం బొసంగు

తే. గీ. నతుఁడు పరమునఁ గంటె వ్యూహంబు కంటె
సకల విభవంబు కంటెను సంతరాత్మ
కంటె నర్చావతార సాంగత్య మంద
కలవ [illegible]రుండు మోక్షం బొసఁగు 244

మ. ఇతర మర్త్యాకృతి విష్ణుభక్తములు స్రగ్గంధాంబరాలంక్రియల్
జరియింపంగఁ దదర్చిరాజ్యము ఘటింపంగల్గుఁ బుణ్యాత్మకుల్
దురతిక్రాంతమునైన మాయ నెమిం దోడ్తోన నిర్జించి త
త్పరమ స్థానము యోగి దుర్లభ మొగిన్ బ్రాపింతు రత్యంతమున్ 245

క. ఏయదే స్థానంబులను ము
ధాయతి సర్వాకృతులను సర్చింపఁగ నౌ
నా యా స్థానమె పరమం
బై యొప్పును నతఁడె పరము నగు విష్ణుఁ డగున్ 246

తే.గీ. అరయ సర్వ స్వరూపియై యలరు హరికిఁ
బరమధామాదికర్తయై పరఁగు హరికి
నూనతాధిక్యభేద మింతైన లేదు
పరఁగ సిద్ధార్థి వష్టాలవేత్రి పుత్రి 247

మ. సుఖదత్వ స్థిరి మోక్షదున్ జెలఁ చతుర్వర్గమ్ము సర్వాకృతిం
గని విష్ణున్ విభు నెవ్వఁడే నిలఁ దిరస్కారంబు గావించు వాఁ
డల ధర్మంబును సర్గమున్ మఱియుఁ గామాదుల్ దగం గొందకన్
ఖల వృత్తిన్ నరకంబు నొందు నిది విఖ్యాతంబు లోకంబునన్

వ. కావున సర్వ స్వరూపియును వాత్సల్యకారియునగు హరికి నొనర్చిన కైంకర్యంబు సద్యో మోక్ష ఫలసాధనం బని [1]దుస్తరంబగు సంసారసాగరంబు నవలఁ దరియింప నిశ్చయించు బుధులు సర్వ స్వరూపియగు హరి నర్చింతురు ద్వారి విష్ణు జ్ఞానాధికుండును మహాత్ముండును విశ్వ స్రష్ట

1 మూ. దుస్తరులగు

౬ చేడి న్నవ తారాంతర
గోదావిరచిత ముక్త కుసుమ సముదయ
శ్రీ దామ సమాలంకృతి
మోదాన్వితహృదయ భక్తకమార్తికరదయా 251

తోటకము శరణాగత సాదర చక్రకరా
కరుణారస సాగర కంసహరా
చరణాబ్జ నమత్సురశైలధరా
కురునాథభయాకర గోపవరా 252

గద్య [1]ఇది శ్రీ రాజగోపాలకృపా కటాక్ష వీక్షణ సంలబ్ధ పాండిత్య ధుర్యానవరతావిరతమందరాగాంచు సామ్రా ధౌరేయ స్వసమర్థతాకృత పటహ ధణంధణారావ విపరీత పతనదిల్లికాధీశ దుందభిధ్వాన కోలాహల హయూమద్ధ్వజాంక కనకదండికృత హింకలోఘాత సందీపిత ప్రతాప కీర్తి ప్రభావ కోనఅవంశపయః పారావార రాకాసుధాకర సీతారామరాజాయక పౌత్ర రమణయ్యాపాంక పుత్ర లక్ష్మమాంబా గర్భ శుక్తి ముక్తాఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్య జిత సుమబాణుండు బహిరి పామనాయక ప్రణీతంబైన భార్గవ పురాణంబునందు విష్ణుచిత్తు జననంబును నతం డారామ రక్షణంబు సంచేసి స్వామికి బున్పమాలికా కైంకర్యంబు సేయుటయును విష్ణుచిత్తులకుం దులసీవనమందు భూదేవి గోదా స్వరూపంబునం గన్యకయై ప్రాదుర్భవించి ప్రసన్నయగుటయు నతండు గృహంబునకుం గొని చని యా కన్యకను భార్యాసహితుండై పోషించుటయును నా యమ రంగస్వామియందుఁ బ్రీతిం జేసి యర్చాస్వరూపంబు లడిగిన నతండు నకల క్షేత్రంబులయందు నెలకొన్న విష్ణు నామంబులను దన్మాహాత్మ్యంబును జెప్పుటయును నను కథలుం గల షష్ఠాశ్వాసంబు సంపూర్ణము

---

1 మూ ఇతి

ఆ.వె. చిత్తమందు నితర చింతనంబు దొలంగి
యమ్ముల ప్రియయై లసుచు దివ్య
ఘనుని ప్రబంధములచేత శౌరిని
సంస్కరింపుచుండెఁ జంద్రవదన 5

సీ. అఖిలంబులైన యర్చావతారంబులు
శ్రీమంతములుచు భాసిల్లునట్టి
యారాధ్య రంగనాథాకారమే యమ్ము లం
టించుఁ దలంచి యాహ్లాదవృత్తి
నా రంగభర్తయే యాత్మభర్త యటంచుఁ
దలఁచుచు నెవేళఁ దత్పరతను
రంగనాయకు నంతరంగంబునను జేర్చి
యెంతయుఁ దచ్చింత నేమఱకయుఁ

తే.గీ. దన్మయస్ఫూర్తి నాతి గోదావధూటి
సకలశృంగారరసపేటి సతులమేటి
యతను శరకోటి భరకోటి గతిని పాటి
రాఁ యమాలోటి దగుచు మోహంబు కోటి 6

సీ. సప్తసెలాంతర స్థానంబు గనుఁగొన్న
శ్రీరంగగృహమంచుఁ జిత్తమందుఁ
దిగు హంసతూలికా తల్పంబు గనుఁగొన్న
భోగిశయ్య యటంచు బుద్ధి నుంచు
ఫాల విరేఖ పద్మశ్రీలఁ గనుఁగొన్న
పాదపద్మ మటంచు నలువుగాంచుఁ
గుసుమరాగ పరాగ విసరముల్ గనుఁగొన్న
హేమాంబర మటంచుఁ బ్రేమఁ జెందు

తే గీ వారి యా రీతి శ్రీరంగనాథు రావ
నంపదం రీతి వినియున్కిఁ దాఁ శ్రీతిఁ
జాదినట్లయి తోఁచు నా సూచనలకుఁ
గలఁతఁ జెందును నిజముగాఁ గాఁరయున్న 7

వ మఱియును 8

సీ వంపుచే హరిమీఁది తలఁపుచేఁ దనకోది
చెలులతో నాడదు కలుకకంటి
దాఁచే మదిలోని జాలిచేఁ జెంపుడు
రాచిల్కఁ బిలువదు రాజవదన
భ్రాంతిచే మోహ విభ్రాంతిచేఁ గెరలాడు
హంసలఁ గూడదు హంసయాన
కూర్మిచేఁ దాపంబు పేర్మిచే సరస స
ల్లాపము ల్సేయదు లాఁతాంగి

తే గీ యంతరంగ తరంగితాత్రంత రంగ
రమణ సాంగత్య వాంఛాపరంపరలను
దనరుఁ జెలువంపు దీవి నెత్తావిత్రోవి
యైన గోదామహాదేవి యంతసరివి 9

క పలుకదు పిలిచినఁ దన దయఁ
జిలుకయు చెలిమీఁద వింటి రంగారుమున్

తే. గీ. కువలయాంగుఁ గువలయగురు నిశలఁ
గువలయేశుని గోడ సద్గుణ వినోద
వాదరించెదఁ గరమంత సేదఁ దేర్చి
నే ననెడు రీతిఁ గువలయహితుఁడు దోఁచె 14

క. అంతట విమా గమేదన
నెంతయుఁ బరితాపమందు నింతిని సకియల్
గాంత లతాంత నితాంత వ
సాంతమునకుఁ దోడుకొని రయంబున నరుగన్ 15

చ. మరునికి నంతరాంతిక సమూహము గంధవహోత్కరుండు నం
చరునికి నవ్వనస్థలి నెసంగుచు హెంపుల నేఁచునట్టి పె
మరునికి నెంతయేన్ గుమడ మార్గముఁ బెంపు ఘటింపు వా నిశా
చరునికి భీతిఁజెంది సతి సంధియ మందగఁ గాంచి యంతటన్ 16

మ. విమలోద్యాన వనంబుఁ జేరి సతితోఁ బెంపొందఁగా నాడు త
త్కమలాస్యల్ చెలి మోహమెంతయు దెలిసి యారంతార నేత్రున్ మహో
ద్యమము నారాయణు రంగభర్తను సముద్యల్లీల దివ్యప్రభం
ధములం బాడిరి తచ్చరిత్రములు చిత్రస్ఫూర్తి వేర్వఁగన్ 17

క. శ్రీరంగవరుఁడు రక్షిత
సారంగ వరుండు ప్రోచు సంగతి నిన్నో
సారంగ నయన మది చే
సారంగను వందటిందు సదయుండు సుమీ! 18

సీ. అనపాయినిగఁ జేసి యపుడు లోకేశ్వరి
నాఁడు కృష్ణుని హృదయమునఁ [1]జేర్చె
భార్యయౌ భూదేవిఁ బ్రళయాబ్ధి వెడలిచ్చి
యుచిత సౌకర్యాప్తి నుద్ధరించె
సీతకై జలరాశి సేతువు గట్టించి
ఐంద్రైశ్వర్యం హరించి పత్ని నేలె
శిశుపాల ముఖ్యుల [2]శిక్షించి సందేశ
మొనరించి రుక్మిణిఁ బాణి గ్రహించె

తే.గీ. మఱియు జాంబవతి ముఖ్య యాదవతులఁ
బెక్కు సాహసములు సేసి పెండ్లియాడె
వల్లె యారంగ శౌరి దయావిహారి
నిన్ను వరియింపఁడే నేఁడు నిరతాక్షి 19

క. నరకాసురుఁ ద్రుంచి తనుం
బరిణయ మొనర్ప సుగుణమాన్యల ధరణీ
శ్వర కన్యలఁ బదియా ఱు
స్ఫురితాన్ బదియాఱువేలఁ బ్రోవఁడె ప్రీతిన్ 20

ఉ. గోపకభార్య లయ్యుఁ దనుఁ గోరిన పల్లవ పల్లవాధరల్
దపిత కామ సౌఖ్యములఁ దృప్తినిఁ బొందఁ గణించ నందిసి
ప్రాపిత కుంభ పుణ్యములఁ బాటిలఁ దే సరకీయలందె నేఁ
డేపున స్వీయయైన నిను నేలఁడె రంగవిహారి యంగనా 21

---

1 మూ. శేర్చి 2 మూ. సిక్షించి

సీ. ప్రేమచె మును సత్యభామకు వరుఁడయి
ధరణికి పారిజాతంబు తేఁడె
మత్స్యయంత్రము నేసి మహిపాలుర జయించి
లక్షణఁ దేఁడె సులక్షణముగఁ
గాళిందితటియందుఁ గమలాప్త నందనఁ
గాంచి మోహింపఁ గాంచఁ డయ్యెఁడె
పుంగవావలి నృపపుంగవావలిఁ ద్రోచి
యల సుదంతను వివాహంబు గాఁడె

తే.గీ. పరఁగ రాధిక చెప్పిన పనుల చేసి
యొసఁగ మేనత్త మేనత్త సేయఁగొండె
వారి కిటు లోఁబడైనట్టి వాఁడు నేఁడు
రామ వరియింపఁడే నిన్ను రంగశాయి ౨౨

క. ఇల్లాలుగ నేఁడె మో
హోల్లాసం బెసఁగ సముచితోత్కం జేరన్
భిల్లసలిం గుసుమశరుని
భల్లగలిన్ బొందు దానిఁ బ్రార్థనతోడన్ ౨౩

ఉ. అంటుల పెట్టెఁ దెంతటి సమర్థుఁడు చందురుఁ డెంతవాఁడు పి
క్కిలి చలిగాలి యెంతటిది కీపంబున్ రొదసేయఁ డెక్క గుం
పుల బలమెంత పేర్కొ పరిపూర్ణ మనస్థితిఁ జేసి నిన్ను నీ
వలరుహ లోచనుండు సరసస్థితి భామినిఁ గాఁగ నెంచినన్ ౨౪

ఉ అమ్మహితాత్మ సుందరుం డాతని వైభరి నా ప్రభావమున్
సమ్మతిఁ జేసి యే పురుష సంతతికైనను గల్గఁదా మహిం
దిమ్మహి నిన్ను భామినిగ నేలిన యీడు పురాకృతైక పు
ణ్యమ్ము గణింప శక్యమె సమస్త జగంబులయందు సుందరీ 25

క తరుణీ పురుషులలోపల
నరసిరుహాక్షుండు రుచిరసౌఖ్యం బగుటన్
వరియింపఁగ నాతండు నినుఁ
బరిణయమం గనుటకన్న భాగ్యము గలదే 26

ఉ చక్కనివాఁడు సర్వగుణసంఘములోపలఁ బారువార్తిఁ దెం
పెక్కినవాఁడు నా ఘనుఁ డహీనమతిన్ విరహార్తిఁ జేసినన్
మక్కువతోడులన్ దనరు మానినిగాఁగ వరించినప్పుడే
చక్కంటమ్మ నీ సుకృత సౌఖ్యము నెన్నఁగ శక్యమౌనటే 27

క ఆ మహిలో రంగేశం
ప్రేమముతో భర్తగాఁగఁ బేర్కొని యుంటన్
యామతి నెఱుఁగుదు మో క
న్యా మాతోఁ దెల్పరాదె యప్విధి చేర్కన్ 28

## గోదాదేవి రంగనాథుని నిందాపూర్వకముగా స్తుతించుట

మ అని రంగేశ్వరు దివ్యమంగళ చరిత్రానేకముల్ చెప్పినన్
విని గోదాంగన యంతరంగమున నానిర్వార సమ్మోద య
య్యును నిందాస్తుతి పూర్వకంబుగను మోహోద్రేకయై రంగరా
యని నానా గుణముల్ సఖుల్ వినఁగ నెంతో వింతగా నిట్లనెన్ 29

సీ. అలయక చందనం బలఁదరె నెమ్మేన
ఫణివెఱలార యీ పర్వతచరు
పరసుమశయ్యఁ బవళనాన మంచరే
భ్రమర విభ్రమ సదపాంగలార
రామువేణికిబి నేత్రములందు నుంచరే
రాకాస్యలార కైరవ నిచయ
రామాభిరాము కామప్రదమ్మునందు
రాణింపరే పికవాణులార

తే.గీ. యనిన నొకయింతి కందాయుకొనియె నొక్క
కొమ్మ కన్గవ చేఁ గప్పుకొనియె నొక్క
సకియ వక్త్రంబుఁ బట నప్పుగిల్లె
నవ్వునొక యింతి దా మాటలాడదయ్యె 48

చ. అనుచుఁ బరస్పరోక్తుల సమంచిత పేలల నింతులాడ న
ప్పనిరతు నూరకున్న [1]మెఱ దారిక లోచను మన్మథార్తిచేఁ
గనలుటఁ గాంచి కొందఱు గుణాంతలు చెంతను జేరి యామెతో
ననిరి వయస్య నీ హృదయమందలి మర్మము చెప్పరాదటే 49

క. బాలా యీ విరహము నీ
కేలా క్రీలా నహాయుఁ డేలుకొనెడు నిన్
లీలా విహారుఁడై యే
మేలాయె నటంచు వంచి [2]మెంఱపుల దమలోన్ 50

---

1 మూ. యద 2 మూ. మెంఱలు

సీ. శ్రీరంగపురి కంబుహార లీలఁ దనర్చు
 నుభయకావేరికాభ్యుదయ మెంచి
రంగభర్తకు విహార వనంబునాఁ దగు
 మహనీయ కణ్వాశ్రమంబు గాంచి
కలువ హారంబులై కావేరిలో నుండు
 దశ మహా పుణ్య తీర్థములఁ జూచి
శ్రీ విధానంబు విమాన సంజ్ఞకమైన
 యా క్షేత్రమునకుఁ బ్రదక్షిణించి

తే.గీ. సప్త భువనాళి రాజ్య రక్షణకుఁ బోల్పు
సప్త దుర్గంబులను బోలె జగతి సొగసు
సప్త సాలంబుల దిరిగి సన్నుతించి
విష్ణుచిత్తుండు భక్తివరిష్ఠుఁ డగును ౬౩

చ. ఘనతర రత్నకుట్టిమ నికాయ విరర్జితంబు రంగనా
థుని మణిహేమ సౌధము దోఁచ నటం బ్రతిగేహ సీమలం
దనయము దద్మకుండుఁడు నిజాంబయ పంత్రంతోడ నింట నిం
టను గనుపట్టు వేడుక ననందగు వీథు లసర్గళంబులై ౬౪

సీ. విరజానది ప్రవాహ నిరసించు ధవళోర్ధ్వ
 పుండ్రముల్ నుదుట విస్ఫూర్తి మించ
నరయువారి యుగంబు హరియించు భుజములం
 దగు శంఖ చక్ర దివ్యాంబులర

వ. అట్లగు నన్మహానుభావుం గూర్చి యమ్మహీసురుండు నిగమ నిగమాంత సూక్తులం గొనియాడి నిటలతట ఘటితాంజలియగుచు మఱియును 73

## విష్ణుచిత్తుఁడు రంగనాథునిఁ బ్రార్థించుట

క. నరసింహరంగ రంగా
నిరుపమకరధృతరథాంగ నీలఘనాంగా
గరుడవరపక్షితురంగా
కరుణాశ్రితజనతరంగ కలుషవిభంగా 74

క. అని యద్దేవుని నెన్నుచు
ఘనుఁ డాభూసురుఁడు పల్కెఁ గంజదళాక్షా
వినుఁ బ్రార్థించెద నా మన
విని విని నను బ్రోవుమయ్య విశ్వావమయా 75

ఉ. వలపుగ నా కుమారిక యొనర్పు తపం బది యెట్టిదో కదా
తెలియఁగరాదు మాకు బహుదివ్యములైన ప్రబంధ సూక్తులన్
జలజదళాక్ష నిన్ను నరసస్థితిఁ జేర్చ్యాని సన్నుతింపుచున్
బలుకుచునుండు నామెదగు భావము నీ వెఱుంగ నేర్తువే

క. మా యోగములందు లే
దే యోగము కాని పంకజేక్షణ యావ
ద్యాయతలోచన దలఁకెన్
రా యెద స్మరియించు నిన్ను నిర్వ్యాజగతిన్ 77

సీ. నళినాక్షదామ మున్నతి వేము ధరియింపఁ
దాఁ బద్మహారంబు దాల్చుచుండు
నే మూర్ధ్ని చంద్రుఁ బ్రాముకొనుటయుఁ దాఁ
గరిమఁ గస్తూరి తిలకంబుఁ దీర్చు
నవయంబు మేము దిక్ప్రపంచోత్తిని
నిను బెక్కుఁ దానిన్ను నిందసేయు
నాయ్యన మే[1]ముత్తరియ్య కయ్య గొనుటఁ
బఠింపఁ దాఁ గవ్వపొన్నుఁ జెందు

తే.గీ. మేము దృఢతర తనువులమై మెలంగఁ
దాఁ గృశాంగిగ నుండు మద్దామ వృత్తి
నమ్ముగాక రచింప నే గానుభూతి
మాకుఁ దెలియంగరాదు లోకైకనాథ 78

శా. ఆ రంభామణి యందు యోగమున కో యబ్జాక్ష యేనాఁటికిన్
నీకేమో దయరాదు గాన నిఁక నిర్దేశ్యత్వముం బూని య
ట్లోకస్ఫూర్తిని దానిఁ బ్రోవుము మహాత్మ్యత్వంబు వాటిల్లఁగా
లోకంబందు నీ సమానులుగ వేల్పుల్ లేరుగాఁ జూడఁగాన్ 79

క. మును నీ వొసఁగిన వాక్యం
బును జేసి నిరంతరంబు పూఁబోఁడి నినున్
మనమున దలఁచెను యోగం
బున నున్నది భక్తిఁ గొని సమున్నత మతియై 80

---

1 'ఉత్తరియ్య' మసాధువు, కాని ప్రాసయతియందుఁ బ్రయుక్తము 'ఉత్తరీయ' శబ్దము సాధువు

చ. అని తన ఛాందసోక్తి దెలియంగ వచించిన విప్రుఁ గాంచి య
వ్వనజదళాక్షుఁ డిట్లనియె భామిని పూనిన యాగ మే నెఱుం
గని దినమంత యేనిఁ గలుగంగఁ దనుప్రదు గాన నీ మనం
బునఁగలయట్ల నయ్యెడు సమున్నతిగా ధరణీసురోత్తమా 81

తే.గీ. వసుధ మను ౨ కొసంగిన దాక్షిణరతి
సత్య మేను రచింతు సుతాప్రహాలు
నీవు చనుమన్న దో రంగనెక వల్క
బాలకించి ద్విజుఁడు సమాహ్లాదుఁ డగుచు 82

క. వనజాక్షు నాజ్ఞ గైకొని
ఘనుఁ డగు నవ్విప్రుఁ డందుఁ గల్గిన శేషా
శనముఖుల యనుమతింగాఁ
జనియెన్ నిజనగరమునకు సత్వరలీలన్ 83

ఆ.వె. అందుఁ దొంటిరీతి నవ్విప్రుఁ డిత్తండు
మాధవునకుఁ బిచ్చు మాలికలు స
మర్పణంబు చేయు చలరుచో గోదా స
తీలలామ దేవదేవుఁ డలఁచి 84

క. అనుదినము మోహవారిధి
మునిఁగిన రౌతుమ వయస్య మురవైరిని గాం
తుని గాఁగ నెన్నికొని యుం
డెను మదనజ్వరము మది గతింపఁ గంతగాన్ 85

## రంగనాథుఁడు సపరివారంబుగా ధన్వీపురంబున కేఁగి గోదాదేవిని పరిణయ మాడుట

క. ఈ రీతిని గోదా క
న్యా రత్నం బెన్నుచో ననంతుఁడు భువనా
ధారుఁడు సముదారుఁడు రా
వేరీ నిలయుండు రంగవిభుఁడు ముదమునన్ 86

సీ. అనుదినంబు మహోత్సవంబుగ నిత్యయుక్తులు
బ్రహ్మరుద్రాది నిర్జరచయములు
బ్రహ్మర్షులును సిద్ధపన్నగ చారణ
గంధర్వు లప్సరోగణము లర్థి
సేవింప సంతోషచిత్తుఁడై వంది సం
స్తూయమానుఁ డగుచుఁ దోరములగు
మహితాతపత్ర చామరముల తోడుతఁ
బరిశోభితుఁ డగుచు బరిఢవిల్లి

తే.గీ. వైనతేయునిపై నెక్కి పరమధామ
ధారి తూర్య స్వనములఁ బొల్పార నతిశ
యంబయిన ధన్విపురమున కరుగుదెంచె
నవని గోదాసతిఁ బెండ్లియాడుకొఱకు 87

చ. ఘనతర దేవదుందుభి నికాయ నినాదము బ్రహ్మాండమేఁ
పునఁ బరవంగ సర్వజనంబులుం గొలువంగ నర్తి సెలంగ సొం
పున దనరంగ రంగపతి మోదముతోఁ దన కన్యకై రయం
బునఁ జనుదేరఁగా సరసపూరిత భూరితరానురాగుఁడై 88

క. ఘనుఁడు మహాయోగీంద్రుం
డనుపమమతి విష్ణుచిత్తుఁ డప్పుడు శౌరిన్
దనుఁ గొలువంగ నెదురుగాఁ
గని పలుమరు నతి యొనర్చె సంహృష్టుండై ౪౯

వ. అంత ౫౦

చ. ఘనతర భక్తవత్సలుని గరుడగాముని దివ్యాంశుకా
ఢ్యుని రమణీయ వైభవు సముజ్జ్వల గాత్రుని రంగభర్తఁ దా
వినయము చేసి లోకాని యభీష్టమతిన్ సురరాజమందిరం
బునకు సమానమైన యొక పుణ్యగృహంబునఁ జేర్చి యచ్చటన్

తే.గీ. వేఁగ విద్వత్తుఁడగు భూసురోత్తముండు
భాసురంబగు కనక సింహాసనంబు
నందు శౌరినిఁ జేర్చి పాద్యాదులను స
పర్య గావించె నిగమోక్త పద్ధతిగను ౫౨

తే.గీ. అంతట సుగంధ పుష్పాక్షతాదులను స
లక్షణంబుగ వేది నలంకరించి
యందు వహ్నిఁ బ్రతిష్ఠించి యాగమోక్త
సరణి హోమంబుఁ జేసి భూసురవరుండు ౫౩

చ. ఉరుతర హారకింకిణముఖోజ్జ్వల భూషణ భూషితాంగుఁగాఁ
బరఁగిన లావణ్యామణిని భూసురహా[1] (మముఁ జేర్చి సన్నిధిన్
పరగుణయుక్తుఁ) దోడుకొనివచ్చి సుమంత్ర పురస్కృతంబుగా
గరిమ నొసంగె భక్తజన కల్మషహర్తకు రంగభర్తకున్ ౫౪

---

1 మూలము కొంత క్రిమిదష్టమగుటచే (బ్రాకెట్ట భాగము పూరింపఁబడినది

తే.గీ. అంతరంగేశ్వరుండు గోదాభిపాతి
పెండ్లిఁ [1]రాతని విడుకొని భవ్యమతినిఁ
గలయఁగా [2](రాజ) హోమాదికము సమస్త
మును యథావిధిగా సల్పి మనర మించి 95

క. పరమాలంకృతి సతితో
నిరుపమ మతి నగ్నిహోత్రునిఁ బ్రదక్షిణముం
గణపి ప్రమోదంబొందెను
సరసీజాక్షుండు రంగశౌరి శుభముగాన్ 96

చ. పరమదయాఢ్యు నచ్యుతు వివాహముఁ జూడఁగ వచ్చు నా సరో
వరముని ముఖ్య పద్మభవ వారిజవైరికిరీట శక్ర ది
గ్వరులను విష్ణుచిత్తుఁడు వివాంతరోత్తిని సమ్మతించి యం
దఱఁ బరితృప్తులన్ సలిపె ధాత్రిపయిన్ జను లెంచ నయ్యెడన్ 97

మ. సురతాసార ముని ప్రవృత్యనఘ [3]సంస్తోత్రాఢ్యుఁడైనట్టి శ్రీ
హరి రంగేశ్వరుఁడాత్మ భృత్యరతితో నవ్విష్ణుచిత్తున్ శుభో
త్కరుఁ సద్ధాత్రి వసింప నాజ్ఞయిడి గోదాదేవితో నేర్కతోఁ
బరమప్రీతినిఁ జేరెఁ దాపపటలీభంగంబు శ్రీరంగమున్ 98

వ. అంత 99

సీ. లలితాత్ముఁ డగుచు నీళా పద్మ కన్యకా
గోదాంగనలతోడ గురుమనీషఁ
గైకొని నిత్య సూరిశ్రేణిఁ జెంపొంది
కంతు సామ్రాజ్యక గరిమఁ జెంప

---

1 మూ. రాతిన 2 మూ. లేదు 3. మూ. సంస్తూయాఢ్యు

రంగనాథుఁడు ఫణిరాజ శయానుఁడై
యుండెఁ గావేరికా నిలయుఁడగుచు
నందు నుండు జనుల కందఱికిని దయా
రసమునే మోక్షం బొసంగుచుండు

తే గీ దమ్మహాత్మకుఁ డాది మధ్యాంత రహితుఁ
డవ్యయుం డప్రమేయుం డనంతుఁ డజుఁడు
నిత్యముక్తాదినుతపాద నీరజుండు
రమ్య ఫలదాయకుండు నారాయణుండు 100

వ అంత మహాభాగుండును రంగ [1]భూపతి స్వరూపుండును నగు విష్ణుచిత్తుండు తత్కైంకర్యపరుండును దాస్యైకజీవనుండును నగుచు నందధివసించెఁ గలికల్మషాపహంబును ముక్తిప్రదంబును నగు శ్రీవిష్ణుచిత్త యోగి యేతచ్చరిత్రం బేనరులేని పఠియింపుచున్ వినుచున్ వ్రాయుచున్ బొల్తు రా నరు లిహత్రైశ్వర్యంబు లనుభవించి యంతంబున శ్రీశౌరిపదంబుఁ జెందుదు రని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తరఖండంబునందలి యేకోనత్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నిఖిల ప్రజ్ఞాధురంధరుండగు వరునకుం జెప్పి వెండియు నిట్లనియె 101

తే గీ పరమభాగ శ్రీమంత గురుతరాఖ్య
యపరకథ యేను జెప్పెద నాలకింపు
వినెడు వారల కద్భుతంబును దనర్చు
దాని నేర్పుగ మగునట్టి మానసమున 102

1 మూ భూపతీశ్వరుండును

## హరిశార్ఙ్గాంశమునఁ బరకాలుఁడు జనించుట

క. పరకాల మహాయోగిఁ
గోరి దుష్ట సుకర్మములను నొనఁగుట నిత్యం
బరయఁ గత నీవు విను శ్రీ
హరి భక్తారాధనమున నయ్యెడు దానిన్ 103

సీ. రమ్యంబులై యనురాగంబులగుఁ తోఁ
చేరంబులందు సుదీప్తమగుచు
లలితమై తగుఁ గమలాపూర్ణనగరంబు
మణి మందిరంబుల మణి విచిత్ర
తోరణంబుల మణిద్వార వేదుల మణి
కుట్టిమంబుల మణిగోపురముల
మణిసాలముల మణిమంటపంబుల మణి
[1]చంద్రశాల మణి సౌధములను

తే.గీ. నిర్మలోదక కాసార నికరములను
సరస పుష్పప్రసూనవన సంతతులను
ధర్మ విజ్ఞాన పురుష ప్రతానములను
నధిక లక్ష్మీ విభవము నలర నందు 104

క. సురుచిరమగు హరిపద పం
చయమునివాసమునఁ గార్తికమున జనించెన్
బరకాల సంజ్ఞుఁడగు ముని
హరిశార్ఙ్గాంశగుఁడు కృత్తికార్క్షమునందున్

1 మూ. చంద్రశాలముల

క. భగవత్ప్రియుఁడగు నా మునిఁ
దగఁజిత మతి వృద్ధిఁ బొంది యప్పుడు పరత
త్త్వగుఁ డయ్యెఁ యా గతిఁజెడఁ
దగు సత్యశధర్మ వేత్తయగు చనయంబున్ 106

సీ. ధర్మజ్ఞుఁడును దయాతత్పరుండును నీతి
శాస్త్ర విశేష విశారదుండు
సనయుండు సర్వశాస్త్రోక్తి విదుండును
సంగర మార్గ విచక్షణుండు
విమల గుణుండును నఖిలలోక ప్రియుఁ
డను గీర్తి పరుఁడును (¹మను విహితుఁడు
నవలిన చిత్తుండు సముదిత) మంత్ర వి
దక్షణ రతుఁడును సత్యవాది

తే.గీ. యగు పరాంతక మౌని యత్యాదరమున
ధన్యుఁడగు బోధరుణీపాల రాజ్య
భార మెల్లను దనదు ప్రభావమున వ
హింపుచుఁ దనర్చె జనముల కింపుగాగ 107

క. నిరతం బాబోధమహీ
వరునకుఁ బ్రియమైన మంత్రివర్యుఁ డగుచు సు
స్థిర మతిని వెలయు చుండును
గరుణాకరుఁడగు పరాంతక మునీంద్రుఁ డొగిన్ 108

1 మూ లేదు

క. ఆ సమయంబున నాగ పు
రి సాన్నిధ్యమునఁ దవరు శ్రీకర నళినీ
వాసము బంధూల్లాగము
కాసారము శ్వేత సంస్థితము భాసురమై 109

మ. అరవిందంబులఁ గైరవంబుల సముద్యల్లీలమై మ్రోయు సు
స్వరమౌ భృంగనికాయ మంబురవహ వాలంబుజాళిం గామించి యం
బరమున్ వెన్నుని వీఁకఁ గా నతఁడు ప్రేమం గౌఁగిటన్ జేర్చెనాఁ
బరగెన్ బింబిత పుష్కరంబగుచు సత్పద్మాకరం బున్నతిన్ 110

సీ. కల్హార ధూళికా కల్పిత భూరుహ
పటలి ప్రవాళ విభ్రమ మొసంగ
స్వ్ర గంధర్వ సమాగత భ్రమరాళి
శరరమాసిత మతి సరము నగుప
సరసిరుహావాస చక్రవాకోన్నతి
రస దేవతా కుచ ప్రతిభ మించ
రాజిత క్రేంకార రాజహంసచ్ఛట
[1]ప్రాదుర్భవార్ణవ పటలి గాఁగఁ

తే.గీ. దనరుఁ జందన కుంద మందార పీత
జంబు జంబీర ఘుసృణ రసాల సాల
పనస వంజుళ ముఖ తరు భాసమాన
దైన శిఖరంబు శ్వేత సరోవరంబు 111

---

1 మూ. ప్రాదుర్భవాతార్క

## భాగవతాగ్రణికిఁ గుముదవల్లి యను కన్య లభించుట

క. వికసిత కల్హార జాత
ప్రకరంబగు నా సరోవరమునందు సము
త్సుకమగు కుముదాంతరమునఁ
బ్రకటమతిం దొరుకు నొక్క బాల నలినన్. 112

చ. ఘనతర పద్మరాగ రుచి గల్గిన హస్తపదోదరంబులం
దనరి పయోధర స్థితి నొనర్చు తటిల్లత ముత్రియోచు ని
జనముల కద్భుతం బొదవఁ జారుతర ప్రతిభన్ రసాతలం
బునఁ గల నీరజస్థలిని బొల్చిన దైవతి యంచు సుందరిన్ 113

క. వనరుహ పత్ర విశాలా
క్షిని యరుణాధరను భృంగచికురను సుకరన్
గని యొక భాగవతాగ్రణి
యనపత్యుఁ డపత్యకాంక్ష ననుమోదితుఁడై. 114

క. నెవరున నవ్బాలం గొని
ఘనతరమతి నతఁడు నిజనికాయంబునకున్
జని భార్యకొసఁగె నపు డా
వనితామణి దానిఁ బ్రోచె వాంఛాపరయై 115

చ. దిన దిన మా తలోదరి యదీర్ఘతర ప్రతిభా సు[1]గణ్యయై
యనుపమ సుందరత్వమున నొప్పదమై తనరారలో ముదం
బునఁ గని తల్లిదండ్రులు ప్రపూర్ణ మనస్కత నుండ రక్తితో
నెవయఁగ దామ గాంచు ధన షీ సుదతీమతిగాఁగ నెన్నుచున్ 116

---

1 మ. గుణ్య

సీ. తన కైశికము రీతి ననయంబు విఖ్యాతి
నింద్రనీలపు భాతి నీసడింపఁ
దను కన్నుఁగవ తీరు ఘనతర ద్యుతిమీరు
సారసంబుల దారు గేరడింపఁ
దన మేని తీగసంచు వనుపమంబుగ మించు
ఘనగతంబగు మించు ఘనత డింపఁ
దన మోము సిరిసొంపు ననురాగమునఁ బెంపు
గల యిందుకలగుంపు రవతు నింపఁ

తే.గీ. దనరు వనమాన సుందరతా విధాన
మధురతర గానవిపుల సమ్మద విధాన
మత్తగజయాన భాగ్యాయమాన మాన
వైభవానూన యా బాల వసుధలోన 117

ఉ. అడుగుల తేఁటిగుంపులకు దానల పెట్టును మోముల్గు నే
ర్పడఁగఁ జకోరపంక్తి కనురాగ మొసర్చును గైశికద్యుతుల్
కడుఁ బ్రియమున్ ఘటించు ఘనకాంతిగా తీగా వగగాఁగ నెమ్మికిన్
పడఁతుకఁ జొంకి జగతిపైఁ గల వామలు కెంద తేసియున్ 118

క. మొగమా శశి కన్నుం గో
యగమా రాజీవతతి సమంచిత కోకీ
యుగమా చన్గవ యసితో
రగమా నూఁగారు నచ్చిరా మానినికిన్ 119

క. కరములు కమ్మలు కమలా
కరములు పొక్కిలి విలాసంబాక దిశా
కరములు నెమ్మోము కుచా
కరములు చూడ్కులు కళాంకకరములు నవ్వుల్. 120

ఉ. పలుకులు పంచదారలు విలాసిత హాసవిలాస మిందుకాం
దళుకులు వాలుఁజూపులు మదారతిమించిన పద్మరాగ పూ
ములుకులు మేనికాంతులు సమున్నతి జాతి సువర్ణవర్ణముం
గులుకులు గర్గ సీ కలికి గుబ్బలు గుబ్బలు లబ్బురంబుగాన్ 121

సీ. పగడాల నగరాలు బిగఁబాలుగాఁ జేలు
వాలారు పెదప్రవాళరుచుల
చలికంపు మనకెంపుగంటొంపుల హసింపు
నింపుఁ బెంపగు నధరంపు సిరులఁ
దొగరెమ్మఁ దొగదెమ్మ నొగి మున్నుగాఁ దున్న
మిన్న ?గ్గుల గొన్న కన్న గవల
చిగిరెల నడ వాడు సొగసూరఁగాఁ దోడు
ఏదుఁ దొల్చారు నూగారు నిగల

తే.గీ. వంతుఁ గల్యాణ రుచిర లీలాహవేళ
పృథు తరోల్లాస సుకర రంపేయబాసు
మహిత సౌందర్యగుణపేటి మదనపేటి
గరు ఘనామర తరువల్లి కుసుమవల్లి 122

క. ఈ విధమునఁ దనరారెడు
నా వామాక్షిమణి మహాసుందరతా
ద్యావిల శీలాది గుణము
లాప్తవ్వవ పారిజాత మాలించియటన్ 124

ఆ.వె. ఆ మృగాక్షియందు నాసక్తమగు మది
గలిగి సత్వరంబుగా నతండు
నన్ను శుభదమైన నాగపురంబున
కేగు డెంచె నన్ను డించెనంగ

తే.గీ. అందుఁ గొన్నాండు నయ్యరవింద గంధి
జనకుఁ గూర్చి [1]వరాంతరమని ద్వితీయ
కన్య మా కిమ్మటంచుఁ బ్రార్థిత మతిని
యాచనము చేయఁగా నమ్మహామహుండు 125

క. ఇం దర్ఘ్యాసన పూజ్యం
బున వరాంతర మునీంద్రుఁ డాతిం దినము
జ్వలిత మనస్కుం డగుచున్
బలికెఁ గరాబ్జముల మొగిచి భక్తియుతుండై 126

చ. అనయము నెవ్వఁడేని గమలాయతలోచన భక్తుఁడైన వా
రిని నొకవేయిమంది దరిద్రి భుజింపఁగఁ జేసెనేని యా
ఘనునకు సంద చక్ర పరికల్పితవాహన కే నొసంగెదన్
మనవ న సంతసించి యనుమానము సేయక కన్యకామణిన్ 127

1 మూ. వరాంతరమున

చ సురుచిర ధర్మకాంక్షి నగుచున్ ముని నే నొనరించువట్టి ను
స్థిర యగు నీ ప్రతిజ్ఞ మునిశేఖర నీమదిఁ దప్పనేని ని
ర్భరమతి నట్టనేను నలుపంగలవార వటంచుఁ జేసి యా
తరుణిని విష్ణుభక్తి గల తామరసాస్యను సంగ్రహింపుమా. 128

తే గీ దీక్షిత గుణానుభూత వయో విలాస
విభవరేఖా సమాఖ్యాత శుభసమేత
భాగ్య విఖ్యాత నిస్తులభావ జాత
నీ తరుణిఁ గొమ్ము మునినేత యింపుచేత 129

## పరకాలుఁడు దానచేసి కుమారవల్లిని పెండ్లాడుట

క అని పరమ భాగవతమణి
యనుపమ గుణయైన యాతఁ డాడినచో న
మ్ముని వర్యుండు పరాంతకుఁ
డనియెన్ సంతుష్టిఁ జేసి యా ఘనుతోడన్ 130

తే గీ ఇంపు మీఱంగ నే దాస యిత్తు నీకు
పాలితింపుము నా వాక్య మనవరతము
నంబుజదళాక్ష భక్త సహస్రకంబు
నెంచి భుజియింపఁ జేసెద నిద్ధచరిత 131

క నే పాటిన వాక్యం బో
పౌరేశ్వర సత్యముగ సమంచితగతి నీ
మానసమునఁ దలఁచి నీ
సూనను నా కొసఁగు మతులశోభనవేళన్ 132

క. భగవంతుని గాద్గాంచిన
పగటుగ నన్నింది మను ప్రపన్నుఁడనగు నా
కగణితమతియగు నీ సుత
పొగ డొంద నొసంగి యధికపుణ్యము గనుమీ ౧౮౩

క. అని పల్కిన నమ్ముని యా
ననుమతిఁ దన తనయ నొసఁగఁగఁ బరాంచకుఁ డిం
పునఁ గైకొనియె విధానం
బునఁ బరిణయ సరణి మోదమున నిర్ధనుఁడున్ ౧౮౪

పరకాలుఁడు నిరంతరము వేయిమంది భాగవతులను భుజింపఁజేయుట

తే.గీ. అంత భార్యా సమేతుఁడై యధిపుఁ డిందు
యుతుఁడునై పరకాలుఁ డీక్షిత వలంబ్ర
తంబగు స్వకీయపురిఁ జేరి ధన్యమైన
యాత్మ గృహముఁ బ్రవేశించె నంఘమతిని ౧౮౫

వ. అప్పుడు భర్తృసేవయగు భార్య పరాంతకు నుద్దేశించి వందనాక్షిగ
వస్త్ర స్రక్చందనాద్యర్ఘ్య భూషణంబులంజేసి భక్తివలన నమ్మదినంబు
భాగవత సమ్మానకంబు సమర్పించి పిదప షడ్రసోపేతంబును స్వాదు
కృతంబును భాగవత భుక్తశేషంబును నగు చతుర్విధాన్నంబు భుజియింప
వలయు నట్టి దదర్పిత రాంబూలవస్త్ర విశేషంబులంగొని గ్రహింప
వలయు నని పల్కిన పల్కాలించి కోశస్థానంబున కధిపతియగు భూపతి
యును వైష్ణవులగు తన్నందనులును లోకంబునఁ ద్వితీయంబగు పదా
ర్థంబు భుజియింతురు గాక యన్న త్సంపాదితంబగు పదార్థంబు భగవద్భా

స్వభాగ్యని యోగంబగుగాక యని సంస్మరింపుచు ననవరతం బట్లనే గావింపుచుఁ దదీయదాస్య నిరతుండును సంప్రాప్తమానసుండునునై మహా భాగుండును మహా భాగవతోత్తముండును నగు పరకాలుం డివ్విధంబున మహాత్ములగు భాగవతులకు గైంకర్యంబు చేయుచున్న యెడఁ జోళమహీశ్వరుం డప్పరకాలుం డంతయు నెఱింగి నన్నుల్లంఘించి నిబంధనంబు వైష్ణవులం బోసంగుచున్నవాఁడని క్రోధసంరక్తలోచనుం డగుచుఁ బరాంతకుని మదంతికంబున కతి రయంబునఁ దోకొని రండని దూతల నాజ్ఞాపింప వారు వేగంబునం జని నృపశాసనం బతని కెఱింగింప నతండు వారి నిరాకరింప నా దూతలు మగుడ నరుగుదెంచి నృపున కెఱింగించిన

## చోళమహీపాల పరాంతకుల సంగరము

క. పృథివిపతి క్రోధార్తుండై
చతురంగ బలములతోడఁ బయ్యనఁ జని యు
ద్ధతిఁ బరకాలపురంబు న
పిత విక్రముఁ డగుచు గదిసె మేదిని గలఁగన్. 187

క. భావిత భేరీ భాంకా
రావంబులఁ దూర్యములు నిరావంబులు హే
షావహ తురంగ సంఘం
ధావనములు మిన్నుముట్టఁ దగఁగఁగఁ జేసెన్ 188

క. ఇంపూర్ణవ ముప్పొంగిన
నలుపుర చోళాధిరాజ నానాసైన్యం,
బలు పరకాలుని నగరము
వలగొని ధైర్యంబు దేసి వర్తిల్లె నటన్. 801

చ. తనపురిఁ జుట్టుముట్టిన యుదగ్ర బలాఢ్యుఁడు చోళభూపతిన్
విని పరరాజుఁ డాగ్రహ నివేశిత మానస మూర్తి యౌచుఁ దెం
పున వెడలెన్ మహోగ్రబలముం గొని తాను నృపాలుఁడో రణం
బున నలుపంగ సర్వజనముల్ వెఱఁగందఁ బ్రతాపశాలియై 140

మ. అతి నిస్సార పరంపరారవ సముద్వేల్లంబులైఁ బొల్చు న
ద్ధర తంతీరవ రావముం గలుగ యుద్ధామ ప్రతాపోద్ధురై
క్షితినాథోత్తమ వాహినీనికర ఘంటీభూత ధాత్రీస్థలిన్
ధృతిమైఁ బొల్చె నిరంతరుండు పయదర్పభూత చేతస్కుఁడై 141

సీ. అద్రిహేషంబు లిట్టట్టుగా విందు హే
షారవంబులు గల సైంధవములు
సర్వ సర్వంసహా చక్రముఁ దలకిందు
ఘదమద్దనము గల భద్రకరులు
మధ్యందినార్కోత్త మండలం బొరయు కే
తన పతాకల నొప్పు స్యందనములు
ప్రళయరుద్రుని రీతిఁ బటు విక్రమస్ఫూర్తిఁ
గైకొని పంచించు కాల్బలములు

తే.గీ. అరువడింది పంటా గాంచి నొక్కుమొగిని
దాఁకుచోఁ బరరాజుఁ డుదగ్రమూర్తి
యగుచు వాహినీదూని యత్యద్భుతము గ
దాన సింహనినాదముఁ జేసి యపుడు 148

తే గీ ఆనియె నిట్లు పరాంతయం బయిన కాను
అవమలార యుపాయంబు గాని పరాంత
కుని విటకుఁ దోడుకొనిరండు గురుతరోక్తి
నమడు సంప్రయయకు న వార లట్ల చేయ 146

## పరాంతకుఁడగు చోళమహీపతి వరకాంబ కడకు ధనమునిమిత్తము మంత్రుల నంపుట

వ ఆంత 147

క అరియఁ దన పురికి వచ్చిన
గురుతరమతి యగు పరాంతకుని కడకు సా
ధురులగు సచివులఁ బనిచెన్
నరపాలసుతుండు చోళనాయకుఁ డర్థిన్ 148

చ పనిచెనఁ బోయి యా పరమ భాగవతోత్తముఁ గూర్చి వార లి
ట్లనిరి పరాంతకా నరవరాగ్రణి ధర్మముచేత మాకు రాఁ
దవలిన ద్రవ్య మంతయు మదారత నివ్వ మటంచు మమ్ము దెం
పునఁగాని పంచె నీ కడకు భూరితరాద్భుత చిత్త వృత్తియై 149

తే గీ అనుడు మంత్రులవల్ల ధరాధినాథ
వాక్య మాలించి వరకాంబ వైష్ణవాధ్యుఁ
డిదియె ధర్మంబుచేత నేనివ్వఁ దగిన
ధనము నిప్రియ మటుగాన వినుఁడు మీరు 150

క అనయంబు వైష్ణవారా
ధనమునఁ దన్నిమిత్తమైన ద్రవ్యంబు [1]వ్యయం
బు నగుట నెనిట్లే బహు
ధనము నృపున కొసఁగఁగ నుదార స్థితిగాన్ 151

---

1 మూ ప్రయం

## వరదాఖ్యుఁడను హస్తిగిరీశుఁడు స్వప్నమున సాక్షాత్కరించుట

సీ. అని యివ్విధంబున నమ్మునివర్యుండు
చింతఁ జేయుచు నిద్రఁజెంది యుండ
తతని స్వప్నంబునఁ దామరసాక్షుండు
హస్తిగిరీశ్వరుం డచ్యుతుండు
ప్రత్యక్షమూర్తియై పాణిపల్లవమున
నతని స్పృశించి మహా[1]యశస్క
రమ్మహా కాంచీపురమ్మున కిమ్ముగ్రి
పరుఁ దోకాని దివ్య పవిత్రతేం

తే.గీ. బ్రహ్మ మంతయు నీ కిచ్చెదను బ్రియంబు
తోడ నని పల్కి యప్పు డల్తాయతాత
నేత్రుఁ డంత వ్షితుం డౌట నిర్మలాత్ముఁ
డతఁడు మెల్కాని తోషిత స్వాంతుఁడగుచు 162

తే.గీ. అటఁ బరాంతకుఁ డవ్వసుధాధినాథు
నచివముఖ్యుల తోడుత సత్వరమున
మహిత దీప్తిప్రభాభ్రాజమాన మగుచు
నరుఁ జెన్నొందుఁ గాంచికాపురముఁ జేరి 163

ఉ. వరదుని భక్తవత్సలుని వారణశైలనివాసు నిందిరే
శ్వరుని దయాసముద్రుని నివారితకల్మషుఁ గాంచి భక్తితో
ధరణి శిరంబు సోఁకఁగను దండముఁబెట్టి ముదంబుఁజేసి ని
ర్భరలిం రోమకంచుకిత భవ్యశరీరుఁడునై యుదారతన్ 164

---

1 మూ. యశస్త

ఆ.వె. వసుధయందు వైష్ణవ ద్వేషి యగువాని
ముఖము చూడఁదగదు పుణ్యులకును
గాన [1]మనసు నొందు కరఁ జేరి వైష్ణవా
రాధనంబుఁ జేయ రమ్యమతివ 159

చ. ఘనుకొని చోరవృత్తిన సమున్నతిగాఁ గొని పట్టి నట్టి యా
ధనము నిషిద్ధ మేనియును దామరసాక్షుని భక్తకోటి కిం
పునఁ బరితృప్తి గూర్చుటయుఁ బుణ్యముగాన నవైష్ణవావని
సుని ద్రవిణంబు కల్మషముఁ జౌర్యపు పాపరమౌ కళోదరీ 160

తే.గీ. విష్ణుచిహ్న విహీనుని విష్ణుపాద
భక్త విద్వేషి ననృతంబుఁ బల్కు వాని
ముఖ విలోకన సల్లాపములు సమస్త
నరక హేతువు లనియందు నరసిజాక్షి 161

క. క్షితి యందు వైష్ణవాగ్రణి
పతి యాత్రయ మర్థి వైష్ణవ క్షేత్రాళికి దు
ష్కృతిఁ గూర్చు వాని సంగతి
యతిదా కొఱగాఁడు సజ్జనావళి కెపుడున్ 162

ఆ.వె. మొదట నెనరుఁ జేసి పిదపఁ జుల్కనఁ జూచు
నరుఁడు విష్ణు భక్తుఁడైనఁగాని
యనయ మున్నతి వాస్యుఁ డగువాని వైష్ణవ
ద్వేషిఁ జేరఁ దగదు శిష్టులకును 163

---

1 వ్రా. మనసమొందు, 'మనంబు' పాఠమయందు విలక్షణము

తే.గీ. ఒరుని యాచన కన్న హీనంబు లేదు
విష్ణు చిహ్న విహీనులై విహరింప ద
వైష్ణవులనగు ధారుణీపాలు రా
యంశ కంటెను లేదు పాపంబు ధరణి 164

సీ. అటుగాన శ్రీ వైష్ణవారాధనార్థమై
చేసి చోర వృత్తి నే జేయువాడ
విశ్వయంబుగా నటుఁ గావింపని దొంగకు
దోషంబు లేదు నిర్దోషి యగుట
నీ యుపాయము కన్న నితరమైన యుపాయ
మేమియుఁ గానరా దిందువదన
ద్రవ్య రక్షణ మందుఁ దలఁపంగ నిక్కి యని
పలికె పరాంతకుం డంఘామలిని

ఆ.వె. ఖడ్గధారిధరులుగా మించు భటుల స
మానులైన వారి మహిత వృత్తిఁ
జేసి భయము వీడి చేకొని యపుడు స
ద్భార్యఁ దగుచు వెడలె ధైర్యమునను 165

పరకాలుఁడు స్త్రీయోపార్జిత విత్తంబున వైష్ణవారాధనంబు సల్పుట

ఆ.వె. ఖడ్గ చర్మధారిగాఁ బ్రకాశించు నా
యనుఁడు భటులతోడ గహన సీమఁ
గొల్చి యందు నొక్కచో నివాసము చేసి
యుండెఁ జోరవృత్తి నొనరు మదిని 166

క. సుకరుండై యాఁకలి గాను
సకలాశ్రిత పక్షులం గొనంగను నవ్యం
బికలంకి గుణంబు పరాం
తక మోహింప్రదుఁడు భక్తి తత్పరమతియై 185

ఆ.వె. ఆ ఘనుండు శ్రీకృష్ణారాధనముఁ జేల
శయనమున వసించి యఖిల దిశల
పరయు చుండె రాతి కనుట దొలంగి యా
పాల వాంఛ వాసి యతుల మతిని 186

తే.గీ. అంతఁ బ్రియభక్తు డైనట్టి యా మునీంద్రు
హృదయశుద్ధి దెలిసి జగదీశ్వరుండు
శౌరి సంతుష్టుఁ డగుచు నుదార సరణి
శిష్ట రక్షదాయి యగుచు భాసింపుచుండె 187

సీ. [1]అమలులౌ నిత్యముక్తా ద్యనంతాదులు
వనధు మానసులు శౌరి ముఖ్య
యోగివర్యులు మహాభాగులు సనకాది
మునులును బ్రహ్మలు పురహరాది
దైవతంబులు గొల్వఁ దామరసాక్షుండు
మంగళ ప్రదుఁడు శ్రీరంగధరుఁడు
జగములకును మాతయగు రమాదేవితోఁ
గూడఁ దార్క్ష్యారోహకుండు నగుచు

1 మూ అమలురౌ

తే.గీ. సకల భూరుహ సముదయ ప్రకటమగు మ
హా గహనమునఁ గల్గు పరాంతకాం
యంబుఁ గూడి చనుదెంచు నమ్మునీంద్రు
భక్తులం గనియె సంతోష భరితుఁడగుచు 188

క. ఇతఁడు పరాంతక[1]తాపస
పతి వెలపటఁ దిరుగు నావ ప్రాంతం బగుటన్
సకలము మత్ప్రియుఁడు నర
హిత మతుఁడగు వెంబడించి కెడు నన్నంబున్ 189

క. దినదినము వైష్ణవాగా
ధన మొనరింపఁగ యోః పరమ ధార్మికుఁ డగు స్వాం
గన తోడ భుజింపఁడు దా
ననుపమ మతిఁ జేసి యీ మహాత్ముఁడు భక్తిన్ 190

క. ఈ విధమున బహుదినముం
నీ వైష్ణవకోటియం దభీష్టముగా న
ద్భావమున మదర్చకముం
గావించుచు నుండు భక్తి గలవాఁ డగుచున్ 191

మ. తన మార్గంబున రాకయుండు జనసంతానంబు వచ్చిన్ ధనం
బును లేకుండుటఁ జేసి బిచ్చిలి యసంపూర్ణాత్ముఁడై నిష్ఠచే
లను మద్భక్తుల పూ పేరుట కనుత్సాహంబు వాటింప నీ
యనఘ క్రొత్తఁ దవార్చిగం బట నిరాహారుండుగా వర్తిలున్ 192

---

1 మూ తప.

తే. గీ. అవని నిప్పటికేని [1]సుధార్తుఁ డగుచు
మార్గగాగమనంబు నెమ్మంబు చేసి
కాంచుచున్నాఁడు నాపూజకంబె నాదు
భక్త పూజ యధికగాఁగ భక్తి నెంచు ౧౦౩

క. ధృతి గాఁగ నీ సపర్యయు
సతిశయవంగ నౌఁ నేను హర్షిత చిత్త
స్థితి శాలి నైతిఁ గావున
నితని కభీష్టంబు నిత్తు నిపుడే ననియెన్ ౧౦౪

## రంగనాథుఁడు పంచాననకు మూలమంత్ర ముపదేశించుట

వ. మహాభాగుండగు శ్రీరంగ ధరాధవుండును సిరియును దా మిరువురు నాయా మనుజ దంపతులై విష్ణుతురంగాకృతిం బొల్చు పతంగి పుంగవు పై నెక్కి బంధురాపాత్రల సనకాది భక్తులును ససంభ్రమ మహా ధనులును చామరవీజ్యమానులును ధవళాతపత్ర పరిశోభితులును శ్రీప్రభృతి నిర్జరులుం గొల్వ స్రగ్వేసరుండును పురోధసుండునగు సమ్మా గర్భతోఁ గూడ దివ్యభూషణ భూషితాంగులును వివిధ వాదిత్ర నిర్ఘోష స్మత్కీర్త మనోహరులును నగు వధూవరు లపార ధనసంపదలు గాన్పించుచు నరుగుదెంచ నారి దాని పరాంతికుండు దండధరుండగుచు నావరించి బహు సంపదాన్వితంబులగు వాని నవలోకించి విష్ణు భక్తారాధనంబునకు దైవ యోగంబుగాఁ బ్రాప్తంబైన ద్రవ్యంబని హర్షితుండగుచు మహాబలుండును ఖడ్గచర్మధారియునై ఖడ్గచర్మధారులగు నిజ భటులచేత తక్షణంబ సమస్త జనంబు నివారింపఁజేసి మహార్ఘములగు భూషణంబులును ననేక విసూల్యములగు రత్నంబులును విచిత్రంబులగు వస్త్రంబులును రజత కాంచనాదిమయాసంఖ్యంబులగు ధనం బపహరించి పిదప ననర్ఘంబులగు

1 మూ. షుధార్తియుఁ జు

తే.గీ. తనుపు నప్పుడుఁ బొంపుచును వాని దక్షిణమగు
కర్ణమందున నార్యుండు బాగఁ దనర్పు
మంత్ర మష్టాక్షరంబు నేమమునఁ బ్రబల
వర్పులొం దుపదేశించె భవ్యఁ దనరు 199

క. విమలంబై శుభమై సిరి
నమరిన యష్టాక్షరాఖ్యమగు మంత్రమునే
సుమహితుని మహాత్ముని య
య్యమలం బడిఁ గృతార్థుఁ జేసి యచ్యుతుఁ డంతన్ 200

క. తనదు స్వరూపం బాతని
గన్నుఁ గొనఁగాఁ జేసె వేడుకం గాని నారా
యణుఁడు పరాయణుఁ డాత్రిర
జన పతినిఁ దత్తయుఁడు ప్రసన్న హృదయుఁడై 201

సీ. సజలం పయోధర శ్యామ విగ్రహుఁడు పీ
తాంబర ధరుఁడు జనార్దనుండు
నవరత్న మణిమయోన్నత కిరీటుఁడు ది
మకర కుండల ధారి మాధవుండు
భాసిత వైజయంతీ వనమాలికా
భ్రాజమానుండు శుభప్రదాయి
జగదీశ్వరుఁడు కోటిసారసనాభసుం
దరుఁడు శ్రీహరి భక్త వరదుఁ డతఁడు

క. పరఁగెడు శ్రీరంగము న
య్యరవిందాక్షాంతరంగ మాశ్రితజన హృ
త్సరసీరుహ సారంగము
గురుతర మతిఁ జేరి భక్తిఁగొని యతఁ డంతన్ 206

తే.గీ. అందుఁ దనరారు రంగనాయకునిఁ గాంచి
హర్ష నిర్భర హృదయుఁడై యతని పాద
పంకరుహ యుగళముఁ గూర్చి ప్రణతిఁ జేసి
యార్ద్రితాత్ముండు పరకాలయోగివరుఁడు 207

తే.గీ. మహిని వర్ధిల్లు నాపాద మస్తకంబు
సంస్పృశింపుచు భక్తి సంసక్త చిత్తుఁ
డగుచు గద్గద నిస్స్వనుఁ డగుచుఁ బ్రీతి
హృష్ట రోమాంచలుఁ డగుచు నింపు మీఱ 208

క. నిగమ నిగమాంత సూత్రం
భగవంతుని సన్నుతించి పరకాలుం డా
జగతిం గొన్నాళ్ళుండెన్
జగదీశ్వరు పాదసేవ సలుపుచు భక్తిన్ 209

తే.గీ. అంత శ్రీ వేంకటాధీశు నరయఁ గొలువఁ
గోర్కె గావింపుచును మునికుంజరుండు
సారసదళాక్షుఁ డగు రంగశౌరి యాజ్ఞఁ
బడసి శ్రీశైలమున కేగె భక్తమతిని 210

ఆ వె. అంత నతనియాలయముఁ జొచ్చి నరసింహుఁ
గనుచు విధునిఁ గూర్చి ప్రణతిఁ జేసి
యటు కరిగి యాశు నద్భుత భక్తిఁ ద
త్పరుని వరదుఁ గాంచి సంతసమున 217

క. దివ్యస్తోత్రంబుల నా
దివ్యుం గావించి యాడి మ్రొక్కి పరమద్యుతి నం
దావని గను శ్రీగిరి నా
సవ్యగుణాఢ్యుండు మౌనినాయకుఁ డరిగెన్ 217

క. మేలైన భక్తిఁ గాని శ్రీ
శైలారోహణముఁ జేయ శంకింపుము న
న్యేశం దమ్మని దర్పద
మూలంబగు భక్త తీర్థమున వసియించెన్ 218

క. అందు దినత్రయ మతి భ
క్తిం దలకొని పంకజాక్షు దివ్యాకృతి నం
క్రందన ముఖవినుత పదర
విందుఁ గరుణాబ్ధిని విష్ణు వినుతించు తఱిన్ 219

సీ. శ్రీశైలనాథుండు శ్రీనివాసుఁడు జగ
న్మయుఁడు పోషిత భక్త మండలుండు
పృథుల వక్షుఁడు దివ్య పీతాంబరధరుండు
దురిత హారకుఁడు చతుర్భుజుండు

సమదర్శకుఁడు శంఖ చక్ర గదా ధరుం
డతి సుందరాంగుఁ డనంతశాయి
హారకేయూర కోటీర మణి స్వర
కుండలాంగద భూషణుండు దివ్య

తే.గీ. గంధలిప్తాంగి కారుణ్య కలశాబ్ధి
శ్రీ సతి భూమి నీళావిశిష్టుఁ డగుచు
తనదు భక్తునిఁ గనుగొను తలఁపుఁజేసి
వచ్చి కౌఁగిట నాతనిఁ గ్రుచ్చి యెత్తి 220

క. జనకుని కరతఁ గరాంబుజ
మున గాత్రము నివిరి యతనిఁ బ్రోచిన దో నా
మనుం నడుగుఁడమ్మ యెలఁగి
యనుపమ మతిఁ దొగరె నా పరాంతకుఁ డర్థిన్ 221

### వరతాయుఁడు శ్రీరంగమున గోపుర సప్తప్రాకార నిర్మాణము గావించుట - శిల్పులకు మోక్షమొసంగుట

వ. ఇట్లు స్తుతియించి యమ్మహాత్ము మనమతిం దెలసి దివ్యంబులగు హరి
క్షేత్రంబు లన్నియుం గలయం దిరిగి యందందుఁ గం పూర్తులం గాని
యాడి క్రమ్మఱ శ్రీరంగంబున కేతెంచి యా శ్రీరంగ భర్తకు సాం
నప్తకంబు గావింతెదనని మనంబున సంకల్పించి శ్రేయోపార్జితంబులగు
వస్తువులం జేసి శిల్పులచేత దివ్యతమంబైన వృషభవాహనంబులను సగో
పురంబులను నగు సప్త ప్రాకారంబు లుదారంబులుగాఁ గావింప నా
సమయంబునం దభావం బగుటంజేసి ద్రవ్య వ్యసన చింతా పరుఁ
డగుచు జనంబులచేత నాగపురంబునందుండు స్వర్ణమయంబగు జైన

ప్రతిమ గాలించి నీట బిందులతోఁ గూడఁ దా నందుఁ బడి ప్రవాహ్యం
బగుచు బహువిధోపాయంబులంజేసి దానిం గైకొని రంగక్షేత్రంబున
కరుగుదెంచి శిల్పుం డతి యోరంగి దృఢంబులును నాయతంబులును నగు
గాలంబులు సంపూర్ణంబులుగాఁ గట్టించి పెండియు నారలచే ముప్పది
రెండు మంటపంబులు నిర్మింపంజేసి యప్పరాంతకుండు ధనంబు
యాచింపుచు నా శిల్పులకై ధనం బెటుల నివ్వ గలను పరమంబగు
కైవల్యం బొసంగెద నదియే దక్షిణకార్య సమంబని చిత్రంబున దివ్య
యంబి నారల నావయం జెక్కించి యగాధంబగు కవేరికా పమల సలి
లంబు నందు మునుంగింజేసి శిల్పులకు శాశ్వతి యగు ముక్తి నొసంగు
మని శ్రీపతి యగు హరిం బ్రార్థించె నివ్విధంబున భక్త వత్సలుండగు
భగవంతుం డతనిచేతఁ బ్రార్థితుం డగుచు వారి కందఱికి నొూగి దుర్లభం
బగు నపవర్గం బొసంగ నా శిల్పులందఱు మఱి బ్రహ్మయానంబులగు
విమానంబులతోఁ గూడ నిరీక్షింపుచున్న నిఖిల జనుల కాశ్చర్యంబుగాఁ
బరము పదంబుఁ గూర్చి సని రనంతరంబ ౨౨౨

పరకాలుఁడు జైనులను శ్రీకవియను వైష్ణవగురుని జయించుట

సీ. మహి సువర్ణ ప్రతిమా లోయనిఁగ నప్ప
రాంతకుఁ డెఱిఁగి దయంబు లోన
నరిగి [1]జైన మనుష్యులందఱు సర్వంబు
భూపతి కెఱిఁగింప భూరి బలుఁడు
పాండ్య భూపాలుండు వారి వాక్యము విని
కనదు దూతం దేత వనుల లోచ
న ప్రియుఁ బరకాలు నయగాలి రావింప
నా మహుం డామనుజాధినాథు

1 మూ. బౌద్ధ

భక్తింజేసి వినుచుందురు వారు అధిక సంపదల నొంది పిదప నీశ్వరుండగు హరి యుత్తమాశ్రయ నిలయంబు చెందుదు రని మహాయోగి మాహాత్మ్యం బను శ్రీమంతంబను నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి త్రయస్త్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నిఖిల ప్రజ్ఞాధురంధరుండగు నరునకుం జెప్పెను 227

శా. ఆదిత్యాంతరవర్తి భక్త నికర స్వాంతాంబుజ క్రోడ వా
సా దామోదర భారతీశ గిరిజాన్యాధీశ దృగ్భృంగరా
సాంద్ర స్వాంఘ్రి పయోజయుగ్మ కరుణాపాథోనిధి శ్రీధరా
గోదామానస చోరకార తరళ గోపాలచూడామణీ 228

క. [1]జయనవిమలహారా శ్రిత
వియతోక్త మతప్రహార విపులతరవచ
శ్చయ పరశాం మునీశ హృ
దయ పంకజ భృంగ రంగ దైత్యవిభంగా 229

మాలిని సరస హృదయశీలా సర్వభక్తానుకూలా
నిరుపమ గుణజాలా నిర్జితారాతి పాలా
భరిత భువనజాలా భవ్యగాంగేయ చేలా
విరచిత కుశలీలా వేణుగోపాల బాలా 230

గద్య. [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణ సంలబ్ధ పాండిత్య ధుర్యావనతావనీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ నృపసమర్థితా కృత పటహ ఢక్కాంధకారవ విపరీత పతనక్రియా భిల్లికాధిక దుందుభిధ్వాన కోలాహల హనుమద్ధ్వజాంక కనక దండికృత హేరకంకణభూత నందిపిత

---

1 మూ. జయని మతహార 'త్రైత'శబ్దమునకు బర్యాయముగా 'జయని'శబ్దము ప్రాసస్థానమున ప్రయుక్తము మూ. 8 ఇతి

ప్రతాపకీర్తి ప్రతాప కౌసుంవంశ పయఃపారావార రాకా సుధాకర పెరాంబూర నాయక పౌత్ర రమణ భూపాలక పుత్ర లక్ష్మమాంబా గర్భశుక్తి ముక్తాఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్యకలిత సుమసాయక ఐహారిపాటు నాయక ప్రణీతంబైన శ్రీ మహాభాగవతపురాణంబునందు గోదాసతి విరహంబును విష్ణుచిత్తుండు శ్రీరంగంబున కేగుదెంచి శ్రీ రంగనాథుం బ్రార్థించుటయును నమ్మహానుభావుండు సపరివారంబుగా ధన్విపురంబునకుం జేయు విష్ణుచిత్తుం గన్నియం బరిణయంబుం గాంచుటయుం బరకాల జననంబును గుముదవల్లి వివాహంబును లోకమహితాంత పరాంకుశ సంగరంబును బరకాలుండు స్త్రీయోపార్జిత విత్తంబునం జేసి నిరంతరంబు వైష్ణవారాధనంబు సల్పుటయు రంగస్థల గోపుర ప్రాకార నిర్మాణంబును శిల్పిమోక్షోపాదానంబును దివ్యకవి మతవిభంగంబును విష్ణుతత్త్వ సిద్ధాంతంబు వను కథలుంగల సప్తమాశ్వాసము సంపూర్ణము

క. నారాయణముని యాత్రిక
పారాయణమును పఠించె భవ్యమతి నీ
కారూఢి దీనిఁ దెల్పుట
కై రంజిల నారదముని సమంచితలీలన్ ౬

## శ్రీ వృషభపుర వర్ణనము

క. విను సావధానమున నో
మునివర యప్పుణ్యచరితమును నీకు నయం
బున వివరించెద వినఁగా
నిన వారల కల్మషము హరింపగ జగతిన్ ౭

సీ. సంతతం బభ్రస్రవంతికి దీటుగాఁ
బొదలెడు నిర్మల నదులు గల్గి
పాకశాసన వన ప్రతిభఁ జెంపొందుచు
నమితంబులగు నందనములు గల్గి
యమరావతికి సరియై దివ్య సంపదఁ
దనరారు పట్టణతతులు గల్గి
భృగువశిష్ఠాత్రేయ ఋషి సమానస్కంధు
లైన విప్రులసంచయములు గల్గి

తే.గీ. యమర ద్రావిడ దేశంబునందు సర్వ
భూతమంతయు మనోహరంబుగఁ దనర్చు
సంతతాభిల భాగ్యైక సరణిఁ బొల్చుఁ
బృథివి వితతాస్పదంబు శ్రీ వృషభపురంబు ౮

చ. అనుపమ హర్మ్యరత్న ఖచితాలయ గోపురపాళి గల్గి సం
తతరతి మల్లెసిల్లి సముదంచిత నిర్మల నీర సారమై
తనరు సరస్సుయంబున నుదారమునై ద్విజరాజవైశ్య శూ
ద్ర జనవరేణ్య సంస్థితి విరాజితమౌ పృథుపట్టణంబునన్ 8

సీ. తనదు నిర్మల మనం బనయంబు కమలాక్షు
పదపద్మములకు మందిరము గాఁగ
తనదు మాటలు సొంపుగాని వనమాలి కం
ధరమున కలువదండ గాఁగ
తనదు హస్తంబులు దామోదరునకు సం
తుష్టంబులైన పాదుకలు గాఁగ
తనదు కర్ణంబులు వనజనాథ కథామృ
తమునకు విపులకూపములు గాఁగ

తే.గీ. తన యభిప్రాయ మితరమత ప్రకాండ
గాఢ తామిస్రమునకు భాస్కరుఁడు గాఁగ
దగు మహాసూరి వంశ వర్ధనుఁడ ఘనుఁడు
వైష్ణవాగ్రేసరుఁడు కేశవ ద్విజుండు 9

## శేషుఁడు రామానుజుఁడుగా నవతరించుట

క. ఆ వైష్ణవున కనంతాం
శావిర్భవుఁ డమితతేజుఁ డగు తనయుఁడు సం
భావిత విశిష్టమత ర
క్షా వహుఁడు దనర్చె విపులకౌతూహలియై. 10

వ. చైత్రమాసంబునందలి శుభదినంబునందు మంగళ ప్రదంబగు నార్ద్రా నక్షత్రంబు నందలి శుభలగ్నంబునందుఁ బ్రాదుర్భవించిన యమ్మహాను భావునకు జనకుండు ముదంబునం జేసి రామానుజుండని నామంబు గావించె 11

సీ. ఘనతరాత్ముం డగు జనకుండు తనయునిఁ
 బంచసంస్కార సంపన్నుఁ జేసి
యుపనీతుఁ గావించి యపరిమితములుగాఁ
 దనరారు వేదశాస్త్రముల జెప్పి
రూఢిగాఁ బెండ్లి స్వరూపవతిఁ గావింప
 ధన్యుఁ డాతఁడు తన తండ్రివలెనె
ప్రాజ్ఞుఁ డౌటయుఁ బరికించి రమ్యత
 యగు కాంతి మరి మహాహర్షమొంద

తే.గీ. యౌవనస్థితిఁ బెంపొందు నాత్మజున్నుఁ
గాంచి జనకుండు బంధు సంతతియుఁ దగుచుఁ
బరిణయముఁ జేసి నిగమోక్త సరణి గాఁగ
నిరతిశయ సుఖా వాప్తిఁ బరగు మదిని 12

రామానుజుఁడు కాంచీపురికిఁ జని వరదుని స్తుతించుట

క. అంతట రామానుజముని
కాంతుఁడు ప్రజ్ఞానిధి గౌతూహలియై
సంతత ధర్మావృత గృహ
సంతతి గల కాంచిపురికిఁ జని యచ్చోటన్ 13

క. శ్రీమన్నారాయణ హరి
సామజగిరిధరయ సిరుల చరణంబుల ఘ
ద్ధామగతి కరుణ చార్వైద
భూమీధర శౌరి నిఖిల భువన శరణ్యా ౧౭

సీ. విశ్వరూపాయ శాశ్వతవిభవాయ
ఇందిరేశాయ యాశ్చర్యరాయ
శ్రీ వత్సవే సర్వశేషితే సర్వ ని
యంత్రే విభూతిద్వయాధిపాయ
నిఖిలకర్త్రే ధర్మిణే త్రిలోకేశాయ
పుండరీకాక్షాయ బుధనుతాయ
జన్మసంస్థితి వినాశన కర్మధారిణే
తే నమోనమ యని దివ్యమతిని

ఆ.వె. పొగడు వాఁడ నిన్ను భగవంత గుణవంత
శాంత వార్ధి రాజ్ఞికాంత మౌని
కాంత హృదయ పంకజాంతరవాస య
నంతకాయ వైభవానపాయ ౧౮

తే.గీ. ఘనుఁడ వగునట్టి నీవు లోకములకెల్ల
రక్షకుఁడ వౌదు సత్కృతి రమ్యమూర్తి
జగమునకుఁ గారణముగాఁ దగిన యదుప
దేవ తత్త్వంబులకు రాజవద్ధ చరిత. ౧౯

సీ. కంజాక్ష యజ్ఞ భూషణ రూపధారివి
పరమాత్ముఁడవు పరాత్పరుఁడ వగు
హరి పరబ్రహ్మంబ వజ్ఞానుత పరం
జ్యోతివి శౌరి దామోదర హరి
పుణ్యమూర్తి సహస్రమూర్ధ విశ్వాత్మ సు
హస్రాక్షుఁడవయి సహస్రపాదుఁ
డవయి భాసింతు మాధవ సర్వగతుఁడవు
యజ్ఞస్వరూపివి యజ్ఞపతివి

తే.గీ. యజ్ఞభోక్తవు నిత్యుండ వఖిలనాథ
లోకభోక్తవి లోకత్రిలోచనుఁడవు
సధ్వర హవిస్సు వగుదు వనంతశాయి
శాశ్వతుండవు గురుఁడవు చక్రపాణి 20

తే.గీ. అచ్యుతుండవు సర్వలోకాధిపతివి
యనఘ శ్రీమదనంత కల్యాణగుణ సు
రాంబురాశివి కృష్ణుండ వంబుజాక్ష
శాశ్వతుండవు సంతతైశ్వర్యనిధివి 21

వ. దేవా నీ వకారవాచ్యుండవు శ్రీభూనీళాది నాయకుండవు ప్రభుండవు గాన నీవ విశ్వంబునావరించి యత్యతిష్ఠద్దశాంగుళం బనెడు శ్రుతత్వార్థమూర్తివి గదా పురుషోత్తమా నీవ యమృతంబైన శిశ్వరుండవు వ్యాపకంబులగు మంత్రంబులవయగు కతన సనాతనుండవు వాసుదేవుండ వాదిమధ్యాంత

రహితుండవు శుద్ధసాత్త్విక విగ్రహుండవు నీవు వేద వేదాంగవేద్యుండవు వేదవేదాంతంబు లౌనట్టి మహాపురుషుండవు నీవు సర్వభూతాత్మవు సర్వభూతాశ్రయుండవు విభుండవు పరుండవు నీవు సర్గస్థిత్యంతకారుండవు నీవు యప్రాకృత స్వరూపుండవు నీవు షడ్గుణైశ్వర్య సంపన్నుండవు నీవు సర్వసాక్షివి నీవు సర్వగతుండవు నీవు చతుఃపంచవ్యూహ భేదాకృతివగు నిత్యశుద్ధుండవు నీవు హేయప్రతిభటుండవు నీవు యవికారుండవు నీవు హరివి నీవు చిదచిదాత్ముండవు నీవు యఖిలంబు దేహంబుగాఁ గల్గి దేవుండవు నీవు సర్వజీవులకు సర్వకర్మంబులయందుఁ బ్రేరకుండవు భవత్కటాక్షవశంబువలన లోకంబులు పరమగతిం బ్రాపించుచుండు నీచేత స్థాపితంబులగు లోకంబులు నీ చేతఁ బ్రవర్తితంబు లగుచు నీయందు[1] పర్యవసించి బ్రహ్మాదులు నీయందు డంతర్హితంబు లగుట నీవు సమస్త ప్రాణ్య ప్రాపకుండవగుదు సంపాలకా ధర్తులకు నీ పదాబ్జద్వయ ప్రదుండవగుట నాత్మస్వరూపివగు నీవు సర్వలోక శరణ్యుండవు మహాత్ములగు ప్రపన్నుల పాపంబులు హరియించి పరమ పదంబొసంగుదువు భారంబులు నీయందు న్యస్తంబులగునవి [2](తాత్పర్య) లక్షణంబు లగుట శరణాగత వత్సలుండవగు నీవు దాని రక్షింతువనుట నీవు సకల లోకంబుల కుపాయోపేయ పాలకుండవు నీవు దాసుల గోప్తవు నీకంటె నితరుండగు ప్రభుం డెవ్వండును గలం డని మతియును 22

ఉ. నీ పదాబ్జము లాత్మకు నిలయములుగఁ
బలుమరు నుతింతుఁ బ్రత్యక్షపరుండ వగుచు
యమరరాజ ప్రపన్నావనాధిపాల
శ్రీపుమ ప్రపంచ నాథ సంపూర్ణదాత 23

---

1 మూ. పరిణయ్యంబు 2 మూ. త్రిపురత్వము

## రామానుజుఁడు యాదవప్రకాశుని కడ శాస్త్రపఠన మొనర్చుట

క. ఈ మాడ్కి దేవదేవుని
స్వామి నఖిల లోకనాథు వరదు మహాత్మున్
రామానుజ మునివర్యుఁడు
ప్రేమఁ గొలిచి యంత వం దభీష్టత నుండన్ 24

తే.గీ. అందు నిగమాంత శాస్త్రంబు నధికరింప
యాదవునిఁ జేరి యాంశ్మకాశ్యహాని
యతని వద్దను దద్భాప్త మము మతిని
పఠనసేయుచు వచట నావాస మొంది 25

క. నిరతంబు శ్రీకరిధరా
ధరవరు వరదాయి భక్తతతి మందారున్
పరమప్రీతి భజింపుచు
నరయగ లక్ష్మణ మునీంద్రుఁ డలరారు తతిన్ 26

చ. నిరుపమమూర్తి చోళధరణీవరు పుత్రికి బ్రహ్మరాక్షసుం
డురుతర వేగముంగొని సమున్నతి సోఁకియు ధాత్రిగల్గు నె
వ్వరుఘల చేత నేనిఁ బరిహారిత మంత్ర విధాన పద్ధతిన్
గరము దొలంగకుండెఁ బరికల్పిత దుష్టమదోగ్ర వృత్తిమై 27

తే.గీ. రమ్యమతిపేసు మంత్ర తంత్రముల చేతఁ
దొలఁగగా నెవ్వఁడేని శక్తుండు గాక
పోవుటయు రాజ లక్ష్మణముని సమేతుఁ
డైన యాదవుఁ బిలిపింప నా ఘనుండు 29

### చోళరాజపుత్రికి సోఁకిన బ్రహ్మరాక్షసి యాదవప్రకాశుని దూలనాడుట

చ ధరణి సమస్త విశ్వసంహారంబుగఁ దత్పురిఁ జేరవచ్చి ని
ర్భరగతి బ్రహ్మరాక్షసుఁడు పట్టిన యానృపపుత్రిఁ గాంచి వి
స్ఫురితుఁడైన భిక్షుకుఁడు మూర్ఖతయందు సమస్తమంత్రముల్
నిరుపమమైన ప్రజ్ఞఁ గొని నేర్చిన వాఁడగుటన్ మదంబునన్ 29

తే.గీ. ఉగ్రబీజాక్షరంబుల నొప్పు నుగ్ర
మంత్రముల నభిమంత్రించు మౌనివరుని
యాదవుని బ్రహ్మరాక్షసి యరసి లెక్కఁ
గొనక దుర్వారమూర్తియై కొని రయముగ 30

తే.గీ. అందు గంభీర శబ్దమొంద నోరి
గడవసేయక దుర్మద కలితయగుచు
నతని బన్నంబు లెఱిఁగిన యట్టి పలుకు
బలికె యాదవ యతిఁ గూర్చి యలఘుమతిని 31

క గురుతరుఁడగు శ్రీశైల
స్థిరు యాత్రికు సతత మఱుగు జనతతుల రవ
స్ఫురణం బంతట నిండిన
సరసస్థితి దాని వినుచు సంరంభముగాన్ 32

వ విశాలంబును మనోహరంబునగు సముత్ఫుల్ల కమలాకర శీకర
పరిమళాస్వాదనమత్త మధుకర ఝంకార నిరాఘాటంబగు తటాక సమీ
పంబు వందలి వల్మీకంబునం దీవు పూర్వంబునం దుడుము వగుచు
వసితులగు వైష్ణవుల భుక్తశేషాన్నభక్షణంబుఁ గావలన ద్విజ
రూపంబు గైకొంటివి భిక్షుకా మత్తుల్యంబు వదింపెద వదేకం 33

క. మును నేను మహాయజ్ఞం
బున మనుకొని యాజకత్వమును జేయఁగ వా
క్కున మంత్రలోప పాపమునఁ
బెనుపొందెను రాక్షసత్వమును యతివర్యా 84

సీ. ఈ ద్రవిడ దేశ మయిన యీగాపు నవతరింపఁ
గా సమర్థుండవు గావు యతిప
యతిరాజ చేతన రక్షణార్థమై శేషాంశ
మైన నవతీర్ణుఁడై పెరుంబుదూరుఁదు
కారుణ్యజలధి యీ ఘనుఁడు రామానుజ
ముని దక్క నితరుఁడే పురుషుఁడేని
నాదగు నీచ జన్మము బాపఁగాఁ జాలఁ
డిమ్మహామహుఁ డాజ్ఞ యిచ్చెనేని

తే.గీ. ఏ యుక్తిఁ బాసిపోయెద నేనటంచుఁ
బలికి లక్ష్మణముని పాదపద్మములను
బ్రాలినప్పుడు చోళభూవరుఁడు యాద
వప్రకాశయతియు సాశ్చర్యమతిని 85

## రామానుజుఁడు చోళరాజకన్యను బ్రహ్మరాక్షస విముక్తం గావించుట

వ. సర్వలక్షణలక్షితుం డగు లక్ష్మణమునిం బ్రార్థింప నమ్మహానుభావుం డీ ప్రాకృత శరీరంబు బాసి ముక్తిం బొందు మని యాజ్ఞ యొసంగిన యెడ నా బ్రహ్మరాక్షసి యా గాత్రంబు దొలంగి సకలజనులు చూచుచుండఁ బరమంబగు వైష్ణవ లోకంబుఁ గూర్చి చనియె నంత రామానుజుఁడు నయ్యాద

వుండుగా రాజులచే బాధితుం డగుచుఁ గ్రమ్మఱఁ గాంచీపురంబున కేఁగు
దెంచి శ్రుతస్మృతిపార్థవాదియగు పయ్యాదవుం బరిత్యజించి సర్వోత్తరారం
బులం జేసి యనయం బతిశయంబుగా వరదు సేవింపుచు నందదినసించె
నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమతంబును నగు భార్గవపురా
ణోత్తర ఖండంబు నందలి చతుస్త్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు
నారాయణుండు నిఖిల ప్రజ్ఞా ధురంధరుండగు వరునకుం జెప్ప వెండియు
నిట్లనియె 36

తే.గీ. అంత సమయంబు నమట మహర్షియైన
లక్ష్మణాచార్యుఁడు భాసుర లక్షణుండు
పండితుండు మహాపూర్ణ పాదపంక
జద్వయం బాశ్రయించె సుత్సాహి యగుచు

కం. అని నారాయణముని స
ల్లక్షణ వల్లాలించి సత్కీర్తిం మతియై
ఘనుఁడు వరుఁడు కేలు మొగిచి
వినయంబున నతని కనియె వినుమంతరోత్తన్ 38

తే.గీ. ఇల మహాపూర్ణముని యెవ్వఁ డెవ్వ రతని
దేశికుం డే ఘనుని యంగఁ దేటపిల్లు
నీ సమస్తంబు నాకు నీ వెఱుఁగఁ జేయు
మతి కరుణఁజేసి నారాయణాఖ్య మౌని 39

కం. అని వరుఁడు వేఁడుకొనుచో
ననురాగంబునఁ గృపారసాయత్తుండై
జినమతిరేఖుండు చిరం
తనముని నారాయణుం డుదారత నుడివెన్ 40

## మహాపూర్ణ సదంతము

ఉ. నానారత్న విచిత్ర గోపురమునై నారాయణ గ్రామ మ
ద్యానోపేతమునై తవేరతనయాపాంతస్థమై యొప్పు నం
దానమ్రమ స్థితి వీర్వరాఖ్యుఁడు యశోభ్యాతిన్ విరంజిందు మున్
శ్రీనారాయణ పాద నీరజ యుగాళీన ప్రభావాత్ముఁడై ౪౧

తే.గీ. భూసురాగ్రణి వైష్ణవ పుంగవుండు
ఘనతరుం డీశ్వరాహ్వయ ముని దనర్పు
మహిత మతియు విన్యస్తైన మంత్రియగు గ
ణానముని యంశమునఁ బుట్టి నట్టివాఁడు ౪౨

క. నాథమునినాథుఁడు రమా
నాథ పదాంభోజ యుగ్మ నంచిత మధురి
పాథ సమంచితుఁడై దివ్య
నాథార్చితుఁడై తనర్చె నన్వయమందై ౪౩

క. సుతుఁడుం డా నాథమునికి
వితతాఘౌఘుండు గల్గె వృష్ణి గర్భాం
కతుఁ డీశ్వరాభిధానుఁడు
ద్విజవర్యుఁడు ధర్మవేది దీపిత మతియై ౪౪

క. పరతత్త్వ విదుఁడు వైష్ణవ
పరివారారాధనైక పరుఁడు సతత వి
స్ఫుర నిగమాంత విశారదుఁ
డురుతర కీర్తిప్రదాతుఁడొప్పు ధరిత్రిన్ ౪౫

క. ఆ నందనుతోఁ గూడ స
దానందుఁడు నాథముని మహాత్ముఁడు పెక్కా
నేక క్షేత్రములం 48
దానమ్రుండై దివ్యత్రయమందుండి యటన్

క. యమునా నదీ తటమునం
దమరెడు గోవర్ధనాద్రియందు మదిని యా
ద్యమ యోగనిద్ర గైకొని 47
సుమహిత సౌఖ్యప్రదానముగ తపింపుచుండెన్

సీ. నిరతంబు తద్ధ్యాన నిరతుఁడై యమ్ముని
చిరకాల మందు వసించి యంతఁ
బద్మనాభుని యాజ్ఞ వడసి వెండియును నా
రాయణ పురమున కరుగుదెంచి
యఖిలంబు లీవపై యందారు ద్రావిడ
ప్రతి నిర్వహింప నారూఢి నొంది
కురుకాంతమున కేఁగి గురుతరంబుగ నందు
విలసిల్లు తింత్రిణీ వృక్ష మూల

ఆ.వె. మాత్రయింది పెద్దయగు తతి యోగి నా
యకుఁ బరాంకుశుని నుదారశక్తిఁ
దానుపాసనంబు గావింప శరకోప 15
మునివరుండు ప్రేమఁ దనరు మదిని

క అతని పురోభాగమునం
దతిశయ మగు దీప్తిఁ దోచు నమ్ముని గని యం
చిత భక్తి భూమి సోఁక మ
హితమతి నాథర్షి ప్రమొక్కె యష్ట మెఱర్పన్ 49

ఉ అమ్మునిరాజువల్లను సమస్తము ద్రావిడ వేదమున్ క్రమో
దమ్మున సంగ్రహించి ఘనతాదురితం బెడఁబాపు న్యాసయో
గమ్ము నొకప్పుడేనిఁ బలుకన్ ఘనదమ్మును ముక్తిదమ్మునై
నమ్మతిఁ దొల్పుదాని నరసస్థితిఁగై కొని యంతవేడుకన్ 50

క క్షమరహృదుప్పారణ యా
క్రమవల్లి సమస్తకలాన్వతతిఁ దొలఁగను ను
ద్యమము రహస్యము న్యాసము
విమలమతిం దనరు శిష్యవితతి కొసంగెన్ 51

వ అంత

క నరసు జయశ్రేనాంగణ
స్ఫురితాత్ముకుఁ బుండరీకమునివర్యు ఘనున్
గురుతేజాంగణ యోగీ
శ్వరు వినుతు యోగవిదుని భవ్యవిచారున్ 52

వ అయ్యాచార్యవరుం డిట్లు ప్రసన్నహృదయుం డగుచు నా నాథమునీంద్రుం
డిట్లనియె

సీ. అద్భుత సింహాసనాంక సంజాతుఁడౌ
పుత్రుఁ డయ్యెడు నీకుఁ బుత్ర వాని
కామాది యామునాహ్వయము నీ వొసఁగింపు
మఱియు మత్సముఁడుగా నలరుచుండుఁ
బుండరీకాక్ష నీవును నాదు పౌత్రుఁడౌ
యోగీంద్రునకు న్యాసయోగ మర్థి
ద్రావిడాగమము నుదారత నుపదేశ
మిమ్ము ప్రేమను గురుకేశ నీవు

తే.గీ. యోగ విద్య నొసంగు మనూన వృత్తి
ననుచు నివ్విధమున దాని నాజ్ఞ గఱచి
సప్తవర్ష శతంబులు గనిన పిదప
నాథముని పూర్ణయోగ సంధానుఁ డగుచు ౬౬

వ. నిజశరీరము దొఱఁగి పరమంబగు విష్ణుపదంబుఁ బ్రాపించె నంత నప్పుండ
రీకాక్షుండు కుమదాశాంశ సంభవుండును శ్రీరామ మిశ్రాఖ్యుండును నగు
శిష్యుంబిలిచి ప్రహర్షితుండగుచు రహస్యవేది యగుటన్ న్యాసంబును
ద్రావిడామ్నాయంబులను నుపదేశించి యాళ్వారాఖ్యమునికి శ్రీమంతుండును
సింహాసనాంకుండును వేదవిదుండును మహామునియు నగు పుత్రుండు
గాఁగలండు శ్రీరామ మిశ్రార్యా సర్వజ్ఞుండును మహాత్ముండును నగు వాని
కావుఁ ద్వరితంబుగా ద్రావిడాగమంబు నుపదేశం బొసంగుము మహాత్ముఁ
డగు నయ్యామునముని దేవరశిష్యుఁ డయ్యెడ రనుం దరం దక్ష గావింప
ననంతరంబున గురుదాస శ సంభూతుండగు మహాపూర్ణుండును దత్త్వ
విదుండును మహానుభావుండును హరిప్రియుండును సుముఖాంశజుండును

నగు శ్రీశైల పూర్ణుండును శంఖ పద్మాంక సంజాతుండగు కాంచీపూర్ణ
సంయమియును విఖ్యాతుండును అంతరీకాంక సంభవుండును నగు గోష్ఠీ
పూర్ణుండును ఐ మనాంథుండును మహానీయుండును నగు శ్రీమాల్యధరనామ
కుండును నగు వీరలందఱు యామున శిష్యు లగుచు సర్వజ్ఞులును మహా
మహులును తత్త్వకోవిదులును నగుట వారు హరిక్షేత్రంబులయం దధి
వసింపుచు మనుజుల బవిత్రులం గావింపుచు రమ్యమహాపూర్ణుండు నిరంత
రంబు గురుని గూర్చి యను వర్తింపుచు నతనిచేత బోధింపంబడిన
యశేషరహస్యార్థంబు గల వాఁడయ్యె యామునమునీంద్రుండు సకల
సమయంబుల నిర్జించి కుమారు రాజ్యస్థాపితుం జేసి విష్ణునందు భక్తిగల
వాఁ డగుచు భిక్షుకాశ్రమం బాశ్రయించి మహాపూర్ణ సహితుం డగుచు రంగ
క్షేత్రంబునం దావాసంబు గావింప లక్ష్మణమునీంద్రుండు కాంచీపూర్ణ
ముఖంబువలన దేవరాజు సందిష్టుం డగుచు ననఘుండగు సమ్మహాపూర్ణు
నాశ్రయించి సేవ మహాత్ముండగు నతండు యామునార్య నిక్షిప్తం
బగు రహస్యం బంతయు శిష్యుండగు రామానుజార్యున కొసంగె నని
మహాయోగి మహత్త్వంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర
ఖండంబు నందలి పంచత్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయ
ణుండు నిఖిల ప్రజ్ఞాధురంధరుండగు నరునకుం జెప్పె వెండియు నిట్లనియె

రామానుజుండు భిక్షాశ్రమము గొనుట

తే॥ అంత లక్ష్మణయోగి పద్మాక్ష వరద
రాజ గురు విష్ణు భగవంతు రమ్యమూర్తి
సన్నిధిని దాను భిక్షుకాశ్రమము గొనియె
నిగమ నిగమాంతరార్థ నిపుణమతిని 67

సీ. అట యోగివరుఁడు రామానుజార్యుఁడు సర్వ
వేదవిదుం డను మోదకుండు
కాంచి యం దధివసియించినచో సుప్ర
తిష్ఠాంశకుఁడు సముదీర్ణ గుణుఁడు
సత్పురుషుండు దాశరథి సంజ్ఞుఁడు మహా
మహుఁడు నిష్కల్మష మానసుండు
శరత్సనేత్రాంశ సంజాతుఁడు శ్రీవత్స
మిశ్రాహ్వయుఁడు గంభీర జలధి

తే.గీ. యనెడు నిద్ధర హస్తి ధరాధినాథ
ధామమున కేగుదెంచి నంతసముతోర
నంచుఁగం యయ్యతీశ్వరు నాశ్రయించి
దరవిచే బంచసంస్కృతు లగుచు నొనఁగి ౬౮

క. యతిరాజు పదాంబుజములు
సతతము సేవింపుచును విచక్షణమతులై
చతురామ్నాయ షడంగ
స్థితి భగవన్నిష్ఠ గలిగి చెలఁగిరి భక్తిన్ ౬౯

## రామానుజుఁడు యాదవప్రకాశు ననుగ్రహించుట

క. అంతట నయ్యాదవయతి
నెంతయుఁ గని యతని జనని యటనియె హారి
స్వాంతంబుఁ జేసి సుత యా
వింతగ నీ పుత్రు యట్టి విధ మనుదినమా. ౭౦

క. శరణాగతవత్సలు మని
పర వస్తుఁ బవిత్రుఁగాఁగ భావింపుము నీ
కరుణ నని పల్కి చేతుల
శిరమునఁ బెట్టి కొని వినుతిఁ జేసె యతీంద్రమన్. ౮౫

క. కలియ నపారస్తోత్రం
బుల లక్ష్మణ దేశికుఁ గూర్చి పొగడినచో వి
కృపాలి యతని మొదలఁ గరుణా
కవితుఁ దగువ యతికులాగ్రగణ్యుం డంతన్. ౮౬

తే.గీ. పంచ సంస్కారములచే సుదండితముగ
యాదవుని సంస్కృతునిఁజేసి యవలఁ గ్రమము
వల్ల నురుపీఠుఁ గావించి యుల్ల మలర
ఘనుఁ ద్రిదండినిఁ జేసె సంపూర్ణమతిని ౮౭

రామానుజుఁడు శ్రీరంగము చేరి రంగనాథుని స్తుతించుట

వ. అంత శ్రీరంగనాథుడే నాపరాయణమానుం డగుచు మహాసింధుగు
నా క్షేత్రంబుఁ జేరి పుణ్యమూర్తి నిషేవితయును శయ్యేకరస్థ దివ్యాశ్రమ
సమాంచత్ప్రతయు నమ్మృతోపమాన నిర్మల జలపూరితయుఁ ద్రిదశ గంధర్వ
కిన్నర కింపురుష పరోపశోభితయు బృందారకనందన బృంద నిష్యందయు
నిరంతర సురనికర రమమాణ ప్రభావయు దైవర్షి సిద్ధ సాధ్య విద్యా
ధరాప్లుత జీవనయు నిర్మలోత్పలకల్హారసారస నికాయ ప్రవర్ధమానయు
వికసిత కుముదసముదయ పరిశోభితయు కుసుమనికరపరాగ పరిభాసాంత
రయు విపులస్వచ్ఛ వాలుకా మాలికయు నానాప్రసూన సమూహ క్రమత్ర
మధుకర ఝంకారసంకులయు రాజహంసకలహంస చక్ర కారండవ

వ. వనస్పతి ఓషధి చంద్ర నక్షత్ర గ్రహార్క వివిధ భూతంబుల
యం దంతట సంస్థితుండవగు నిన్ను సృష్టి పరబ్రహ్మంబుగా నెఱుం
చుందురు శ్రుతిసమ్మతి యనెడు ప్రత్యక్షంబునం జేసి హిరణ్మయ స్వరూప
యజ్ఞస్వరూపుండ వగుటఁ బరయగు శ్రుతి నిన్నుఁ బరమాత్మగాఁ బ్రశం
సించు చున్న నీవ యోంకారుండవు నీవ వషట్కారుండవు నీవ యజ్ఞ
హవిస్స్వరూపుండవు నీవ సర్వజ్ఞుండవు సర్వేశ్వరుండవు సనాతనుండవు
పుండరీకాక్ష సర్వశేషివగు నీవు సత్పురుషులకు గతి వగుట
సర్వ జగంబుల కీవ యధీశ్వర సుహృద్విభుండవు గాన
లోకంబుల కీవ యుపాస్యుండ వగుదు వరించి యుపాసకు లగుట
భూతంబులు భరింపుచున్న నీవు సర్వభూత నియంతవు భూతభర్తవుంగా
వలయు కతన నీవ యనంతగుణ సంయుతుండవు ననంతార్క ప్రకాశవంత
వగుట మహాత్మ శంఖ చక్ర గదా ధరుండ వగుచు దివ్యరూపంబు
గైకొన్న మహానుభావుండవు నిగమంబులు సవిశేషుండ వని నిన్ను నిరు
పాధికంబును బరాత్పరంబును నిరవధీశ్వరంబును నగు పరబ్రహ్మంబుగాఁ
బల్కుచున్నవి రమేశ నీవు నిత్యులకు నిత్యుండవు చేతనులకుఁ జేతనుండ
వనేకుల కీవ ముఖ్యుండవగుచుఁ గోర్కె లొసంగు పుణ్యపురుషుండ
వగుటం జేసి భవదుపాసకులగు ప్రపన్నులు నిన్నుఁ బ్రశంసింపుచు మొదట
నిన్నె లక్ష్యంబుగాఁ జేసి పిదప శరరూపం బగు నాత్మ నోంకారంబను
ధనువునం దెక్కువెట్టి ప్రమత్తరహితాత్ములగుచు లక్ష్యంబగు నా
బ్రహ్మంబు నిరీక్షింపుచుఁ దత్స్వరూపులగుదురు నీయం దుంచఁబడిన
వారని లక్ష్మణార్యుండు వెండియు నిట్లనియె 79

తే.గీ. శేషపర్యంకశాయి లక్ష్మీనివాస
పద్మనాభ పయోరుహభవ కపర్ది
వినుత చరణారవింద శ్రీ విష్ణుదేవ
నీకు దండప్రణామంబు నే నొనర్తు 80

సీ. సంకర్షణాయ కృష్ణాయానిరుద్ధాయ
వాసుదేవాయ వరప్రదాయ
నారాయణాయ సురారిసంహరణాయ
హరయేచ్యుతాయ రమాధిపాయ
దురితదూరాయ ప్రద్యుమ్నాయ రామాయ
శాశ్వతాయ సమస్తజనసుతాయ
గోవర్ధనధరాయ గోవిందరూపాయ
లోకేయదేవాయ మనతరాయ

తే.గీ. దివ్యభూషణభూషాయ దివ్యగంధ
లిప్తదేహాయ సంతతవ్యాప్తయే మ
హా కుసుమ ధారిణే సుందరాంగిణే న
మో నమో యని నిన్ను నేఁ బొగడుదాఁద 81

మ. నిగమాధీశ్వర నీకు దండము రమానేతా మురారాతి ప
న్నగ లోకేశ్వర శాయి నీ చరణ మౌన్నత్యంబుగాఁ బొల్చు స
ర్వగ శ్రీరంగ ధరాధినాథ భవదూరా నీకు జోహారు హే
య గుణాతీత ముకుంద నీకు నతి బ్రహ్మస్తోత్ర పాత్రక్రియా 82

తే.గీ. అంచుణాక్ష ప్రసన్నుఁడ వగుము దేవ
దేవ ప్రత్యక్షవగు రమాధీశ శౌరి
మనవిని యనుగ్రహింపు జగన్నివాస
రమ్య కరుణాసముద్ర శ్రీరామభద్ర 83

క. అని యా ట్లాద్రిక కల్పక
మునుగాఁ దనరారు రంగభూపతి వినుతిం
గొని యా లక్ష్మీశ్వరుచే
గొనియె విభూతి ద్వయైక గుణ వైభవముల్, 84

సీ. యతిశేఖరుండు రామానుజాచార్యుఁడు కలి
పయి మగునట్టి సమయమునందు
రంగనాయక పాదరాజీవ సేవా
వ్రతియై యధివసించి పిదపఁ
బుణ్యాత్ముఁడగు మహాపూర్ణుని ప్రేరణం
బునను గోష్ఠీపూర్ణ బుధవరేణ్యు
చెంత రహస్య మర్థాంతరంబుగాఁ దెలి
యు కొఱకు భయభక్తు లుప్పతిల్లఁ

తే.గీ. గొలుచు కురుకేశ దాశరథులను శిష్యు
లధికమగు భక్తిఁ దనవెంట నంటిరాఁగ
నమ్మహాముని కడ కేఁగి యతుల దిత్తుఁ
డగుచు దండప్రణామంబు లాచరించి 85

తే.గీ. అమ్మహాత్మునివల్లఁ దత్త్వార్థ మెఱిఁగి
దివ్యమతి వందితకి నుపదేశ మిచ్చి
బ్రహ్మఋను నమ్మునీంద్రుని కడకు వచ్చి
వినతుఁడై యతివర్యుఁ డిట్లనియెఁ బ్రీతి 86

తే.గీ. శాంతసంతోషి యగుచు నాచార్యముఖ్య మ
హా ప్రదక్షిణము రచింప నింపుమీఱ
గణన మించిన శిష్యవర్గంబుతోడ
వెడలె నా యతిరాజవర్యుండు రయమున ౮౦

## రామానుజుండు విష్ణు స్థానంబుల సేవించుట

సీ. విశ్వేశ్వరుండగు విష్ణుని స్థానముల్
సేవింపుచును భక్తి చెన్ను మీఱ
యందందుఁగల పండితాళిఁ బూజింపుచుఁ
గుమత మతంబులు గోల పుచ్చి
మహనీయమైన స్వమతము స్థాపించు
చంతట కాశీ ప్రయాగ మథుర
లందు నయోధ్యయందలి రమ్యమగు ద్వార
వతియందుఁ బుణ్యమౌ బదరియందు

తే.గీ. రమణఁ బెంపొందు నైమిశారణ్యమందు
ధన్య సేవితమగు హరిద్వారమందు
గయ మొదలుగాఁగ నెయ్యవి గల్గు పూజ్యఁ
దైవ హరిదేశముల యందు నాఘనుండు ౮౧

## శారదా పీఠమున శారదాదేవి రామానుజుని శ్రీ భాష్యమును గొనియాడుట

క. తనశిష్యులను నిలిపి యం
తట నా యతివిభుఁడు శారదాపీఠము స
న్నుతు నిగమాంతపారము
ఘనతరమతిఁ జేరె దుష్టకాంతశరణున్ ౮౨

క అట నెదుట వచ్చి శారద
వటమం దనుం బాణిసేయ భవ్యయశుండు
త్కృటమతి నాపె కొనంగెన్
స్ఫుటముగఁ దాఁ జేయు భాష్యమున్ నిరుపమమున్ 63

క భారతి యా భాష్యముఁ బొ
ల్పారఁగ గ్రహియించి శిరమునం దిడుకొని శ్రీ
శూరేశ దాశరథి హృ
చ్ఛ్రీరమణ రవి యత్కృతార్యునిన్ గొనియాడెన్ 64

## రామానుజుఁ డష్టోత్తర శత హరిక్షేత్ర స్థాపనంబు గావించుట

వ అంత యతిసార్వభౌముండగుచు శ్రీమంతంబగు పురుషోత్తమంబున కేఁగుదెంచి సర్వేశ్వరుండును బరాత్పరుండును మహాంతుండును విభుండును నీలమేఘ నిభశ్యాముండును సహస్ర తరణిమండల ప్రకాశసన్నిభుండును దివ్య భూషణ భూషితుండును గాంచనాంబరధరుండును దివ్యచందనలిప్తాం గుండును వనమాలావిభూషితుండును బలభద్ర సుభద్రా సమన్వితుండును సురబ్రహ్మర్షి సనకాది వినుత పాదారవిందుండును నగు జగన్నాథుం గనుంగొని తత్పాదంబుల కెఱఁగి నిగమ నిగమాంతసూక్తుల నిట్లని స్తుతియించె 65

క శ్రీ మన్నీలాచలం దా
సా మోదినా త్రివాశ జగదీశ వరం
ధామ శరణ శరణ్యము
లై మలయు భవత్పదముల యనయము మాకున్ 66

సీ. శ్రీశాయ విశదాయ యోగానవినుతాయ
నిఖిల భువన సాక్షిణే పరాయ
సర్వభూతాత్మనె సర్వేశ్వరాయ స
ర్వాయ తే శత్రుసంతాపాయ వాక
దుఃఖ సంహారిణే దుర్గం జగద్దేహి
నే జగన్నాథాయ నిర్మలాయ
సారస నేత్రాయ సర్వాగమాయాద్య
తాయావితారితే దైవతాయ

తే.గీ. శౌరయే పురుషోత్తమ పూరణాయ
పరమ సుఖదాయినే యోగిపాలనాయ
[1] తే నమోస్తుటంచును సముత్కీర్తనతతి
నిన్ను మతిలోన భావింతు నిశ్చయముగ ౯౭

క. హరయే పరాత్పరేశా
య రమాపతయే మురాంతకాయ సుమనసే
పరమాయ నమో నమ యని
గురుతరమగు భక్తి నిన్నుఁ గొని యాడుదునో ౯౮

వ. ఆకాశ వాయు తేజస్సలిల పృథివీమయుండగు విశ్వంబు విశ్వధారివగు నీవలన నుత్పత్తి యగుచు వృద్ధిఁబొందుచుండు రుద్రులును నింద్ర ప్రజాపతులును నాదిత్య వసువులును మరుద్బృందంబులును నను నీ సమస్తంబులు నీ వలన నుద్భవంబగుచుండు నీచేత సృష్టంబగుచు స్థావర జంగమంబగు నీ జగంబంతయు నీచేత నిరంతరంబు సంరక్షింపఁ బడుచు నీ యందు లీనంబగుచుండు ప్రాణంబును సకలేంద్రియంబులును

1 మూ. తే నమోస్తు యటంచు మకీర్త

నీవలన నుత్పన్నంబు లగుచుండు బ్రహ్మ రుద్రాదులగు నిర్జరులు
నీకుఁ బ్రియతములగు దాసులగుదు రథర్వ్యంబులగు సమస్తంబునం
దీవ వ్యాప్తుండ వగుట మహాత్మునకు మహత్తవు నణువున కణీయుండవు
నగుట జంతు సంతాన స్వాంత నివాంతుండవగు నీవు ననాదనుండవు
నిష్కళంకుండవు నిరాభాసుండవు శుద్ధుండవు నొక్కరుండ వగుట
నారాయణశేషుండ వగు నీకంటె వెండవ దేవుం డొక్కఁడేనిఁ గల్గనేరఁడు
చతుర్వ్యూహ చతురాత్మ స్వరూపుండవగు నీకొఱకు నమస్కరించెద
నని మఱియును 99

తే.గీ. పంచకాలాత్మనే భక్తోదంచితాయ
రుద్రవినుతాయ పంచస్వరూపకాయ
తే నమోనమ యని నిన్నుదీర్ఘ భక్తి
వినుతిఁ జేసెద నెవ్వేళ విభవరిం 100

సీ. పంచకాంక్షులు భవ్యులు యోగులు
పరమార్థ విదులౌ ప్రపన్నులెపుడు
నిర్మలాత్మకునిగా నిన్నుఁ బూజింపుదు
రర్థ పంచక తత్త్వ మరయువారు
సరసులు పంచ సంస్కార సంస్కృతులు ని
త్యంబు నీ రూపంబు నరయుదుంద్రు
పటిమ చతుర్వ్యాత్మ పరిపూర్ణముంగు నీ
పదములు దెలుతురు భావవిదులు

తే. గీ. నమ్మహాత్ములు నీ దాసులైన భూమి
సురులు సకల భువనముఁ బ్రోతురు ముదమున
విశ్వరూపంబు గాంచి నీకు వినతిఁ జేతు
వెదవేద్య పొగడువాఁడ నేర్ప నిన్ను 101

తే. గీ. వాసుదేవుండ వగు నీకుఁ బ్రణతిఁ జేతు
కృష్ణదేవుండ వగు నీదు కీర్తనంబు
సల్పువాఁడ జగద్ధామ శార్ఙ్గి ఖడ్గ
సత్త్వ హరి నీకు మ్రొక్కెద జలజనాభ 102

క. విష్ణు స్వరూప మాధవ
విష్ణువయిన నీకు నేను వినతి యొనర్తున్
గృష్ణ నిఖిలాత్మ దైవ వ
రిష్ఠుఁడ వగు నిను నమస్కరింతు ముకుందా 103

తే. గీ. పంకజాక్ష జగన్నాథ భక్తవరద
లోకధారి మహాత్మక పాకశాస
నాది వందిత మౌనిజనాంతరస్థ
నీకు జోహారు గావింతు నిగమ రూప 104

సీ. కైవల్యదాయివై ఘనతర మూర్తివై
యాదవేంద్రాయ దయామయాయ
యమునాకే సచ్చిదానంద రూపాయ
యిందిరా భూమి నీళేశ్వరాయ

నిరుపమాకారాయ నిత్యముక్తైక భో
గ్యాయావికారాయ పరమతాయ
విద్యాయ శుద్ధాయ సర్వ స్వరూపాయ
పరమాత్మనే విశ్వపాలనాయ

తే. గీ. కారణే హేతుహేతవే సకల విబుధ
లోకనాథాయ విరించన పూజితాయ
తే నమోనమ యని నిన్ను దివ్య మతిని
సన్నుతించెద నెప్పు డుత్సాహలీల 107

క. త్రిగుణాతీతుఁ డనగు ని
జగతిత మతి వందనంబు సలిపెద నే
నిగమాంత రూప శాశ్వత
జగదీశ యనంత మహాశ్చర్యధారా. 108

వ. మహాత్మా విదగ్ధతోషాధిస్వరూపుండవు మహోత్కృష్టుండవు జగజ్జనకుండవు నీలాద్రి నాయకుండవు సుభద్రా ప్రాణవల్లభుండవు బలభద్రసమేతుండవు జగన్నాథుండవు సత్ప్రత్యపన్న జనరక్షకుండవు వ్రతధారివి కోటి కందర్ప లావణ్య నిధివి యనంత కల్యాణ గుణ పరిపూర్ణుండవు బ్రహ్మ స్వరూపుండవు విభూతి ద్వయాది పాలకుండవు సర్వశేషి వగు నీకొఱకు నమస్కరించెద పురుషోత్తమ [1](మా)నికేతనా లక్ష్మీశ్వర వరాపదుండవు నీవు నాకొఱకుఁ బ్రసన్నుండ వగుచు నీవు ప్రసన్నుండ వగు నన్నుఁ బరిపాలింపుమని లక్ష్మణాత్మజుండు వినుతించె నని మహాయోగిమాహాత్మ్యంబును శ్రీ

1. మూ లేదు.

వ. ఆ గోపురంబున దిగుదెంచి యందు గల పాంచరాత్ర్యయుండగు శ్రీ
నృసింహం గొనియాడి యతిపుంగవుండు వేంకట మహీధరంబున దిగు
దెంచి మున్ను పరకాలాదుల శేష రూపంబగు నగ్గిరి నారోహణంబుఁ
జేయకుండు టెఱింగి దాని నారోహణంబుఁ జేయకుండి యంత నందుఁగల
నిజ శిష్యులచేత మాటి మాటికిం బ్రార్థితుఁ డగుచు నా ఘనుండు నరుల
కశేషపాపంబుఁ బాపు నట్టి శేషనగేంద్రం బెక్కి యందు దనరు శ్రీశైల
పూర్ణమునిం గూర్చి వినయాన్వితుండగుచు దండంబు వెట్టి కల్మషాప
హంబును ముక్తిదంబును సార్థకంబును నగు స్వామి పుష్కరిణీ తీర్థంబు
నందు స్నానంబుఁ జేసి రమ్యంబగుఁ దత్తటంబు నందుఁ బరమంబగు
జపంబు జపియించి భూవరాహునకుఁ బ్రణమిల్లి పిదప శ్రీనివాస మంది
రంబుఁ గూర్చి చని యందుఁ గల శ్రీపతి యగు హరిం గనుంగొని ॥ 112

సీ. భాస్కర కోటి ప్రభా భాసమానుని
ఘనతర సౌందర్య కంబుకంఠు
శ్రీవత్స కౌస్తుభ శ్రేష్ఠ విభు వక్షు
చారు శరత్ఫుల్ల సారసాక్షుఁ
శ్రీకరాయత శంఖచక్ర గదాసి
శార్ఙ్గధారిఁ బలాది దానవిదారి
జగదధీశ్వరు దివ్య చందన స్రగ్విరా
జిత చతుర్భుజు సమున్నత శుభాంగు

తే.గీ. రక్తపంకజ పద యుగ్మ రమ్య గాత్రు
హారకేయూర కోటీర చారు కుండ
లాంగదా విభూషితు నమల చరితు
హరిఁ బరాత్పరుఁ బరమేశ నమరవినుతు 113

క. హరి యీ జగము గ్రహించి య
దరమునఁ జేర్చుకొని పెద్ద దడవునకును వి
స్ఫురణము గల్గాది సృష్టిం
దు రసికు సర్వేశ్వు నిన్ను సుభగు నుతింతున్ 122

సీ. విశ్వత శ్చక్షుషే విశ్వముఖాయ తే
సుముఖాయ విశ్వతస్పృతకరాయ
విశ్వపాదాయ తే శాశ్వతయాహారు
తుభ్యన్నమో యని దురితహారి
వగు నిన్నుఁ గొలుతు సహస్ర పాదుఁడవు స
హస్ర నేత్రుఁడవు సహస్రశీర్షుఁ
డవు పురుషుండవు భవనాభవగు నీవు
ఘనతర స్ఫూర్తి లోకములఁ గూర్చి

తే. గీ. యత్కృతివ్యర్థరాంగుళం బనెడు నిగమ
సూక్తి గైకొని వ్యాపించి సొంపుగు పొంది
దివ్యమగు నీదు మూర్తి నుతింతు నాఁడు
పద్మదళనేత్ర బుధమహా పద్మమిత్ర 123

వ. అమృతత్వంబున కీశానుండ వగుట నేనిపలన [1]వెగతియుంతేని వ్యాపింపని
వాఁడవు గాకున్కి భూతంబెద్ది భవ్యంబెద్ది తత్సుత్సంబు మాధవా ని
యందుఁ గల్గుటంజేసి విశ్వంబున కీవ పతివి జగంబునఁ గల్గు ప్రాణుల
కీశ్వరుండవు ప్రభుండవు నీవ హిరణ్మయుండవు భగవంతుండవు పరమా
త్మవు భువన మిత్రుండవు చరాచరంబున కీ వొక్కరుండవు శిక్షకుండ
వగుట వ్యానంబునం జేసి పరమయగు గతి ఏవతావ రమేశ్వరుండవగు

---

1 మూ. వగతి

నీ వకారశబ్దార్థుండవుగా మహామహుండ వగుచు నరుమహిమ యగుదువు
వేదాంతమునందీవ పరుండవు మహేశ్వరుండవు దేవుండవుంగాఁ బ్రతి
ష్ఠింపఁబడుచు నీవ పరమేశ్వరుండవు విరూపాక్షయనాయకుండవు యజ్ఞ
స్వరూపుండవుగ సర్వహంతుండవగుట నీవలన యిక్కాలము సామములును
సర్వంబులును గోపులును బరుషాదులును సముత్పన్నంబు లయ్యె. భవన్ముఖ
బాహూరుపదంబులవలన బ్రాహ్మణ క్షత్ర విట్ఛూద్రులు బుట్టిరి. భవత్పాదం
బులవలనఁ బృథివియు శిరంబువలన దివియు మనంబువలనఁ జంద్రుండును
జక్షుస్సువలన సూర్యుండును ముఖంబువలన నగ్నిమహేంద్రులును
బ్రాణంబువలన మారుతంబును నాభివలన బ్రహ్మాంతరిక్షములును
శ్రోత్రంబువలన దిశలును బ్రాదుర్భవించె నిఖిలా
సముద్భవంబగు జగంబంతయు నిర్విధంబైన సృష్టియందు నీవు గ్రమ్మఱ
గ్రసియింపుచు సూర్యనాభికిరణ మంది యుండినట్లుండు నాదికల్పవర్తంబు
నగుచుఁ దమంబునకంటెఁ బరంబగు జ్యోతిస్స్వరూపంబు నీవ యగుట
నయద్యుతుండవు నీవ యేకార్ణ విభూతంబగు జలంబునందు మాయా రూపఁ
బగు నశ్వత్థపత్రంబునందు నంతరిత జగద్రక్షకుండ వగుచు సనాత
నుండవుగా శయనింపుచు నప్ర తీకాశ్యుండవు నారాయణుండవు విష్ణు
స్వరూపుండవుగా నగుదువు బ్రహ్మరుద్ర దైవర్షి మానవులును రోదసీ
కుహరాంతరాళంబును సూర్యచంద్రులును నగ్నిలోకంబులును నక్షత్రా
దులును లేకున్న మఱియు నీచేతన సకలలోకంబులు సృష్టియింపంబడియె.
నీకు బ్రహ్మరుద్రాదులచేత దానవులాదంబగు సమస్త భువనంబు నిర్మింపబడి
నా దపై లేని నీలోకంబులెట్లు ప్రవృత్తంబులగు నని యడ్డనియె 124

ఆ.వె. నీవు నేరిచి నిరికి నేరవు శబ్ద సా
క్షికవు విగ్రహుండవు దేవ నీవు
సారసాక్షుండవు విచక్షణుండవు పుర
షోత్తముండవు లోక పూజితుండవు. 126

క. నీ దయ కాయంబు కరకు
గాఁదగు నాగైకమైన కళను జగం బు
త్పాదిత మగుచు వసించును
నీదయితా చిత్తలోల ప్రియకసపాలా 126

సీ. సర్వలోకేశ్వర శౌరి ప్రసన్న త
ంత్ర నీవు జగమ్ముఁ బరఁగు దారి
వ్యాప్తి దిరుగాగాఁ దనర్పు భక్తుల సర్వ
బంధంబుఁ బాసి శీఘ్రమ్ముగఁ బ్రోవ
పర మాత్మ పద్మాధిపాల కరుణా స
ముద్ర నీకై మోదమునను నొకటి
రెండు మూఁటను వాగ్గరిమం బైడింప
సాష్టాంగదండము సల్పువాఁడ

తే. గీ. వాడి కరకోపమున వ్యాధయాంతరమున నెఁ
తెలుఁగు నీకు నమస్కృతిఁ జేయువాఁడ
వెయ్యి శిరసులఁ బదములం వెలయు నీకు
మ్రొక్కు గావింతుఁ గరములు మోడ్చి భక్తి 127

ఉ. శౌరి యనంత రూప మధుసూదన దివ్యశరీర భక్త మం
దార పయోధిజార సముదార నిరంతర కీర్తిసార ప
ద్మారమణీమనోహర సుధాకర భాస్కరనేత్ర పద్మ న
వ్యారిగ బ్రోవు శేషగిరివాస ధరేశ విలాస వైభవా 128

## రామానుజుఁడు మరల శ్రీరంగమున కరుదెంచి యందే యతి వసించుట

సీ భువన నివాస మాధవ విశ్వపాలక
శౌరి నారాయణ సర్వసాక్షి
వేంకటేశ్వర భక్త వినుత నిరంతర
యోగిరాట్చిత్త పయోజ సంస్థి
తము లౌ శరణ్యంబు లమలంబులగు నీదు
పాద పద్మములకుఁ బ్రణతిఁ జేతు
నా కిది దక్క నన్యం బగు నట్టి యు
పాయంబు లేదు సత్యంబు సుమ్ము

తే.గీ నలువ నీ పాదములు గాని నరసిజాక్ష
యేమియును గోర దీయెడ నీదు కరుణ
నా యెడఁ జేర్పు మరవిందనాభ దనుజ
ఖండ మారుత వార్ధి నిశాంత కాంత 129

వ ఇతండె పరంబగు తత్త్వం బిదియె పరమంబగు పదం బీ క్షేత్రంబునకంటెఁ బరంబు లే దితనికంటెఁ బరంబగు దైవంబు లేదని మాటిమాటికి నిగమ సూక్తుల నర్థవృం గొనియాడి యంత రామానుజ మునీంద్రుం డందు మూఁడు దినంబు లుండి శ్రీశైల పూర్ణువలన శ్రీమద్రామాయణ రహస్యం బెఱింగి యతని యనుజ్ఞ వడసి యుత్తమం బగు సేతువున కేఁగి యందందుఁ గల నిఖిల హరిరూపంబులగు విగ్రహంబు సేవించి సకల సమయంబుల జయించి హరి మతంబు స్థాపనంబు గావించి క్రమ్మఱ శ్రీరంగ నికేతనంబున కేఁగుదెంచి యనవరతంబు వ్యాపకుండగు రంగనాయకు సేవింపుచు నందయధివసించి సర్వదేశన వాత్సల్యంబువలనఁ

పరిపూర్ణ కృపాంభోధి యగుచు నపార పాషండ దుష్ట తర్కిత దేవ దూష్యులచేతఁ గుయుక్తులం జేసి కల్పింపంబడియుఁ బ్రాప్తంబులగు నాసుర శాస్త్రంబులు సమస్త జగంబునకు నిబిడంబు లగుచు హరి వైభవంబు గాన రాకుండఁ గప్పికొని లోకంబు సంకరంబు గావింప వైష్ణవం బుద్ధరింపు కొఱకు మహానుభావుండగు లక్ష్మణార్యుం డుత్తమంబగు శ్రీభాష్యంబు గావించి పాషండ బౌద్ధ చార్వాక మాయావాద్యుక్తతాదికంబులగు కుత్సిత మతంబుల నణఁచి యొక్కడి విష్ణుప్రియుల మైంబును మహనీయంబును నగు పారాశర్య ముని మతం బొక్కటి ప్రకటంబుగావించి యనంతరంబు

సీ. ధర యందుఁ గూరేశ దాశరథార్యు లం
 ద్యులగు శిష్యవరులు పలువురచేత
పూతుఁ డగుచు సంపూర్ణ మనస్కుండు
 రామానుజార్యుండు రమ్య గుణుఁడు
సారస నేత్రుని సత్ప్రస్తుతములు నెను
 దినము వారల కుపదేశ మిచ్చి
శ్రితకల్ప భూజమై శ్రీరంగనాథుఁ గైం
 కర్యంబు సేయుచు ఘనత మించి

తే.గీ. యిట్లు ప్రాణసమానుఁ డౌచు సఖిల యము
కథిత సుధరూప ముగుదట్ట యమృత మొసఁగు
బంధు వసియించె నిర్మల స్వాంతుఁ డగుచు
నరుదెసంబున యోగసమాధినుండి 181

## రామానుజుఁడు యోగంబు గైకొని పరమపదంబునకరుగుట

వ ఇట్లు చిరకాలంబు గడపి యతిపుంగవుండు సమున్నతంగయోగంబు గైకొని సుషుమ్నా నాడి నిష్క్రమించి పరమపదంబుఁ బ్రాపించె నిగమాంత శాస్త్రకారుండగు లక్ష్మణ మునీంద్రుని యేతత్కథ యెవ్వండు విను నతండు భాగవత భక్తి మహోత్తముండై వెంది విధి శివ సనకాది దుర్లభంబగు నచ్యుత పదంబుఁ జేరు నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తరఖండంబు నందలి యష్టత్రింశా ధ్యాయంబు భక్త పరాయణుండగు నారాయణుండు నిఖిల విద్యాధురంధరుండగు వరునకుం జెప్పి వెండియు నిట్లనియె,

## హర్యర్చావతార ప్రభావము—భాగవత పూజా ప్రభావము

మ అం పన్నిద్దరు సూరు లిట్టగమునం దానంద సంధాయులై
కలయన్ భాగవత ప్రధాను లగుచున్ గౌరూపాలస్వాంతులై
యుం నన్ను త్పరమ ప్రియార్థ్యులగ నెంతే నిష్ఠ వర్తిల్లుచో
లతి మత్ప్రీతి సమాన మూర్తులు సుఖీ లక్షింపఁగాఁ బ్రతా 188

సీ పంతతి సంతాన పారత్వశిరాయక
 బంధవిత్రత్ప్రభృతి నిష్ఠులంకంటె
సంతతాధోక్షజ సంస్మృతి రతులై
 తనరారు సనకాది మునులకంటె
ఘనతర యోగంబు గల్గు సర్వజ్ఞమహా
 తాపస ముఖ్య సంతతులకంటెఁ
గరము విశాల యోగధ్యాన మూర్తులై
 స్ఫురణించునట్టి భూసురులకంటె

తే.గీ. ఇమ్మహాభాగవతులను నెవ్వఁ డర్చఁ
జేసి శ్రీ విష్ణుని పదంబుఁ జెంది రట్టి
వారల పఠింపుమయ్య మర్త్యులకు నగుట
నిన్ను వేఁడెద దివ్యుఁడ నిర్మలాత్మ 139

ఉ. శ్రీహరి భక్త భక్తుల విశిష్ట చరిత్రము సర్వకల్మష
ప్లోషహ మై వెదనంబు సతతోర్జిత భాగ్యదయంబు దుష్టవి
ద్యా హననంబు ముక్తి కౌతుకై తగుదాని వినంగ నిష్ఠ నా
కీహ జనించె నెక్కు పఠియింపు మహాత్మ యటన్న నిట్లనెన్ 140

## దుశ్శీలుని చరిత్రము

ఆ.వె. పటిమ మున్ను విప్రబంధుండు దుశ్శీలుఁ
డనెడు వాఁడు నొక్కఁ డలరుఁ గలుష
చార హింసయందు సొంపొందువాఁడు కా
ముకుఁడు క్రూరుఁ డగుచుఁ బాలుచు నెపుడు 141

సీ. బ్రహ్మహత్యయు సురాపానంబు గోవధ
యును స్త్రీల జీవనంబును గొనుటయు
మొదలుగాఁ గల కర్మములయందు దక్షుఁడై
పొలుచువాఁ డన్యరతంబు దలఁచువాఁడు
దుశ్శీలుఁ డత్యంత దోషకుండగుచుఁ గాం
చి విరాట యౌవనశ్రీఁ దనర్చు
వనరుహాక్షిని నిషాదిని సతిగా నేలి
కరము నిషాద సంఘముల తోడ

తే.గీ. మూర్ఖ యే రీతి ఘోరసముద్ర మీవు
దాఁట గలవని పల్కుఁడు తద్వచనము
విని మగుడ వారలంత నిట్టు లనియె దుర్మ
దాంధుఁ డగుచున్న దుష్టుఁ డతిరయమున 146

తే.గీ. ప్రాణమంతంబె నెక్కుడై పరఁగి నూఱ మొ
సంగు నిల్పాలి నెఱదాని సరసులైన
యాత్మబాల విధి భాగవతార్చనంబు
నెట్లు సేయంగ వలయు మునీంద్రులార 147

క. అని పల్క మూర్ఖవాక్యము
విని భాగవతోత్తములు గభీరోక్తం బిం
పున గొని వచ్చుచు మూఢా
త్మునిఁ గాంచుచుఁ గూర్చి యనిరి తోషకు లగుచున్ 148

ఆ.వె. దుఃఖ మొసఁగునట్టి తౌర్యత్రిని సుఖంబు
నిచ్చుదాని గాను నీవు దలఁచె
దెట్లు మోహ మడిగి యాత్మంపు స్త్రీ శరీ
రము దాగిప్పితం బరాగ మగుట 149

వ. చర్మమాంసాస్థి మేదోరుధిర విణ్మూత్ర నఖరోమ మజ్జాశుక్లాది పూర్ణంబును హేయంబును దుర్గంధ సంయుతంబును నగు స్త్రీ శరీరంబు సుఖరూపంబని చెప్పరాదు శ్లేష్మసదనంబగు వదనంబును సుదీర్ఘ దూషికా పాత్రంబులగు నేత్రంబులును నిశ్వాస నిర్గమాంతస్థ సింఘాణావభాసికయగు నాసికయు,

చ. విరివి నధీతవేదుఁ డగు విప్రవరోత్తముఁ డన్న నెన్నఁగా
స్థిర నవధీతవేదుఁ డగు శ్రీహరిభక్తుఁడు దాన ముఖ్యతం
బరఁగును భక్తిహీనుఁడు ద్విపాత్ర్యుఁడై తగుఁగాన నెన్నఁటన్
హరిపదభక్తి యుక్తుఁడగు వాఁడు శ్రేష్ఠతముండు మిక్కిలిన్ 178

ఆ.వె. అతఁడు శూద్రుఁడైన హరిభక్తుఁడగునేని
యరయ భక్తిరహితుఁడైన వేద
విదునికన్న నెక్కుఁ డదిగాక హరిభక్తి
[illegible] డధముఁడగు ద్విపాతకన్న 179

కం. భగవద్భక్తి విహీనుం
డగువాఁడె క్రియ[1]లోపవర్తి యని యెల్లను డెం
పుగ రాక్షస[2]కర్మము లవి
నిగదిత మగు వాఁడు చెందు నిరయం బందున్ 180

తే.గీ. స్థిరముగా విష్ణుబింబ ప్రతిష్ఠ తన్న
నిల మహాత్ముఁ డగు వైష్ణవుం బ్రతిష్ఠ
నలరఁ గావించు వాఁడు శతాధికముగు
ఫలముఁ బ్రాపించు నని బ్రహ్మవాదు లనిరి 181

సీ. బ్రాహ్మణాదిక చతుర్వర్ణజాతుల వారు
హరిలాంఛనాంచితు లగుచు నెపుడు
నఖిలంబు నందగు హరియందు నర్పిత
సర్వార్థు లగుచున్న సాధులైన

---

1 మూ. లోపవర్తి 2 మూ. కర్మంబని

క. తులసీకానన మొనరిచి
తులసీదామముఁ బ్రియ మెసఁగఁ బోషింపన్
దలకొను నెవ్వఁ డతనిచే
నల హరి పూజితుఁడు నైన యటులగు విధిచేన్ 186

చ. వారినిఁ బ్రతిష్ఠఁ జేసి నియమాయతిఁ బ్రాంతం నుత్సవంబులన్
స్థిరమతి నెవ్వఁ డర్చనలు సేయు దలంచు పితామహాధికా
మరతతిచేత నిత్యము సమర్చితుఁడై చెలువొంది వెండియున్
బరమపదంబు నంది పరమంబగు మోదముఁ గాంచు నెంతయున్ 187

శా. శ్రీ సీతా ధరణీ సరోజముఖులన్ శేషున్ విహంగేశ్వరున్
సేనేశున్ మునియున్ ముకుంద పరిషచ్ఛ్రేణిన్ మహాభక్తి భ
క్తానేకంబుఁ బ్రతిష్ఠఁ జేయు మఱి యుద్యద్విష్ణు నెవ్వాఁడు ని
ర్వాణానందంబును బొందు వాఁడు వారితో సత్యంతమున్ గూడుచున్ 188

తే.గీ. అమల కోమల తులసీ దళావళులను
నార్తభక్తి సాలగ్రామ పూజ సేయు
నెవ్వఁ డతనికి లక్ష్మి లక్ష్మీశ్వరుండు
నాదిదంపతు లటఁ బ్రీతు లగుదు రెలమి 189

క. గురుఁడే సాక్షాద్ధరి యగు
గురుని ప్రియమె హరిప్రియంబు గురుభక్తతచే
హరి తుష్టుం డగుఁ గావున
గురుపూజ యొనర్పవలయుఁ గోరి నరుఁ డిలన్ 190

ఆ వె. చేసి త్రిదండధరుని విజ్ఞానసాధనున్
యతినిఁ గని ప్రణామ మాచరించి
పూజ సేయ వలయు భువి వరుం డందుచే
మహిని విష్ణుభక్తిమంతుఁ డగుచు 191

వ. సర్వమంగళ మాంగళ్యంబును సర్వశ్రేయః ప్రదాయకంబును మహాయోగి మాహాత్మ్యంబును ముక్తిప్రదంబును నాయుష్యంబును శ్రీకరంబును భద్రంబును యశస్యంబును విద్యావహంబును ధర్మ్యంబును బవిత్రంబును పాపఘ్నంబును నారోగ్యకరంబును సుతప్రదంబును నగు నీ పురాణంబు ను విని వినిపించిన సకల వేదశాస్త్ర ఫలంబును సర్వయజ్ఞ ఫలంబునుం బొంది హరికిఁ బ్రియతమత్వం బొందు మఱియుం బుత్రకాముండు పుత్రులను ధనార్థియగు నతండు ధనంబును సంపత్కాముండు సంపదయును ముక్తికాముండు ముక్తియుం గాంచు వినంబడిన సర్వార్థసిద్ధిం జెంది యనంతరంబ పరమపదంబునం బ్రాపించు నదియునుంగాక యేతత్పుస్తకంబు లిఖియించి మహాత్ముండగు వైష్ణవునికొసంగిన కృతార్థుని గృహంబున నిత్యంబును ననపాయినియై సిరి వసించు నిద్ది పరమపదనాథుండగు విష్ణుదేవునకు నతిప్రియులగు ద్వాదశ మహాయోగి చరిత్రంబు విని విశ్వసించు వారలను చిరకాలంబు నుండి పాయని ప్రకృతివలన విముక్తుం గావించునని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి చతుర్వింశాధ్యాయంబునుం గూడి పురాణంబు సమగ్రంబుగా భక్తపరాయణుండగు నారాయణుండు విధిం బ్రజ్ఞా ధురంధరుండగు వరునికిం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పి వారిం గృతకృత్యులం[1]గావించె 192

---

1 మూ గావించి

చ. ంచర కూర్మ కోల మృగనర త్రయ వామన భార్గవాఖ్యయా
ద్వ్యల రఘువీర సీరధర సౌగత సాది మ్లేచ్ఛ స్ఫుటాకృతి
దళితఖలాది దేవమునినాథ నుతి స్ఫురణా కృతాదృతి
కలిత భక్త రక్షణ విచక్షణ సాధు కటాక్ష సంతతీ 103

క. రాజీవదళ విలోచన
రాజీవభవాండ భాండ రక్షా నిపుణా
రాజీవధ్వజ జనకా
రాజీవగృహా మనోజ్ఞ రాజీవకరా 104

మాలిని. దురితవన కుఠారా ధూర్జటి స్తోత్రసారా
పరమపద వినోదా భక్తలోక ప్రసాదా
సరస దనుజారా సర్వ దేవాధిదేవా
విరచిత సత్కీర్తి వేణుగోపాల మూర్తీ 105

గద్య. [1]ఇది శ్రీమద్రాజ గోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణాలబ్ధ పాండిత్య ధుర్యానవరతావనీమండలాఖండ సామ్రాజ్యధౌరేయ స్వదమర్దితాకృత పటహధణంధణారావ విపరీత పతన క్రియా ఢిల్లీకాధీశ దుందుభి ధ్వాన కోలాహల హనూమద్ధ్వజాంక కనక దండీకృత హీర వలీకృత సందీపిత ప్రతాప కీర్తి ప్రభావ కోసల వంశ పయః పారావార రాకాసుధాకర పీతాంబర నాయక పౌత్ర రమణ భూపాల పుత్ర లక్ష్మమాంబా గర్భ శుక్తి ముక్తాఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్య శీల సుమసాయక విహారి హేమనాయక ప్రణీతంబైన భార్గవ పురాణంబునందు యయాతిరాజ

1 ము. ఇతి

సంభవంబును పరధరాఽస్త్రవంబును లక్ష్మణుండు యాదవప్రభావం బనుగ్రహించుటయు పతం బక్షోత్తరాత హరిక్షేత్రస్థాపనంబు గావించుటయు విశిష్టమత సిద్ధాంతంబును యజ్ఞమూర్తి సరాయ వివంగం బును పతండు రామానుజాచార్యానుగ్రహంబు గాంచుటయు యతీంద్రుండు శ్రీరంగంబునం దధివసించుటయు నమ్మహాత్ముండు పరమపదంబున కరుగుటయు సూర్యావతార ప్రభావంబును భాగవతపూజావిశేషంబును నన్నది యష్టమాశ్వాసము సర్వము సంపూర్ణము ,

యతులును దుంబీ సరసీరుహాక్ష మాలికా బంధురకంధరులును భుజామూల ప్రాంతర వారాయత శంఖచక్ర చిహ్నులును (ద్వయమం) త్రానుసంధాన చరితార్థులును దదర్థానుభవానంద పులకితాంగులును పరిశ్రాంతశరీరులును జితేంద్రియులును భగవద్దాస్య యోగైకభోగులును నాచార్య నిష్ఠాగరిష్ఠులును నిజపాదకమల ధ్యా(నంబు)న నఖిల ధరణీ మండలంబు పావనంబు సేయు నమ్మహానుభావులు స్నేహప్రసన్న హృదయులైన భగవద్దాసానుదాసుండగు నారాజు గృహంబు పూర్వంబు భాతి ప్రవేశించిన

క వారల మంత్రిప్రేరణ వారించుచు నేత్రములను వారిం గని దా
వారికుల నల్పి యత్తఱి నారాధిం బల్కె నిట్టు లఖిల జనమూర్తి

తే.గీ ఇప్పు డంతఃపురమున మహితలేశుఁ డువిదతోఁ గూడ సుఖగోష్ఠి నున్న వాఁడు
చనుఁడు వైష్ణవులార భూజాని నరకు వచ్చి నప్పుడు మీ రిందు వత్తు రనుచు

సీ అది విని భాగవతాగ్రణు లాఁగాక యని వైష్ణవ గృహాంగణాధివసతి
యొగి కిటములం జేసి మాత్తిదం బగునని యన్యోన్య వాక్యము లాడుకొనుచు
వేదికయందు నివేశించి రటుగాన క్షితి భగవద్దాసశ్రీలు రైన
సత్వవంతులును రోషము గల్గ నేర్చునే యంత నా ధారుణీకాంతుఁడు వరి

తే.గీ వారి ముఖమున వైష్ణవతన విరోధనంబు విని సత్వరమున శుభంబు గాంచ
శయనమువలన లేచి వైష్ణవుం డకట యా విధంబు విరోధంబు లెందు గలదె

క అనిరుద్ధ భక్తులగు వార నిరుద్ధులు! చేసితి నీ యపరాధము నే
నని చింతించి మహిపతి చని వారి సమీపమునకు సాధ్వసమతియై

ఉ వారి పదారవిందములు వ్రాలి నమస్కరి చేసి పాణిపం
కేరుహముల్ మొగిడ్చి నృపకేసరి పల్కె దయానిధుల్ క్షమా
సారులు మీరు మిమ్ము గనుఁగఁ జాలని మంత్రి కృతాపరాధమున్
జేరి క్షమింపరే శరణుఁ జెందితి దాసుఁడ నందు వేడినన్

## అనుబంధము - II

# ఛందస్సూచి

| క్ర సం ఛందస్సు | ఆశ్వాసము | | | | | | | | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | | |
| 1 ఆటవెలఁది | 9 | 12 | 6 | 2 | 14 | 7 | 11 | 8 | — | 69 |
| 2 ఉత్పలమాల | 3 | 4 | 4 | 8 | 8 | 4 | 7 | 4 | — | 42 |
| 3 ఉత్సాహవృత్తము | — | 1 | — | 1 | — | — | — | — | — | 2 |
| 4 కందము | 47 | 52 | 43 | 67 | 55 | 103 | 89 | 66 | — | 521 |
| 5 చంపకమాల | 17 | 6 | 9 | 14 | 8 | 15 | 27 | 10 | — | 106 |
| 6 తేటగీతి | 33 | 42 | 36 | 39 | 38 | 65 | 29 | 41 | — | 323 |
| 7 తోటకము | — | — | — | — | — | 1 | — | — | — | 1 |
| 8 పంచ చామరము | — | — | — | — | 1 | — | — | — | — | 1 |
| 9 భుజంగప్రయాతము | — | — | — | 1 | — | — | — | — | — | 1 |
| 10 మత్తేభము | 14 | 5 | 3 | 10 | 9 | 11 | 10 | 3 | — | 65 |
| 11 మాలిని | 1 | — | 1 | — | — | — | 1 | 1 | — | 4 |
| 12 శార్దూలము | 1 | 2 | — | 4 | 3 | 1 | 5 | 2 | — | 18 |
| 13 సీసము | 21 | 25 | 19 | 33 | 37 | 36 | 29 | 34 | — | 234 |
| 14 వచనము | 35 | 29 | 24 | 16 | 11 | 9 | 22 | 26 | — | 173 |
| మొత్తము | 181 | 173 | 144 | 195 | 174 | 258 | 230 | 195 | — | 1649 |

# పద్యసూచి

ఖ



గ

# అనుబంధము - III (b)

## వ చ న సూ చి

# అనుబంధము - IV

## ఉపయుక్త గ్రంథసూచిక

తెలుగు


1 అవతారిక పరిణయము - కిడాంబి వేంకటాచార్యులు

2 ఆంధ్రకవి సప్తశతి - బులుసు వేంకటరమణయ్య

3 ఆచార్యరత్నహారము - వంగల సీతారామాచార్యులు

4 ఆచార్యసూక్తి ముక్తావళి - వంయారి కేశవాచార్యులు

5 ఆముక్తమాల్యద - శ్రీ కృష్ణదేవరాయలు

6 ఆముక్తమాల్యదా సౌందర్యము - డాక్టర్ టి. కోటేశ్వరరావు

7 దాశరథి చరిత్ర - నంపెరుమాళ్ల పురుషకారి కేశవయ్య
పరిష్కర్త వల్లపురెడ్డి బుచ్చారెడ్డి

8 పరమయోగి విలాసము - తాళ్లపాక తిరువేంగళనాథుడు

9 మరుగుపడిన మాణిక్యాలు - డాక్టర్ బి. రామరాజు

10 విశిష్టాద్వైత దర్పణము - కుంటిముక్కి శేషశర్మ

11 శఠకోప చరిత్ర - శ్రీధరణరేయు

12 శ్రీమదాంధ్ర భాగవతము - పోతన

13 శ్రీ మహాభక్త విజయము—గురుపరంపరా ప్రభావము-మేడేపల్లి వేంకటరమణాచార్యులు

14 శ్రీ రామానుజ కీర్తిమూర్తి - సంపాదకులు శ్రీ త్రిదండి రామానుజ జీయర్

15 సమగ్రాంధ్ర సాహిత్యం, 12వ సంపుటం - ఆరుద్ర

16 సర్వ సిద్ధాంత సౌరభము — సప్తమ ఖండము - పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ అనుభవానందస్వాములవారు

17 సిరినోము — బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సంస్కృతము

18 అమరకోశః - అమరసింహుడు

19 ఋగ్వేదః

20 ఛాందోగ్యో పనిషత్

21 తైత్తిరీయారణ్యకమ్

22 దివ్యసూరి చరితమ్ - గరుడవాహన పండితుడు

23 నారద భక్తి సూత్రాణి

24 ప్రపన్నామృతమ్ - అనంతాచార్యులు

25 భక్తిరసామృతసింధుః - రూపగోస్వామి

26 భార్గవ పురాణమ్

27 మహాభారతమ్

28 రఘువంశః

29 రామాయణమ్ - వాల్మీకి

30 విష్ణుపురాణమ్

31 వేదాంతదేశిక స్తోత్రాణి

32 శాండిల్య భక్తి సూత్రాణి

33 శ్రీభాష్యమ్ - భగవద్రామానుజులు

34 శ్వేతాశ్వతరోపనిషత్

35 స్తోత్రరత్నమ్

### కన్నడం

86 నగరవాదదర్పణ – మహాకవి లక్ష్మీనారాయణ సంఘ సురపుర।
సంపాదకులు బెట్టపట్నం కృష్ణమాచార్య

87 సురపుర సంస్థాన ఇతిహాస – కపటరాళ కృష్ణరావు

88 సురపుర సాంస్కృతిక ఇతిహాస – పండితరత్నం పెరుమాళ్ల గుండాచార్యులు

### తమిళం

89 గురుపరంపరాప్రభావమ్ - పిన్బళగియ పెరుమాళ్ జీయర్

### *English*

1 A Seminar on Saints

2 Complete works of Swami Vivekananda

3 Early History of Vaishnavism in South India -
D N K S Krishna Swami Ayyangar

4 History and the Culture of the Indian People -
Dr D C Sarear

5 History and the Culture of the Indian People – K M Munshi

6 History of Religion, Thought and Life in India
- Prof Monier Williams

7 History of Aurangajeb - Prof Jadunatha Sarear

8 Indian Philosophy - Dr S Radha Krishnan

9 Introduction to Vedanta - Dr P Nagaraja Rao

10 Materials for the study of Early History of the
Vaishnava Sect Prof Hemachandra Roy Choudhuri

11 Narada Bhakti Sutra – Swami Sivananda

12 Outlines of Hindu Philosophy - V T Srinivasa Ayyangar

13 Reign of Realism - Dr R Nagaraja Sarma

14 Ramananda to Ramatirtho - Dr Nicole

15 The Brahma Sutra - Dr S Radha Krishna

16 The Cultural Heritage of India Swami Thyagesa namda

17 The Great Acharya - Prof M Ranga Charya

18 The Great Acharyas Dr K Krishnaswami Ayyangar

19 The History of Sri Vaishnavas - Prof T A Gopinath Rao

20 The Life of Ramanuja Swami Rama Krishnananda

21 Vaishnavite Reformers of India Prof T Raja Gopala Chariar

Journals

1 Aradhana

2 Prabuddha Bharata

3 Vedanta Kesari



# A P Govt O M L & R I
# Publication Series

| | | Rs Ps |
|---|---|---|
| 1 | Seeta Kalyanamu (Telugu)<br>*by Sri Shahajee Maharaja Bonsle* | 3 75 |
| 2 | Sringara Padamulu (Telugu)<br>*by Unkown poets of antiquity* | 4-40 |
| 3 | Indumatee Parinayamu (Telugu)<br>*by Tenali Ramabhadra Kavi* | 4-00 |
| 4 | Sree Geeta Govindam and Sree Geeta Sankaram (Sanskrit in Telugu Script)<br>*by Sri Jayadeva Kavi &*<br>*by Sri Pancharatnakavi Anantacharya* | 3-75 |
| 5 | Radha Vamseedhar Vilas Natak (Hindi)<br>*by Sri Shahajee Maharaja Bonsle* | 3 75 |
| 6 | Enugula Veeraswamy's Journal (English)<br>(*Kasiyatra Charitra translat d into English*) | 14 00 |
| 7 | Sree Virupaksha Sreerama Copper Plate Inscriptions (1576-1644 A D) | 50 00 |
| 8 | Vaikrita Chandrika (Telugu grammar in Sanskrit)<br>*by Manchella Vasudeva Kavi* | 38 00 |
| 9 | Naradeeya Puranamu (Telugu)<br>*by Alladu Narasimha Kavi* | 65 00 |
| 10 | Kavi Chintamani (Telugu)<br>*by Vellanki Tatambhattu* | 25 00 |
| 11 | An Alphabetical Subjectwise Index of Telugu Manuscripts in A P G O M L & R I | 47 00 |
| 12 | Udayanodayamu (Including Vanamali Vilasamu)<br>*by Narana Surana* | 153 10 |

| | | |
|---|---|---|
| 13 | Arsha Kutumbamu<br>*by Sri Vasireddy Durgasadasiveswara Prasad* | 47-00 |
| 14 | An Alphabetical Subjectwise Index of Sanskrit Manuscripts available in A P G O M L & R I , Vol *I* | 26-00 |
| 15 | Tarakabrahmaraajeeyamu<br>*by Chintalapudi Ellanarya* | 34-00 |
| 16 | An Alphabetical Subjectwise Index of Urdu Etc Manuscripts | 39 00 |
| 17 | Alankara Makarandah (Sanskrit) (Telugu Script)<br>*by Rajasekhara Sudhi* | 33 00 |
| 18 | Nahush Natak (Hindi)<br>*by Giridharadas* | 36 00 |

**Latest Publications**

| | | |
|---|---|---|
| 19 | Vajragiri Narasimha Satakamu<br>*by Asakanuri Rangadhama Kavi*<br>Ramaraja V[illegible]es Satakamu<br>*by Kotikilapudi Kodanda Kavi* | 17 00 |
| 20 | Yoga Sakraparineyamu (Telugu Poetry)<br>*by Maddipatla Appana Sastry*<br>and<br>*Kotra Venkata Rama Kavi* | 67-00 |
| 21 | Bhargava Puranamu (Telugu Poetry)<br>*by Bahiri Pama Nayakudu* | 95 00 |
| 22 | Mustalhat i Thaggi (Urdu)<br>*by Akbar Ali Alhabadi* | 93 00 |
| 23 | Telugu Descriptive Catalogue Vol *I* | 58 00 |
| 24 | „ „ Vol *II* | 58 00 |

